# పదచిత్ర రామాయణ పరమార్థ సిద్ధి

ఇ ది "శ్రీ పదచిత్ర రామాయణ–సుందరకాండము'. రచయిత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు.

ఆదికవి వాల్మీకి రచించిన సంస్కృత రామాయణం బహుభాషల్లో బహుకవులు చూపిన భక్తిశ్రద్ధలతో క్రొత్తరూపు సంతరించుకొన్నది. ఆధ్యాత్మ రామాయణం, ఆనంద రామాయణం, అద్భుత రామాయణం, భాస్కర రామాయణం, గోపీనాధ రామాయణం, మొల్ల రామాయణం, మొదలుగా ఎన్నో రామాయణాలు వెలువడినాయి. ఆధునికయుగంలో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షము మొదలైనవి వెలువడినాయి. "మరల నిదేల రామాయణం?" అనే ప్రశ్న ఆయనగారికి స్ఫురించింది. "తలచిన రామునే తలచెద నేనును, నా భక్తి రచనలు నావిగాన" అని జవాబూ చెప్పుకొన్నారు. "ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది నవకథాధృతిని మించి" అనే సిద్ధాంతాన్ని కూడా ఆయన స్మరించుకొని రచన నిర్విఘ్నంగా కొనసాగించారు.

మఱి ప్రస్తుత 'శ్రీ పదచిత్ర రామాయణ' రచనకు ప్రేరణ?

జొన్నలగడ్డ కవిగారి గుండె 'రామునికడ తిష్ఠ వేసిన'దట. రామ చరిత మనోగతమై బొమ్మ వెంట బొమ్మ తఱుముకొని వచ్చాయట. కథాధార విపులమై పదచిత్రాలు ప్రసన్న సుందరంగా కనిపించాయి. ఆ మాటే అన్నారు కవిగారు–

ఇవి పదచిత్రముల్, వరున యేర్పడె, నన్నిట హృద్యపద్య సు
చ్ఛవి కదలాడె; పద్యముల ఛందపు రూపము భిన్న భిన్న మ
య్యె; విపుల దృశ్యభాగము లవెన్నియొ గాథల రూపమెత్తె; నా
కవనము చిత్తశుద్ధి పరికల్పితమైనది – తేటమాటలన్"

ఇదుగో ఈ కారణం వల్లనే ఇది పదచిత్ర రామాయణమైనది.

పదచిత్ర రామాయణం రెండేళ్ళ క్రిందటనే నాలుగువేల పద్యాలతో మూడు కాండలు పూర్తి చేయగలిగారట. ప్రస్తుతం ముద్రితమై మన చేతి కందివచ్చిన కాండం సుందరకాండం. ఉపక్రమం కాక ఇందులో 1162 పద్యాలున్నాయి. కథ వాల్మీకుల వారిదైనా కథనక్రమం జొన్నలగడ్డ వారి వ్యక్తిగతం.

రామాయణంలోని ఆరు కాండల్లో – అంటే బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండల్లో – సుందరకాండను తక్కిన అయిదు కాండలకంటె విలక్షణంగా సౌందర్యాపాదనం జరిగింది. సౌందర్యమంటే సుందరత్వ లక్షణం కదా! సుందర శబ్దానికి నిఘంటువు లిచ్చిన అర్థం విలక్షణం. "సుతరాం ఆద్రియతే ఇతి సుందరమ్". సహృదయులు దేనిని ఉత్కటంగా ఆదరిస్తారో అది సుందరమైనదని స్పష్టం. ఈ సుందరకాండ సహృదయ లోకాన్ని అంత ఉత్కటంగా ఆకర్షిస్తుంది. కనుక దీని పేరు సార్థకమైంది. మఱి పదచిత్ర రామాయణ సుందరకాండలో పదంపదంలో చిత్ర విచిత్రమైన కథా చిత్రాలు కనిపిస్తాయి. కనుక దీని పేరు కూడా సార్థకమే.

రావణాపహృత అయిన సీతాదేవిని అన్వేషిస్తూ బయలుదేరే ఆంజనేయుణ్ణి రంగంలో ప్రవేశపెడుతూ మొదలౌతుంది సుందరకాండం.

"తతో రావణ నీతాయాః సీతాయా శ్శత్రు కర్శనః
ఇయేషపద మన్వేష్టుం చారణాచరితే పథిః"

ఈ శ్లోకానికి జొన్నలగడ్డ వారి పదచిత్రణ –

'అంతట శత్రుకర్శనుడు హోళి పొసంగగ లోదలంచె, వ
న్యంతర రావణాపహృతయైన మహా సతి సీతఁగూర్చి; నా
వంతున కీ యదృష్టము వచ్చెనంచును, నిర్ణయించె – వే
యంతలు చారణా చరితమైన పథంబున సాగిపోవగన్.

ఆంజనేయుడు ఆకాశ పరిలంఘనం చేసి, లంకలో ప్రవేశించి, అశోకవనంలో సీతాదేవిని దర్శించి, ఆమెకు గుర్తుగా రామాంగుళీయకం ఇవ్వటం, ఆమె తన గుర్తుగా రామచంద్రునికి చూపటం కోసం తన చూడామణిని ఆంజనేయుని కివ్వటం, అతడు తిరిగి వెడుతూ లంకను కాల్చటం, కిష్కింధకు పోయి రామచంద్రునకు సీతాదేవి చూడామణినిచ్చి ఆమె సందేశాన్ని తెలియజేయటం సుందరకాండ లో ప్రధాన కథాంశాలు.

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు కవిగా మాత్రమేకాక, కథారచయితగా కూడా సుప్రసిద్ధులు. నలభైయేళ్ళ సాహితీ ప్రస్థానంలో కవిత, కథ – రెండు కన్నులుగా పురోగమించిన, ప్రజ్ఞాశాలి. వీరి 'చలనమ్', 'కలం కన్ను' అనే కవితా సంపుటాలు, 'చలిలో సూర్యుడు', 'గుండెలో కోయిల' వంటి కథలు సుప్రసిద్ధ కవిపండిత సాహితీ విమర్శకుల అభినందన లందుకొన్నాయి.



ప్రస్తుత రామాయణ సుందరకాండలో కవితా కథాకథన నైపుణ్యం మూర్తిగారిని కవితా కథా వన'విహారి'గా మనకు ప్రత్యక్షం చేస్తుంది. పద్యాల ఛందోరామణీయకం ఈ నైపుణ్యానికి మఱింత నైగనిగ్యం కూర్చింది. త్రిపదలు, ద్విరదగతులు, మధురగతులు, కవిరాజ విరాజితాలు, ద్విపదలు, ఇంద్రోపేంద్ర వ్రజాలు, మత్తకోకిలలు, అల్పాక్కరలు, మధ్యాక్కరలు, ఉత్సాహాదులు– భావోచిత పదచిత్ర సౌభాగ్యానికి ఎంతగానో ఉపకరించాయి. ఛందోగతి భావాన్ని రసానుకూలంగా పరుగులెత్తించింది.

ఈ సుందరకాండ కథాంతంలో రామచంద్ర, సీతాసతీ, లక్ష్మణ, హనుమంతుల్ని సంబోధిస్తూ కవి విహారి పద్మనాభ వృత్తాన్ని ప్రయోగించటం దశావతార మూలతత్త్వమైన శ్రీహరిని స్మరించటమే. పద్మనాభుడు శ్రీ మహావిష్ణువే కదా! పద్మనాభ వృత్తం 7 తగణాలపైన 2 గురువులతో సాగుతోంది. 5వ తగణం మొదటి అక్షరంతో యతిమైత్రి. ప్రాస మామూలే.

శ్రీరామ! విశ్వంభరా పుత్రి చిత్తాబ్జసీమా ప్రవిష్ట ప్రభావాంశుకామా!
శ్రీరామ రామామణీ సీత! సుశ్లోకరిష్ట ప్రదాతా! సుచేతః ప్రపూతా!
శ్రీరామ రామాభవిష్యార్థ లక్ష్మార్థశీలా! సుమిత్రా వాత్సల్యజాలా!
శ్రీరామ సంభావనా కల్పసంకల్ప చేతః ప్రమేయా! హరీ – ఆంజనేయా!(1161)

కవి విహారి తన శ్రీ పదచిత్ర రామాయణ సుందరకాండ ముగిస్తూ పలికిన కందం ఆనందకరమై సహృదయ లోకాన్ని అలరిస్తుంది.

"శ్రీదము రామస్వాంతము, శ్రీదము సీతాకటాక్ష శీతస్ఫీతం
బాదర్శిత మాధుర్య కథాదర్శము సుందరమిది యానందించన్

(1162)

కావ్య పరమార్థం సహృదయానందమే కదా!

ఈ పరమార్థాన్ని పదపదాన చిత్రవిచిత్రంగా సాధించిన సత్యనారాయణమూర్తి కవి కృతార్థుడు. అందుకే ఈయనకు నా సహృదయాభినందన.

'సాహిత్య బ్రహ్మ'
**డా॥ వి.వి.యల్. నరసింహారావు,**
రిటైర్డ్ డైరెక్టర్, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ, హైదరాబాద్.

# సౌందర్య దీపిక

'నా కవనము చిత్తశుద్ధి పరికల్పితమైనది తేటమాటలన్' అని ఆత్మ ప్రత్యయంతో, సముచిత ప్రతిభతో రూపొందించిన శ్రీ పదచిత్ర రామాయణంలోని సుందరకాండ – శ్రీ విహారిగారి కవితా రచన. విహారి గారు వాల్మీకి రామాయణాన్ని స్వచ్ఛందంగా అనువాదం చేయాలని సంకల్పించి ప్రథమంగా ఈ సుందరకాండను ప్రచురిస్తున్నారు.

రామాయణంలోని సుందరకాండను కార్యసాధన కోసం పారాయణం చేసే వారున్నారు, భక్తి ముక్తుల కోసం అధ్యయనం చేసే వారున్నారు. వాల్మీకి కవితా మకరందాస్వాదన కోసం పఠించే వారున్నారు. ఎవరు ఎన్ని రకాలుగా భావించినా వాల్మీకి కవితా శక్తికి సుందరకాండ విహార భూమి. అందుకే భారతీయులందరికీ ఇది పారాయణ గ్రంథం.

ప్రాచీనకాలం నుంచి వాల్మీకి రామాయణాన్ని తెలుగులోకి తీసుకుని వచ్చి ఆంధ్రులందరికీ మహోపకారం చేసిన కవులు అనేకులు. అయితే భారతం లాగా, భాగవతం లాగా ప్రశస్తి పొంది ఆంధ్రుల అభిమానరచనగా ఆ అనూదిత రచనలకు ఆదరణ లభించలేదు. ఇప్పటికి ఆ మహాకావ్యానికి అనువాద రచనలో, అనుసరణలో చేసి తమ భక్తి ప్రపత్తులను చాటుకుంటున్న కవివతంసులున్నారు. వారిలో సమున్నతస్థానం అందుకోవడానికి ప్రయత్నించారు శ్రీ విహారిగారు.

శ్రీ విహారిగారు ప్రసిద్ధ కథకులు. కథ చెప్పడం వారికి జన్మతో అబ్బిన విద్య. అయితే కమనీయంగా ఈ రామాయణ కథ చెప్పడం మాత్రం వారు సాధించిన విద్య. కథ వేరు కథనం వేరు. కథ బంగారం, కథనం తీర్చిన ఆభరణం. ఈ సుందరకాండలోని దృశ్యాలన్నీ వారి కథన శక్తికి ముకురాలు. ఈ రచన వాల్మీకి మూలకథకు విధేయంగా, తమ స్వచ్ఛభావాలు పాథేయంగా సాగిపోతుంది – ఈ రామాయణ కథ. ఎన్నాళ్ళో ఎన్నేళ్ళో మననం చేయనిదే ఇలాంటి ఉదాత్త రచన రూపొందదు.

ఇది శ్రీ విహారిగారు శిల్పించిన ప్రౌఢ రచన. ప్రౌఢమంటే రసతరంగితమైనదని ఆలంకారికుల అభిప్రాయం. భావబలం, భాషాబలం పుష్కలంగా కలిగి, ఛందోహయాలపై స్వారి చేయగలిగిన బలముండి, ప్రయోగశీల తత్త్వజ్ఞత ఉన్న వారి చేతిలో ఏ రచన అయినా ప్రౌఢంగానే రూపొందుతుంది. 'నాకు రచనలు అర్థంకాకపోతే అలాంటి వాటిని



పరిగణించను' అనే కొందరు ఆధునిక విమర్శకుల అభిప్రాయానికి అలాంటివారు కట్టుబడరు. నన్నయ రచనలోని సారళ్యం తిక్కన రచనలో ఉండదు. అంతమాత్రాన తిక్కన కావ్య కళాభిజ్ఞతకు కలిగిన లోపంలేదు. విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షం అర్థం చేసుకోవడం సాధారణ పండితులకు సాధ్యంకాదు. శ్రీ విహారిగారు కూడా శబ్ద సంవరణంలో, శైలిలో, ఛందః ప్రయోగంలో ప్రౌఢిమను ప్రదర్శించారు. అది వారి కావ్య రచనాభిరుచికి నిదర్శనం.

వ్యాకరణవేత్త అయిన హనుమంతుడు వారిధిని లంఘించినట్లు శ్రీ విహారిగారు ఛందోంబునిధిని అలవోకగా తరించారు. ఈ సుందరకాండలో ఎన్ని మత్తకోకిలలు కూశాయో, ఎన్ని ద్విపదలు పరుగెత్తాయో, ఎన్ని త్రిపదలు విహాయస విహారం చేశాయో, ఎన్ని మధ్యాక్కరలు అక్కరకు వచ్చాయో, ఎన్ని అల్పాక్కరలు మహాక్కరలయినాయో, ఆశ్చర్యజనకంగా ఉంది. సుందరకాండలోని కథావస్తువు అద్భుతరస ప్రధానం. ఆ విస్మయ భావన ఎంత తాళోత్తాలంగా విహరించిందో రచనలో అనుభవైకసాధ్యం. వైవిధ్యంకోసమనీ, విస్మయకరంగా లయాత్మకత వెలుగులీనుతుందనీ భావించి అనేక ఛందాలను కదను తొక్కించారు – ఛందోవీరులు శ్రీ విహారిగారు.

ఈ రచనలోని ఛందోనుశీలనం ప్రత్యేకంగా చేయదగిన కృషి. ప్రబంధకవులు పట్టుదలతో తీర్చిదిద్దిన అనేక ఛందాలను వీరు వినియోగించుకొన్న వైనం వారి అభ్యాస పటిమకు నిదర్శనం. మధురగతి రగడలన్నీ మైమరచి పాడుకోదగినవి.

ఇక భాషా శైలుల విషయంలోనూ విహారిగారు స్వేచ్ఛా విహారం చేశారు. ప్రౌఢ పద ప్రయోగాలు కుప్పలు తెప్పలుగా ఎదురవుతాయి. వారు నిర్ణయించిన శీర్షికల శబ్దాలు నిఘంటువుని ఆశ్రయించకపోతే కొన్ని అందరికీ సులభంగా అర్థం కావేమో. 'రక్కసిదండు పెఱగాయ సుద్దులు', 'లంకాధి దేవత శ్రధనము' ఇలాంటివి. శ్రీ విహారిగారు ఈ విషయంలో పఠితల మీద కొంత దయతలచి ఉండవలసింది. అయితే వారి మనఃస్థాయి అందుకు అంగీకరించలేదేమో!

ఇక వారి రచనా శిల్పానికి ఉదాహృతులుగా ఈ కొన్ని పద్యాలు చాలు.

వాల్మీకి హనుమంతుని సాగరోల్లంఘనాన్ని ఉత్ప్రేక్షా సహితంగా, ఉదారభావభరితంగా వర్ణించారు. ఆయన కవితా ధార మధుధారగా సాగిపోతుంది. ఆ సన్నివేశాన్ని శ్రీ విహారిగారు కొంత మూల విధేయంగా, మరికొంత స్వోపజ్ఞంగా చిత్రించారు. ఛందోగతిలో వైవిధ్యాన్ని పాటించారు. చూడండి.

"గమన వేగాన వృక్షాలు కదలి కదలి, ఊగి ఊగి, సమూలమ్మునునికి నూడి, హనుమతో గూడిసాగె – నాత్మాను బంధ మేదొ యొక కొంత నుత్సాహ మేచికోర"

ఇందులోని ఆత్మానుబంధం కవి సంవీక్షణం. ప్రకృతికీ, జీవికీ ఉన్న ప్రగాఢానుబంధం. ఈ సందర్భంగా రచించిన 'మధురగతి ననియె మారుతినతుడై విధి కర్తవ్య ప్రేరణ రతుడై' అనే మధురగతి రగడ హృదయావర్జకమైన లయాత్మకతను సంతరించుకుంది.

కొన్ని వర్ణనలు మనస్సును ఆకట్టుకుంటాయి. భాషావిహాయస విహారి శ్రీ విహారిగారు – సముద్రోల్లంఘనానంతరం హనుమంతుడు నేలకు దిగి వచ్చినట్లు మన మనసుకు సమీపవర్తిగా వస్తారు. అలాంటి వర్ణనల్లో విభీషణుని వర్ణన ఒకటి. ఔపమ్యాన్ని ఆధారంగా గ్రహించి చేసిన విభీషణ స్వభావ వర్ణన – గమనించండి.

"గంజాయిచేనిలో కలిసి పెరిగినను విలువగా నిల్చిన తులసివోలె ...

.... శ్లేషసంభాషణుండు విభీషణుండు" (643)

కంఠస్థమూ, హృదయస్థమూ కావలసిన ప్రసాదగుణభరిత పద్యం ఇది. ఇలాంటి వర్ణనలు లెక్కకు మించినవి ఉన్నాయి ఈ రచనలో.

శ్రీ విహారిగారు చేసిన తపస్సుకు, చేసిన వరివస్యకు నిదర్శనం – ఈ పదచిత్ర రామాయణం. ఒక్కసారి పఠిస్తే చాలు మానవమనోమాలిన్యలు క్షాళితమైపోతాయి. ఉదాత్తాభావాల ఒరవడితో ప్రవృత్తిలో ఒక తేజస్సు కదలాడుతుంది.

ప్రాచీనాధునిక ఆంధ్ర సాహిత్యాలు తెలిసి చేసిన రచన ఇది. ఈ పదచిత్ర రామాయణ సుందరకాండ ఆంధ్ర సాహిత్య రసికుల అంతరంగాలలో విహరిస్తుందని నా ఆశ.

హైదరాబాద్

**–డా॥ ఎల్లూరి శివారెడ్డి**
**తెలుగుశాఖ పూర్వ అధ్యక్షులు**
**ఉస్మానియా విశ్వవిద్యాలయం**



# మిత్ర వాక్యం

సీతారాముల పావన జీవనచరిత్ర నవరసభరిత కావ్యంగా వాల్మీకి మహర్షి చేతిలో రూపొందితే, కుశలవుల లలిత మధుర గాత్రంలో అది తంత్రీలయ సమన్విత గేయ కావ్యంగా భాసించింది. రామకథ ఎందరో తెలుగు కవులు తమ తమ వాక్కులతో గానంచేసి తరించారు. రంగనాథ రామాయణం ద్విపదల్లో సాగింది. మొల్లమ్మ కావ్యం హృద్యంగా పద్యాలలో సాగింది. తిక్కన్న నిర్వచనోత్తరరామాయణం, కూచిమంచి తిమ్మకవి ఉత్తర రామాయణం ప్రాచీనులు తెలుగు సేతలుగా చేశారు. ఆధునికులలో వాసుదాసు మంధర వ్యాఖ్యానం, దొడ్డ రామాయణం, గోపీనాథ రామాయణం, శ్రీపాదవారి రామాయణం – వీటన్నిటినీ సరితూగగల జ్ఞానపీఠ పురస్కార విశ్వనాథ రామాయణం – యింకా ఎన్నెన్నో 'మరలనిదేల రామాయణంబ' నిపించేలా వచ్చాయి.... వస్తున్నాయి.

మహాభారత, భాగవతాలు అలాకాదు. కవిత్రయము, పోతన్న ఆ పని మరొకరు చేయవలసిన పనిలేకుండా చేశారు.

విహారి, శాలివాహన ద్వయం కథకులుగా (కృష్ణా జిల్లాలోని బందరు) ఆంధ్రదేశానికి పరిచితులు. కథారచనలో విహారి సిద్ధ హస్తులు. వారి కడప ఉద్యోగ జీవితకాలంలో నేనూ కడప ఆకాశవాణిలో పనిచేశాను. మైత్రీ సంపన్నులాయన.

విశ్రాంత జీవనం వానప్రస్థం లాంటిది. ఆ విశ్రాంత జీవనంలో అవిశ్రాంత కృషిచేసి వాల్మీకి రామాయణానికి పదచిత్రాలను కూర్చారు – జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి. ఈ పేరు లోకానికి తెలియదు. విహారి, జే. యస్. మూర్తిగా ఆయన బహుళ వ్యాప్తిలోకి వచ్చారు.

ప్రస్తుతం 'సుందరకాండము' ఆధ్యాత్మిక జగత్తులో ప్రశస్తమైంది. సుందరకాండ మధురగానంతో యం.యస్. రామారావు చరితార్థులయ్యారు. భక్తిపద సమ్రాట్టుగా హనుమ రామయ్య కొలువులో బంటు. భక్తులందరికీ ఆయన ఆయువుపట్టు. నమ్మినబంటుగా, కార్యనిర్వహణా చతురుడుగా ఆయన సీతారాములకు చేరువయ్యాడు.

జొన్నలగడ్డ పద్య పోహళింపు అద్భుతం. ప్రాచీన ప్రబంధశైలిలో పద్య రచన కొనసాగింది. భాషపై ఆయనకున్న పట్టు, ఛందోలంకార శబ్ద గాంభీర్యము దానికి తోడై పాఠకుణ్ణి మురిపింపజేస్తాయి, మరపింపజేస్తాయి.

పద్యశైలి ప్రాచీన కవుల పోకడలతో కొనసాగింది. పద్యం ఎత్తుగడ, విరుపు కవికున్న భావబంధురతను తెలియజేస్తాయి. పద్యం నడకలో ఒక సొగసు వుంది. రాక్షస స్త్రీల మధ్యలో ఉన్న సీతమ్మ తల్లి ఎలా వుందో చక్కగా ఉపమించారు.

దండుగ చీమలెన్నొ తనదాపుకు చేరగ, మధ్య శర్కరా

ఖండము నిల్చియున్న గతి గాంచెను వానరమూర్తి, రాక్షసీ

తండక మధ్యమందు కల తల్లిని, కప్పల దొర్వులో తిరం

బుండిన తామరాకు, నెగడొందిన చక్కని నీటిబొట్టునున్.

పద్యం చదువుతున్నపుడు విశ్వనాథ ఎత్తుగడలు గుర్తుకువస్తాయి. పదాల విరుపు, చెప్పడంలో నేర్పు, భావాల కూర్పు అహమహమికగా ముందుకు సాగాయి. అశోకవనంలో సీతా సందర్శనానంతరం హనుమ చిత్త వృత్తిని చెబుతూ

"అవును కాబోలు; కాబోలు నవు ననుకొని

మనము తాను ద్వైదీభావ మగ్నమయ్యె

గుండె నీటనిండిన కొత్తకుండయయ్యె

వాఙ్మయము మూగవోయిన భ్రాంతినింపె."

విశ్వనాథవలె జొన్నలగడ్డవారు ఎన్నో విశేష వృత్తాలను సందర్భోచితంగా వాడుకున్నారు. ద్విరదగతి రగడ, మధురగతి రగడ, త్రిపదలు, ద్విపదలు, మంజరీ ద్విపద, తరళములు, కవిరాజ విరాజితము, మధ్యాక్కరలు, అల్పాక్కరలు, హరిగతి, మదరేఖ, వనమంజరులు, ఇంద్ర వ్రజము, ఉపేంద్ర వ్రజము, మత్తకోకిల, తోటకములు, ఉత్సాహ, సుముఖి, పద్మనాభ వృత్తము – ఇలా విశేష వృత్తాలను అవలీలగా పదచిత్ర శిల్పంతో పొదిగారు.

ఇటీవల ఆధునికులలో డా॥ సి.వి. సుబ్బన్న శతావధాని తమ 'శ్రీ వ్యాస విలాస ప్రబంధం' లో ఇన్ని విశేష వృత్తాలు వాడారు. దానికి ఛందస్సుపై అధికారం, భాషపై నిష్ఠ కావాలి.

హనుమంతునికి జొన్నలగడ్డ వాడిన పర్యాయపదాలు సందర్భోచితంగా పదబంధాలుగా పద్యంలో ఇమిడిపోయాయి. గాలికొమరుడు (వాయుసుతుడు) కరువలిబిడ్డ, పృషదశ్వసుతుడు, పావమాని, అనుమదు, ప్రకంపనసూనుడు, కపిలోకాత్మీయుడు, సమీర



సుతుడు – వీటన్నిటినీ తలదన్నే పదబంధం – వానర ధూర్జటి.

విశ్వనాథను గుర్తుకు తెచ్చే ఒక సందర్భం. హనుమంతుడు సీతారాముల ఘనతను ప్రశంసిస్తూ–

"మీదు తత్త్వము, జీవుని వేదనా వ

లయము నొక్కటై నీరంధ్ర లక్ష్మమిచ్చు

మా తెలివి కొలదులవి యే మాత్రమమ్మ

మీ యిరువురను గూర్చి సమీక్ష జేయ?" అంటాడు.

'జీవుని వేదన' అనే మాట విశ్వనాథ కిష్టం.

లంకానగర ప్రవేశం చేసిన హనుమ లోనికి వెళ్ళడానికి ముందు పశ్చిమ ద్వారము, తూర్పు వాకిలి ప్రశస్తిని చెబుతాడు. 'వర్ధమానము దక్షిణ ద్వార రహిత భవనమంద్రు' – అంటాడు. ఇక్కడ కవి వాస్తు ప్రస్తావన చక్కగా విశ్లేషించారు.

సీతా సాధ్వికి సాష్టాంగ నమస్కారం చేసిన హనుమను

"తన నిజాకార మనోజ్ఞతా పరిధికి

దిగుచు, నెమ్మది యంగము లొగి విధేయ

త నిగుడ బ్రణామ మాచరించె – నవనిజకు–

కొమ్మ వ్రాలిన గన్నేరు గుత్తి వోలె!

చక్కని ఊహాచిత్రమది. అలానే 'శిష్టోపదేశము మధ్యన్ తలయెత్తి నట్టి యొక ప్రశ్నావ్యంజనంబో యనన్–' అనే భావం గంభీరం.

పదబంధాలు : కవి ఎడ నెడ వాడిన పదబంధాలు స్వర్ణఖచిత ఆభరణంలోని రత్నాలవలె ఒదిగిపోయాయి. "లాస్యము చేసెను – జోస్యమాయనన్"–

"క్షపాచర వనితా వృతము, నైజ దుర్మదతమ్మటమ్ము"

రామకార్యార్థియై వెళ్ళే హనుమకు సముద్రుడు ప్రత్యుపకార పరాయణత్వ బాధ్యత, 'మరి కృతజ్ఞతా భావనమ్ము తరగలెత్త నియోగించె తన్ను తాను' ఎంత చక్కటి భావన.

'అర్థాంతర ప్రత్యయమ్ము గూర్చు వాక్కు భాతి; దైత్యాలంకర్మీణుడు',

మినుముల ప్రోవు మధ్యన కలగలిసినన్

కెడగంటి నిలు కందిగింజ పగిది"

'మినుముల ప్రోవు మధ్య కందిగింజవలె రాక్షసులలో విభీషణుడు' ఎంతటి విశేష భావన.

సీతామాతను చూసిన హనుమ సంతోషాని కవధులు లేవు. ఆ సమయంలో కవి కలం పరవళ్ళు తొక్కిన గంగ అయింది.

'ఆరయ నక్షరాభ్యసన మందున ముందుగ బాలుడొక్క డోం
కారము దిద్దీ కూర్చిన ప్రకారము తోచెను పావమానికిన్
శ్రీ రమణీయ కావ్యమున జిందిన చిక్కని విప్రలంభ శృం
గార పదార్థమో యనగ గానగ నయ్యెను నీరజాక్షియున్'

సీతముందు హనుమ వేసిన కుప్పిగంతులు సహజ సుందరంగా పద చిత్రాలయ్యాయి. బాపు బొమ్మలా మన కంటిముందు గోచరిస్తాడు హనుమ.

'వాలము చుంబించె, భుజా
స్ఫాలన మొనరించె, నాడె, పాడెను, తిరిగెన్
నేలంబడె, కంబముపై
వాలె, నెగిరి గంతువేసె వానరచేష్టన్.'

సహజమైన కోతిచేష్ట అది. కందంలో అందంగా వొదిగిపోయింది.

వాల్మీకిని యథామూలంగా అనువదించిన తీరు నిరుపమానం. తన భుజాలపై కూర్చుంటే తీసికెళ్తానన్న హనుమ సూచనలను సీత తిరస్కరిస్తూ, రావణుడు తీసుకు వచ్చినప్పుడు వివశురాల్ని అంటుంది.

శ్లో : యదాహం గాత్ర సంస్పర్శం రావణస్య బలార్గతా
ఆనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ. (37-61)

ఆ శ్లోకాన్ని పదచిత్రంగా జొన్నలగడ్డ మంజరీద్విపదలో పొదిగారు.

"తాననెను జనకాత్మజ, ధరాతనయ
అన్యపురుషుని దేహమ్ము స్పృశింప
రక్కసీడపుడు బలాత్కరించి గొని
యరుగువేళ వివశనైతిని నేను,
అసహయనైతి, నేనైతి నబలను."



అశోకవనంలో ప్రవేశించడానికి ముందు సీతారామ లక్ష్మణులకు, అష్ట దిక్పాలురకు నమస్కరిస్తాడు, హనుమ.

వాల్మీకి మూలం-

శ్లో : నమోస్తు రామాయ సలక్షణాయ
దేవ్యైచ తస్మై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః (13-59)

ఈ శ్లోకాన్ని చక్కని తేటగీతిలో కవి శుద్ధంగా అనువదించారు. ఈ శ్లోకం నిత్యపారాయణం శ్లోకం. దానిని ఎంతో నైపుణ్యంతో ఏర్చికూర్చారు.

'ప్రణతి ప్రణతి శ్రీరామ సలక్ష్మణాయ
శరణు శరణు శ్రీ జనకాత్మజా నమోస్తు
నతులు రుద్రేంద్ర యజిన జనాంత - మీకు
ప్రణుతి సూర్య సింధుజ మరుద్గణములార!

1162 పద్యాలలో సుందరకాండను హృద్యంగా, పండితైకవేద్యంగా, రసబంధ బంధురంగా సమకూర్చారు. అన్ని కాండలు పద్య రచన పూర్తిచేసి ప్రస్తుతానికి సుందరకాండ ముద్రణాభారాన్ని తలకెత్తుకున్నారు. రామాయణమంతా ప్రకటించబడాలి. ఎందుకలా అంటున్నానంటే విహారి కవితా విహారం తెలియజేసే రెండు సీసాలు చాలు మొత్తం గ్రంథం త్వరగా వెలువడాలి అనడానికి.

శివారాధనా తత్పరుడైన రావణుడు సుందరకాండలో అశోక వనంలో సీత ముందుకు వచ్చిన ఘట్టంలో - కవి - రాక్షసేంద్రుని పదచిత్రాలలో బంధించిన తీరు అసదృశం.

'కైలాసనాథుడే కరుణించి దిగివచ్చి,
యీతని ఫాలము నధిష్ఠించెనేమొ
స్వర్గాధి నాథు వజ్రాయుధము తొరగి,
యితని కుడిభుజమై యెనసెనేమొ,

మేరు వీ స్థానమే మేలుమేలనుకొని,

యితని యురమ్మునే యెంచెనేమొ

గానామృతము నీయగా రుద్రవీణయె,

యితని నాభికి చేరి యిమెడెనేమొ

యనిన విధము – శైవమ్ము, నత్యధిక సత్వ

సంస్థితియు, దీమసము, లావు, సంప్రదాన

సంజ్ఞలు – సమృద్ధిగ కొలువు సలిపె నితని

దేహవేదిక పైన సందేహమేల!

రావణుడు సాక్షాత్కరిస్తాడు కనులముందు.

అలానే హనుమంతుడు రాముని విరహవర్ణన చేసిన ఘట్టం–

“చల్లగాలి తెర నీ స్పర్శమ్ముగా దోప,

హాయిగా యూర్పిడి హర్ష మొందు

నట పక్షి మిథునము నరసి, నీ తలపులో మునుగు,

హసించు, సమ్ముదము నొందు

జుక్కపూవుల గాంచి, సుదతి హాసమ్మని,

మనసార గ్రహియించి మంపునొందు

సాగిపోయెదు మబ్బు జానకి జేరునే

యని యేమొ చెప్పుచు గొణుగు కొనును

పూలమొక్కల వెదకు నిను బూవుబోణి

బంభరపు గుమి భ్రమియించు భ్రమరవేణి

లేడిగుంపు నన్వేషించు లేడిగంటి

నదుల జలముల నెమకు వనజదళాక్షి!



ఈ విధంగా రామ రావణుల పదచిత్రాలను శబ్ద సౌందర్యంతో, అర్థగాంభీర్యంతో అల్లడం సామాన్యకవులకు సాధ్యంకాదు. ఒక గడియారం వేంకట శేషశాస్త్రి, ఒక మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి – యిలాంటి కవి దిగ్గజాల సరసన జొన్నలగడ్డ కవితా స్ఫూర్తితో నిలబడతారు.

“రామ రసాయన తుమ్హరే పాసా

సదారహో రఘుపతికే దాసా”

**–ఆర్. అనంత పద్మనాభరావు**

**(పూర్వ) దూరదర్శన్ డిప్యూటీ డైరక్టర్ జనరల్.**

**తిరుపతి.**

# సమాలోకనము

**శ్లో॥ ఆపదామపహర్తారం, దాతారం సర్వసంపదాం,**
**లోకాభిరామం శ్రీరామం, భూయో భూయో నమామ్యహం.**
**'సుందరే సుందరో రామః సుందరే సుందరః కపిః**
**సుందరే సుందరీ సీతా, సుందరే కిం న సుందరమ్?'**

ఆదికవి వాల్మీకి మహర్షి, తన రామాయణంలోని హనుమద్విజయం కథా భాగానికి 'సుందరకాండ' అని పేరు పెట్టారు. సుందరకాండ మంత్రరాజము. 'తత్సవితుర్వరేణ్యం...' అను గాయత్రీ మంత్ర బీజాక్షర నిక్షిప్తమైన ప్రథమాక్షరాన్ని తీసికొని రామాయణ శ్లోక రచన సాగించేడు, వాల్మీకి.

పవిత్ర మంత్రరాజ నిబద్ధమైన సుందరకాండ – పారాయణ గ్రంథం కూడ. 'హనుమచ్చరితం సుందరభరితం'. కారణాంతరాలచే ప్రకృతీ పురుషుల కెడబాటు కలిగింది. ప్రకృతి సీత. పురుషుడు రాముడు. ఈ సందర్భమున హనుమ – ఆచార్యత్వం వహించి రామనామాంకిత ముద్రికను సీతకిచ్చి, సీత ధరించిన చూడామణి రామునకందించి సీతారాములను కలిపిన ఘనుడు. హనుమ లంకలో ప్రవేశించుట, సీతాన్వేషణము, లంకాదహనము, పునరాగమనం – ఇదీ సుందరకాండ కథ.

శ్రీ పదచిత్ర రామాయణము ఛందస్సుందరమైన కావ్యము. వాల్మీకి సుందరకాండకు యథాతథానువాదము కాదు. అందలి కథ నాధారంగా తీసికొని వాల్మీకి భావాన్నావిష్కరిస్తూ, చిత్ర విచిత్ర పదవిన్యాసాలతో కావ్యరచన సాగించారు– శ్రీ సత్యనారాయణమూర్తిగారు.

భక్తి భావాలను, హనుమత్తత్త్వాన్ని, హనుమకుగల అణిమాద్యష్ట సిద్ధులను వివరిస్తూ పాఠకులకు స్పష్టముగ నవగతమగునట్లు తేట తెనుగు నుడికారముతో రచన సాగించేరు. ప్రబంధరీతిలో వర్ణనలలో – పెద్ద వృత్తాలను మాత్రమే కాక – ద్విపద, త్రిపద, రగడ, మత్తకోకిల, మధ్యాక్కర, మధురాక్కర వంటి వివిధ ఛందస్సులు నుపయోగించిరి. పద్యరచనలో – ధారాశుద్ధి, భావశబలత, రసపోషణమున కనుకూలముగా ధ్వని, అలంకారాదులు ప్రయోగవైశిష్ట్యంతో అలరారినవి.



రావణుని అంతపురములోని కాంతలు రావణ పర్యంక ప్రాంతమున నిదురించిన రీతిని వర్ణించు ఘట్టమున – వర్ణనల్లో మనం చూస్తున్న, మనకు సన్నిహితంగా నున్న అద్భుతమైన ఉపమానాల నుపయోగించారు. ఇవి– కవి భావనామహిమకు మచ్చుతునుకలు. కొమ్మలందరు చెట్టు కొమ్మలవోలె, బొమ్మల కొల్వులో బొమ్మలైరచట, మడిచుట్టు గనిమలో పడిలేచు గడ్డి పూలనగ; ఎల్లలమరని పొలిమేర కల్లులట్లు; పడిమొలచు పిచ్చి మొక్కల దడియవోలె; తెగిన వాద్య విశేషంపు తీగెలట్లు; పెరటిలో లేచు పుట్టగోగురకమట్లు; చెఱకుగడ లటునిటు విరజిమ్మినట్లు, సకల మస్తవ్యస్తమౌ సరణి నున్న భామినీ మణుల వర్ణన – 'శయ్యాసౌభాగ్యం'తో – భాసించింది.

భక్తి భావ భరితమైన కొన్ని పద్యాలలోని ప్రాసకూర్పు – పోతన మహాకవి పోకడలో – అందంగా రసరమ్యంగా కుదురుకుంది. "సీత అతిలోక పూజ్య ప్రపూత – మాత; సీత అతిలోక సద్గుణోపేత – మాత, సీత అతిపథానుగమ వినీత – మాత; సీత అతిపథాను గ్రహాన్వీత – మాత" అనే తేటగీతిలో – సీతలోని పూజ్యత్వ, పవిత్రత్వ, మాతృత్వ, వినీతత్వ సద్గుణాలు మధురమైన అనుప్రాసతో వర్ణితమైనవి.

సీతాన్వేషణ తత్పరతతో హనుమ రావణుని అంతిపురమునగల కాంతలను జూచుచు, ప్రక్కనే పరుండిన మండోదరిని జూచి, రూప లావణ్య శేవధి – ఆ చంద్ర వదనయే జనకజ యనుకొని – భ్రమపడిన సందర్భములో వర్ణితములైన కోతి చేష్టలను తిలకించండి : 'వాలము చుంబించె, భుజాస్ఫాలన మొనరించె, నాడె, పాడెను, తిరిగెన్; నేలంబడె, గంబముపైవాలె, నెగిరి గంతువేసె – వానర చేష్టన్!' ఇది ఎంత సహజముగ, బహిరంతర తత్త్వసూచితముగా సాగినదో పాఠకలోక మూహింతురుగాక.

హనుమ లంకాతరణ గమనానుక్రమములో, వాని గమనం వలెనే 'తరళములు' సరళము వేగంగా సాగేయి, అలాగే – 'చెవులు ముకుళించి, పాదాల చెంతరించి, ప్రాణశక్తిని హృదయ నిబంధనమ్ము జేసి, బలపరాక్రమముల జిత్తశుద్ధినునిచి, లక్ష్యాన కేంద్రీకరించె మనము, అన్నప్పుడు, 'పాదద్వంద్వము నేలమోపి పవనుం బంధించి' అన్నట్లు – హనుమ యోగీశ్వరతత్త్వ దర్శనం చేశారు కవి. హనుమ చారణాచరిపథంలో సాగిపోతున్నప్పుడు సాగిన త్రిపదలలోని ఉపమాన ప్రయోగం కవి భావ శబలతకు అద్దం పడుతున్నాయి.

హనుమ – ఆ యోగసిద్ధితో – ఒక్క వూపున గమనమ్ము నొత్తరించాడు. పాదఘట్టనకు 'కొండ కొండంత వణుకున గోడియయ్యె' నంటారు. 'గమన వేగాన వృక్షాలు కదలి కదలి, ఊగి యూగి సమూలమ్ము నునికి నూడి, హనుమతో గూడి సాగె –

నాత్మానుబంధమెదియొ యొక కొంత యుత్సాహమేచి కోర!' అన్న చిన్న తేటగీతి ముక్తాయింపులోని ఆర్ద్రత కన్నుని చెమరింపజేస్తుంటే; లలిత లావణ్య రేఖలా "కరము శుభమస్తు గాలి యందఱకు దగిలె, గొండమల్లెలు విచ్చగ, కొండగోగువేరు బళియన, మొగ్గలు వీగి వీగె, కతయె నిక్కలయయ్యె ప్రకృతికి, వృతికి' అని పద్యం వెంట పద్యం పదచిత్రం వెంట పదచిత్రం పరిగెత్తుకొని వచ్చి పఠితలకి హృదయానందాన్నీ, అనిర్వచనీయానుభూతినీ కలిగించి ముగ్ధుల్ని చేస్తాయి.

కావ్యంలోని సీసపద్యాలు కమ్మెచ్చులోనుండి తీగ సాగినట్టుండును. అశోకవన వర్ణనలోని – 'ఒకచోట చక్కని మెకముల యెలదోట, మణిగణ నిర్మిత మంటపములు, రావణాగమనములోని – 'కైలాసనాథుడే కరుణించి దిగివచ్చి యతని ఫాలము నదిష్ఠించెనేమొ; సీత వర్ణనములోని – 'కళలెల్ల యొకచోట కలికిగా మారెబో కలికి యొప్పులకుప్పగా కళగొనె'; రావణ ప్రలాపములోని – 'సరసాల జవరాలి మురిపాల మాలవై గళసీమనేలగ కదలిరావె, విభీషణ వర్ణనలోని 643వ పద్యం– ఇలా అనేకానేక పద్యాలు రసస్ఫోరకంగా సాగేయి.

త్రిజట స్వప్న వృత్తాంతములో వేదాంత ధోరణితో రచింపబడిన పద్యం ముచ్చట గొలుపుతూ, ఆలోచనాత్మకంగా నిలిచింది. చిత్తగించండి "మాయలో నుండి వచ్చి, మాయదారి, మాయలో మున్గితేలుచు మధ్య మధ్య మత్తు మదుగుల చిదుగుల మఱల మఱల నాడి మత్తిల్లి నట్టయ్యె నసురు జూడ" అంటారు.

వృత్తాల్లో ఎత్తుగడ, నడక, ముగింపు – ఇవన్నీ కవిగారి ప్రత్యేక ముద్రతో భాసిల్లినవి. కంఠస్థము చేయవలసిన పద్యాలవలె శోభిల్లినవి. కొన్నింట ఎత్తుగడలో తిరుపతి కవుల ఛాయ, కొన్నింట ప్రబంధ కవుల ఫణితి, మరికొన్నింట గడియారం వారి పోకడ తొంగిచూడటం – కవిగారి భావుక భావ్యమానమైన సాహిత్యాభినివేశానికి అద్దం పడుతున్నదేకాని అలతి చేయడం లేదు. ఒక్క ఉదాహరణ : గజేంద్ర మోక్ష సందర్భమున పోతనగారి 'ఎవ్వనిచే జనించు జగము....' పద్యపోకడతో 'ఎవ్వడయోధ్యకే వరము....' అని (693) ఒక మధుర ఫలం వంటి పద్యం వుంది. అలాగే 'శ్రీయుతమూర్తియో పురుషసింహమ.....' పద్యాన్ని తలపిస్తున్న 'శ్రీయుత మూర్తి – ఈ చెఱను, జీకటి బాపగ రమ్ము స్వామి!' (665) అన్న పద్యం లోని సీత విన్నపం మనస్సు ఆర్ద్రం చేసి, కనుచెమరింపజేస్తుంది.



సీతా సందర్శనము, అశోకవనభంగము, లంకాదహనము గావించిన హనుమ ప్రయాణాన్ని వర్ణిస్తూ, కవి – సమయస్ఫూర్తితో 'ఉత్సాహ' వృత్తాన్ని ఎన్నుకోవడం ఔచిత్యాభరణంగా వుంది.

కావ్యంలో – సీత ముంగిట రావణుని ప్రేమాభ్యర్థన, త్రిజట స్వప్న వృత్తాంతము, హనుమత్సందేశము, జంబుమాలి హననము, అశోకవన ధ్వంసము, లంకాదహనము, ఇంద్రజిత్ – రావణ సంభాషణము వంటి ముఖ్యఘట్టాలలో – పదగాంభీర్యము, అలంకారాలు, శబ్దార్థసంపద, ధ్వని, గుణనికురము – కావ్యంలో రసపోషణమున కుపయుక్త మగు పరికరములన్నీ ఫలించి రచనని శోభస్కరం గావించినవి. కావ్యం చదువుతుంటే ఆనందోత్సాహాలు పెనవేసుకుపోతాయి. పద్యాలన్నీ రచనలో కవి చేయి తిరిగిన తనాన్ని ప్రస్ఫుటీకరిస్తూ, వారి సాహిత్య సంప్రదాయాల విజ్ఞతని పరిమళింపజేస్తున్నవి.

ఇట్టి కవితా విశేషములతో గావింపబడిన ఈ కావ్యరచన శ్రీ పదచిత్ర రామాయణమను నామమునకు సార్థకముగా నిలిచినది. ఈ కావ్యము – నదులు, గిరులు, తరులు, సూర్యచంద్రాదు లున్నంతవరకు ప్రచారములో నుండగలదనియు, శ్రీరామచంద్రుడు ఈ కావ్య పాఠకులకు ఆయురారోగ్య భాగ్యముల నొసంగుగాక అనియు – ఆశించుచు, శ్రీ సత్యనారాయణమూర్తిగారు శ్రీ రామాయణ మహాకావ్యమున మిగిలిన కాండములను ప్రచురించుటకు – శ్రీ రామచంద్రుడు ఆయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాక అని కోరుకుంటున్నాను. ఈ గ్రంథ పరిచయమును చేసి, అభిప్రాయమును వ్రాయించు అవకాశము నాకు కల్పించినందుకు ధన్యవాదముల నర్పించుచు, సెలవు....

**బుధజన విధేయుడు**

**క.ల.నా. కొండలరావు**

**విశ్రాంత సంస్కృతాంధ్ర పండితులు**

**విజయనగరం.**

# శ్రీ పదచిత్ర రామాయణంలో పదచిత్రాలు

సువర్ణ ఘంటాకంకణాలంకృత
'అవధాన శేఖర', 'అవధాన భారతి',
ఉత్తమ అధ్యాపక అవార్డుగ్రహీత, మహాకామేశ్వరి పురస్కార గ్రహీత
సూర్యసదన ఆస్థానపండితులు, భాషాప్రవీణ
**కట్టమూరి చంద్రశేఖరమ్**
ఎం.ఎ (తెలుగు) ఎం.ఫిల్

'కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్.'

('రామ' – 'రామ' అనే మధుర మధుర నామాన్ని కవితా శాఖ పై కెక్కి కూస్తున్న వాల్మీకి కోకిలకు నమస్కారము.)

ఇది రామకథ – చదివితే పొంగునెద. మధుర మాధురాన్వితము, అత్యంత మహిమాన్వితము అయిన గాథ. అశేష జనజీవన సౌందర్యానికి, సంబంధం బాంధవ్యాలకు ఆలవాలమైనది. ఆదర్శవంతమైనది ఈ దివ్యకథ.

వాల్మీకి మహర్షి చక్కని కథ నందించాడు. దానితోపాటు బీజాక్షరాలను శ్లోకాలలో సంపుటీకరించాడు. అందువలనే ఆ కథకు శక్తి పెరిగింది.

మధుర మధుర మీ రామాయణకథ మరి మరి విన్నను మేలుగదా!
జన్మ జన్మముల పాపములన్నియు పటాపంచలై పోవుగదా!
ఎన్ని సారులుగ జుఱ్ఱుకొన్నను రామకథా రస మధువులను
మరల మరల చవులూరించుచును మనసు దానిపై లాగుకదా!

(సుందరగీతామృతం – నుండి)

ఆ రామకథా రస మధువులను ఎన్నిసార్లు జుఱ్ఱుకొంటున్నా ఇంకా ఇంకా తాగాలని అనిపిస్తూనే ఉంటుంది. అందుకే కాబోలు ఒక్క తెలుగు భాషలోనే సుమారు శతకద్వయానికి పైబడిన రామాయణానువాదాలు వచ్చాయి. ఇంకా వస్తున్నాయి. కావ్యమదే కదా! ఇన్ని అనువాదాలు దేనికి? ఎవరి భావం వారిది, ఎవరి భాష వారిది.



అంతెందుకు? దేశంలోని సాహితీవేత్తలకిచ్చే అత్యంత ప్రతిష్ఠాత్మకమైన 'జ్ఞానపీఠ' పురస్కారాన్ని తెలుగు వారికి తెచ్చి పెట్టింది– ఈ రామాయణమే కదా! (రామాయణ కల్ప వృక్షం – శ్రీ విశ్వనాథ) ప్రకృతాన్ని అనుసరిస్తే –

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు 'శ్రీ పదచిత్ర రామాయణము' అనే పేరుతో రామాయణాన్ని కావ్యంగా మలిచారు. రామాయణంలోని ఆరు కాండలలో (ఉత్తరకాండను విడువగా) మిక్కిలి మహిమ గలది, అత్యద్భుత, అత్యాశ్చర్యకర సన్నివేశములతో కూడినది సుందరకాండము.

దుస్స్వప్న నాశనానికి, కోరిన కోర్కెల సాఫల్యతకు, కార్యసిద్ధికి, శతృనాశనానికి ఈ కాండను పారాయణం చేయిస్తారు, చేయగలిగినవారు చేస్తారు. అందుకే కవిగారు ముందుగా ఈ కాండను అచ్చువేయించారు. కథాపరంగా చూసినా సుందరకాండ – సుందరకాండే.

సుందరకాండము సుమధుర భరితము
మోక్షదాయకము, మోహనాశకము
ఎంత యెంతగా గానము చేసిన
అంతకంత ఫలదాయకమూ
అందులోని కథ అతి సుందరము
రామాయణమున కది కీలకము
పురుష పుంగవుల మోహపరచెడి
రామచంద్రుడే అతి సుందరుడు
జనక మహర్షికి ఫలముగ దొరికిన
సీతామాత సుందరియే గద
బంగరు రంగుల నిర్మిత నగరము
లంకా పట్నం అతి సుందరము
రక్కసిమూకల ముక్కలు చేసిన

ఆంజనేయుడూ సుందరుడే గద
సీతామాత జాడ తెలిసికొని
ఆనందముగా గంతులు వేసెడి
కపులకు తృప్తిగ మధువుల నొసగిన
మధువన మెంతో సుందరమూ
ఆదికవి శ్రీ వాల్మీకి రచనయె
సుందరమెంతో సుందరమూ
లోకము నందలి జనుల పాపముల
పోద్రోచుట కది కారణము!

('సుందరగీతామృతము' - నుండి)

ఇంతర సుందరమైన కావ్యంలో నుండి కథను మాత్రమే స్వీకరించి, మంచి మంచి వర్ణనలతో, చక్కటి లోకజ్ఞతతో, మంచి సామెతలతో స్వేచ్ఛానువాదం చేసి కావ్యంగా మలిచారు - కవిగారు.

శిల్పి ఉలితో శిలను అందమైన శిల్పంగా మారుస్తాడు. కవి తన భావనా బలంతో కావ్యంలో శిల్పాన్ని కూరుస్తాడు. ఈ కావ్యం పేరు 'శ్రీ పదచిత్ర రామాయణము'. పేరు ఎంపిక చేయడంలోనే కవి ప్రతిభ ప్రస్ఫుటమౌతుంది.

ఈయన ఇంతకుముందు 'విహారి' అనే కలం పేరుతో ఆంధ్ర దేశంలో వీరవిహారం చేసారు. కథలు, నాటికలు, నాటకాలు వ్రాశారు - వేసారు. ఆంధ్ర సంస్కృత కావ్యాలను ప్రబంధాలను ధాటిగా చదివినట్లు ఔపోశన పట్టినట్లు వారి కావ్యమే చెప్పక చెపుతోంది.

ప్రారంభంలో "కమ్మని తేటతెల్గు నుడికారము వేరుల జుట్టుకొన్న పద్దెమ్ముల కబ్బము" (6). అంత తెల్గు నుడికారాన్ని సంతరించుకొన్న కబ్బానికి ఏం పేరు పెట్టాలి? 'రామజయ మహాప్రబంధము' (1040) - తానెంచుకొన్న రామాయణ కావ్యానికి 'రామజయ మహాప్రబంధము' అని పేరు పెట్టారు. అందులోని సుందరకాండకు 'సేవన' అని పేరు పెట్టారు. వారి మాటలో ఈ భావన ఉన్నా, లేకున్నా గుండె లోతుల నుండి వెల్వడిన కవితా విమర్శకుల అభిప్రాయము. బయల్పడిన భావన. భావాంతర వీధినుండి అమ్మ పలికించిన మాట.



ఇక పదచిత్ర రామాయణంలోని పదచిత్రాలు పరికిద్దాం-

గ్రంథాన్ని నిశితంగా పరిశీలిస్తే కవికి సంబంధించిన 'ఆత్మీయతా ముద్రలు' ఆ గ్రంథ నిర్వచనాలు కనపడతాయి. ఈ కావ్యంలో కూడా కవి అక్కడక్కడ పదచిత్రానికి నిర్వచనాలు ఇచ్చారు. పదగాంభీర్యము, శుభప్రదవైఖరి, ధ్వని, విశేషఫణితియు, భావాస్ప ద రసరీతుల్, గుణములు, తదధీనముగ పదచిత్ర దర్శనమయ్యెన్ (165)

గంభీరమైన పదములు, శుభాన్ని పలికే విధానం (మంగళాదీని మంగళ మధ్యాని, మంగళాంతానిచ కావ్యాన్ని ప్రథంతే), ధ్వని, విశేష విధానము భావన కనుగుణమైన రసరీతి, గుణములు - పదచిత్రాలట.

వీటికి తోడు సుందరమైన ఛందస్సుల కవితా బంధము, సందర్భోచితముగా, శబ్ద సత్వముతో ఇమిడిపోవాలి.

'సుందరుడా హరి యాకృతి, చందము గన నాశ్రయించె సంజ్ఞను, ఛంద
స్సుందర కవితా బంధము, సందర్భోచితము, శబ్ద సత్వము నిగుడన్.' (116)

ఈ పద చిత్రాలను కూడ ఎవరిముందు పడితే వారి ముందు ప్రదర్శింపకూడదు. అది చెవిటిముందు శంఖధ్వానం కావచ్చు.

స్త్రీ పురుష భేదం లేకుండా శృంగార జలధిలో మునిగిన రాక్షస స్త్రీలను గూర్చి -

'కలరు - కలవు - కలిగె - వినె - కనెనువంటి
క్రియలు సకలము ప్రియమయ్యె - కెరలియాడు
భవనములలోన పదచిత్ర పంక్తి కదల,
మనసు తడపడని కడ యీ మాటలేల!' (221)

**ఇదీ పదచిత్ర రచన అంటే!**

'రెచ్చగొట్టబడిన హరి పెచ్చరిల్లి, తొండమున బట్టి యొక్కని బండకేసి
బాదినట్లయ్యె, కసికసి మోదినట్లు నయ్యె, పదచిత్ర రచన మచ్చుపడగ' (859)

రావణుని కుమారుడైన అక్షయ కుమారుడు యుద్ధానికి వచ్చాడు. వచ్చిన వాడూరు కొన్నాడా! ఊరుకొన్న హనుమంతుణ్ణి రెచ్చగొట్టాడు. రెచ్చిన కపి పెచ్చరిల్లి. తొండంతో పట్టి బండకేసి బాదాడు. పదచిత్ర రచనలో కసికసిగా మోదాడు.

'అని వచన ప్రౌఢియు, రసధుని రూఢియు- ధ్వని నిరూఢి దొరలెడు పలుకుల్

వినయపు గాఢత కలగల్పి యనియె ననిల సుతుడు– సీత –ఆనందించన్' (1059)

వచన ప్రౌఢి, రసధుని రూఢి, ధ్వని నిరూఢితో కూడిన మాటలు వినయంతో ఉండాలి. గాఢంగా నాటుకోవాలి.

"కావ్యం యశసే ర్థకృతే వ్యవహారవిదే, శివేతరక్షతయే

సద్యః పర నివృత్తయే కాంతా సమ్మిత తయా ఉపదేశయుజే"

అని ఆలంకారికుడు చెప్పిన లక్షణం పై పద్యంలో గోచరిస్తుంది.

ఈ పై లక్షణాలన్నింటిని ఈ గ్రంథంలో కవిగారు చక్కగా పొందుపరచారు.

**చిత్రమైన ఛందస్సులు**

వాల్మీకి సుందరకాండలో సుందరగతి కోసం సుందరమైన ఛందస్సులు వ్రాసాడు. ఈ కవిగారు పదచిత్రం కోసం చిత్రమైన పద, మాత్రా ఛందస్సులను ప్రయోగించారు.

సమయానికి తగు మాటలాడుట – వక్త పని, సందర్భోచిత ఛందస్సు కవి పని.

హనుమంతునిపై పువ్వుల ముత్యాలు, కెంపులింద్రనీలాలు – మొదలైనవి కురుస్తున్నాయి అంటూ గీతమాలికలో వ్రాసారు.

'పూల ముత్యాల కెంపులింద్ర నీలాలు, మరకతాలెల్ల హరికి సేసలై దేవవర్గపు టాసలై' (34) ... ఇలాంటి గీతమాలికలు ఇంకా సందర్భ శుద్ధిగా వ్రాసారు.

37 నుండి 39 – త్రిపదలు.

తోక హరివిల్లులా ఉంది. దాన్ని వలయంగా మారిస్తే సూర్యునికి గుడి కట్టినట్టు ఉంది. నిటారుగా ఉంచితే తోకచుక్కలా ఉందట.

ఆయన (ఆంజనేయుని) తోక లంకాపట్నానికి తోకచుక్కే గదా!

ఇంకా ద్విరదగతి, మధురగతి, మధ్యాక్కర, అల్పాక్కర, హరిగతి, మదరేఖ, ద్విపద, వనమంజరి, ఇంద్రవ్రజ, ఉపేంద్రవ్రజ, మంజరీ ద్విపద, సుముఖి, ఉత్సాహము మొదలైన చిత్రవిచిత్ర ఛందస్సులు వ్రాసారు. హనుమంతునకు సురస అనే నాగమాత ఎదురుపడింది. ఆమె శత్రు రూపంలో ఉండే మిత్రురాలు. కాబట్టి అక్కడ 'మధురగతి' (75–87)

సింహిక ఛాయాగ్రాహి – రాక్షసి – శత్రువు – ఆమెను ఉపాయంతో చంపాలి. తొందరపడకూడదు. అందుకే తరళ వృత్తాలతో అవలీలగా చంపాడు.

కపిరాజుగారు లంకానగర ప్రవేశం చేస్తున్నారు. కాబట్టి 'కవిరాజ విరాజితం'లో ఆహ్వానించారు.



రావణుని చుట్టూ చేరిన రాక్షస స్త్రీల చేష్టల 'మధ్య + అక్కరలు' వచ్చాయి. వాటి సంఖ్య (ఏడు)

ఆంజనేయుడు సూక్ష్మ రూపంతో లంకానగర శోభల్ని చూస్తున్నాడు. తొందరెందుకు? చిన్న చిన్న పదాలతో ముందు, వెనుక, ఆ ప్రక్క, ఈ ప్రక్క చూస్తున్నాడు – అందుకే త్రిపదలు (249 నుండి 270)

చివరి పద్యంగా దండకానికి చేరువగా ఉండే పద్మనాభ వృత్తాన్ని ఎంచుకున్నారు.

ఈ విధంగా కావ్యాన్ని 'ఛందోపద చిత్రం' చేసారు.

**కవితా పదచిత్రం**

ఆంజనేయుని రాకకు ఆకాశం రంగులతో సింగారించుకొన్నదట; ప్రీతి కూర్చినదట – "సుశ్లోకులు లోకమందు కృతి శుద్ధికి హారతులిత్తురే గదా" – ఇది కవి ముక్తాయింపు – ఇంపు (35)

లక్ష్యం లేనివారికి ఎవరి లక్ష్యమూ ఉండదు. లక్ష్యాన్ని చేరుకోవడానికి చాలా కష్టపడాలి.

'చెవులు ముకుళించి, పాదాల చెంతరించి ప్రాణ శక్తిని హృదయ నిబంధనమ్ము జేసి,బలపరాక్రమముల చిత్తశుద్ధి నుంచి లక్ష్యాన కేంద్రీకరించె మనము' (30)

ప్రాణ శక్తిని హృదయ నిబంధనం చేస్తేనే సహస్రారాన్ని చేరుకోగలం – అదేకదా మన లక్ష్యం.

'అంతటి తీవ్రధాటికి మహామహుడా హిమనందనుండె యొ

క్కింత చలించె, నిల్చె, గమనించె, హసించె, సమీరసూతి వే

యంతుల జూచె, లోమనము నంతయు నాతని కిచ్చె, హృష్టుడై

చెంతన యంజలించి యనె – సేమము, కామన గ్రుమ్మరించగన్.' (54)

ఆ తీవ్ర (పద) ధాటికి హిమనందనుడే చలించాడట. ఇక మన మనగా నెంత?

'పలుకు పలుకున తేనియ లొలుక జేసి విస్తరముగాక మరి విలంబితముగాని

మధుర ఫల పదవాక్య గుంఫనము నిచ్చి మనసు వెన్నల వన్నెల మనవి ననియె' (64)

చిన్న పదాలలోనే 'వెన్నెల' – 'వెన్నెల' – లా – ఎన్నలేని భావాలు. ఇలా వెన్నని నోటిలో వేసినవారే ఒక కొబ్బరి బొండాన్ని చేతికిచ్చి ఒలుచుకొని తినమంటారు.

'తేజస్వంతులు, రూపవంతులు, సుధీధీసార సన్మూర్తులున్
ప్రాజాపత్య గృహీత దండధర లబ్ధ స్థైర్య రోషాకృతుల్
సాజాత్యాప్త బలాధిపత్య గురుధర్మాభ్యాస విస్తారులున్
రాజౌన్నత్యమె సర్వసల్లపనమౌ ప్రాగల్భ్య శౌటీర్యులున్. (91)

బంగారపులంక. అందులోని సువర్ణ ఖచిత హర్మ్యాలు, హనుమయ్యకు కనువిందు చేస్తున్నాయి. అక్కడి పద్యభావాలు చెవులకు విందు చేస్తున్నాయి.

'ఒక భవనపు శిల్ప మూకొట్టె పురివిప్పి నిండుగా నిల్చిన నెమలి భంగి
ఒక పదనకళ యౌనౌనని నర్తకి పదముద్ర కరలాస్య ఫణితి పగిది
ఒక హర్మ్య నిర్మాణ మూపిరు లూదె – వీణాలసత్పాణి – విన్నాణ విధము
ఒక దీర్ఘసౌధసముపకృతి తానని నగరాజు నేలు నౌన్నత్యమునకు.' (176)

ఒక భవనం పురివిప్పి నాట్యం చేసే నెమలిలా ఉందట. ఒక సదనం 'నర్తకి' పదముద్ర చూపించే విధంగా ఉంది. ఒక హర్మ్యం వీణాపాణి విన్నాణానికి ఊపిరి లూదింది. ఒక పొడవైన మేడ నేనూ, నగరాజంతటి దానినే అన్నదట. ఎంతటి భావనా గరిమ!

'బాహిరం బెల్ల మెఱమెచ్చుపండు – సిసలు
కలిమి కరిమ్రింగిన వెలగగా నగుపడు
ఆకులేని కాడ పొడవెంతైన నేమి?
పాలతో తైలమున కేమి ఫలముదక్కు?' (238)

కనపడేదంతా మెఱమెచ్చే, కలిమి – ఏనుగు మింగిన వెలగలా కనపడుతుంది. ఆకు లేకుండా కాడ పొడవెంత ఉంటేనేమి? పాలతో – నూనెకు ఫలం ఏం దక్కుతుంది?

ఎంత లోకజ్ఞత!

హనుమయ్య లంకంతా కలయ తిరుగుతున్నాడు. ఆ శోభల్ని తిలకిస్తున్నాడు. కాని అమ్మ జాడ ఎక్కడా కనపడలేదు. ఇంతలో నిరాశ – నిరాశ చెందితే కార్యం సాఫల్యం చెందుదు గదా!



'వెన్ను – నాడిలో సూదులను గ్రుచ్చి ముందుకు త్రోయగా – రామన్న శుభాభిలాష నిజమైన బలమిచ్చిందట'. అనుమన్న ఆశయ దీక్ష అలాంటిది. (275)

పుష్పక విమానం మణివికారములైన విహగ జంతుజాలము, చిత్ర భుజంగములు, తురగ రూప చిత్ర చయముతో నిండి ఉన్నదట. ఇదేం విశేషమైన వర్ణనా? కాదే – అసలంతా కొసరులోనే ఉంటుంది. కొసమెరుపు – 'శ్వాసనూదుట మాత్రము స్రష్టమఱచె' అంటారు. పాపం బ్రహ్మగారు ఆ చిత్రాలకు ప్రాణం పోయడం మరచిపోయారట. అదే కవిత్వ స్ఫూర్తి.

సభాభవనంలో తొలిసారిగా రావణుని హనుమన్న, అనుమయ్యను రావణుడు చూసికొన్నారు. ఆయనను చూసి హనుమ ఇలా అనుకొంటున్నాడు.

'కైలాస నాథుడే కరుణించి దిగివచ్చి యితని ఫాలము నధిష్ఠించెనేమొ
స్వర్గాధినాథు వజ్రాయుధము తొరగి యితని కుడిభుజమై యొనసెనేమొ
మేరువీ స్థానమే మేలుమేలనుకొని యితని యురమ్మునే యెంచెనేమొ
గానామృతము పంచగా రుద్రవీణయె యితని నాభికి చేరి యిమిడెనేమొ'(510)

సాక్షాత్తు పరమేశ్వరుడే ఇలా దిగి వచ్చాడా! ఇతని పాలభాగాన అధివసించాడా! అనేటట్లున్న శైవాకారము. స్వర్గాధినాథుడైన ఇంద్రుని వజ్రాయుధము – ఇతని కుడి భుజంగా అమరిందా – అంతటి బలసంపన్నత. ఇతని వక్షస్థలము? తనకు తగిన చోటనుకొని మేరు పర్వతం అక్కడ తిష్ఠవేసిందా? అన్నట్లున్న వక్షస్థలం – వీరుడే కాదు – ఆయన మేరునగ ధీరుడు, గానామృతాన్ని పంచడానికి రుద్రవీణ నాభికి చేరిందా – అన్నట్టు ఉన్న – నాభి. ఇదే వర్ణనా చాతురి అంటే!

523, 985 – చక్కని తూగు గలిగిన సీసాలు643 – సీసంలో విభీషణుని వర్ణన (గంజాయి చేనిలో). ఇలా అందమైన వర్ణనా పదచిత్రాలెన్నో..........

**ఉపసంహారం**

ఈ విశేషాలు చెప్పుకుంటూ పోతే గ్రంథంకన్నా వ్యాఖ్యానమే ఎక్కువ కావచ్చు.

ఒకప్పుడు పుస్తక పఠనాభిలాషులు విరివిగా ఉండేవారు. ఇప్పుడు 'పోపో నీళ్ళకున్ పల్చనై' అన్నట్లయారు. కాంపిటీషన్లు పుస్తకాలకే సగం జీవితం వెళ్ళిపోతోంది. ఆ మిగిలిన సగం – ఉద్యోగంలోని టెన్షన్లకే పరిమితమైపోయింది. ఇంక గ్రంథ పఠనకు కాలమేది?

ఇలాంటి దశలో శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు పద్య కావ్యాన్ని వ్రాయడం! సాధారణమైన వారికి మింగుడుపడని, కొరుకుడు పడని కావ్యాన్ని వ్రాసి దుస్సాహసం చేసారనే చెప్పాలి.

రామ చరితమ్ము నెవ్వరు వ్రాసిరేని
వారలకు కల్గు యశము సర్వత్ర శుభము.

రామచంద్ర ప్రభుని చరితాన్ని వ్రాసిన వీరికి, వీరి కుటుంబసభ్యులకు ఆస్వామి నిరంతరం శుభాశీస్సులిచ్చి బ్రోచుగాత!

ఇతిశమ్

**–కట్టమూరి చంద్రశేఖరమ్**
**విజయనగరం**



# పదచిత్రాలలో పల్లవించిన ఆత్మాన్వేషణ

సీతమ్మ జీవాత్మ. రామయ్య పరమాత్మ, రామయ్య గూటిలోనుంచి సీతమ్మ నపహరించాడు రావణుడు, 'రామోవిగ్రహవాన్ ధర్మః' అన్న మారీచుని ఎఱజేసి. జీవాత్మ నెడబాసి పరమాత్మ మనలేదు, పరమాత్మ ఎడబాటు నోర్వలేదు జీవాత్మ. ఈ జగన్నాటకంలో ఈ జీవాత్మ పరమాత్మల కలయిక, ఎడబాటు ఓ చిన్మయాంశం. ద్వైత అద్వైత విశిష్టాద్వైత త్రివేణీ సంగమం. జీవనవేదం – అది సృష్టినాదం – సమత్వం అద్వైత సిద్ధి – ద్వైతభావన – అద్వైతభావనకు మూలం – నిత్య సత్యమైన అద్వైతం విశిష్టం. నిశితంగా పరికించి పరిశీలిస్తే త్రిమతాచార్యుల హృదయం, సమస్థలిలో సమం. ఈ వైవిధ్య సంభరిత విశ్వంలో సృష్టి స్థితి లయత్రయం సజావుగా ఆరంగేట్రం చెయ్యటానికి ఏక సూత్రం సమత్వం. జీవునికోసం దేవుడు, దేవుడికోసం జీవుడూ పడే ఆవేదన ఎప్పుడూ తెరపడని సృష్టినాటకం. ఈ విశ్వవేదిక పైన పరబ్రహ్మం తాను జీవుడై, దేవుడై – సూత్రధారిగ నడిపే తోలుబొమ్మలాట ఈ విశ్వవినోదం. దృగ్గోచరమయ్యేదంతా అసత్తే – అది అనిత్యం. సత్తు – నిత్యసత్యం అది స్వయంవ్యక్తం. "అసత్తునుండి సత్తుకు, మృత్యువునుండి అమృతత్వానికి, చీకటినుండి వెలుగుకు సాగే అనంత ప్రయాణమే ఈ అనంత సృష్టియానం. సృష్టింపబడిన ప్రతిదీ నశిస్తుంది. అందుకే సృష్టి అనంతమే అయినా జీవుల పరంగా అది అంతాల అనంతం. అందుకే రావణసంహారానికి అవతరించిన సీతారాములకూ ఎడబాటు తప్పలేదు. ఆపన్న జనరక్షైక దీక్షతో అమిత తేజసుడైన విష్ణుసదృశ అవతార రామునకు సీతగా తన సతియైన సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మిని అన్వేషించటం తప్పలేదు. రామాయణంలోని సుందరకాండ – ఇతివృత్తం – సీతాన్వేషణ. సీత ఆచూకి తెలియటం. సీత నన్వేషించి అశోకవనంలో శోకిస్తున్న సీతకు రామక్షేమ మెఱిగించి, రాముడు త్వరలో వచ్చి రాక్షస సంహారము గావించి, సీతమ్మకు రావణ చెఱనుండి విముక్తి గల్పిస్తాడని విశ్వాసముగ బల్కి, రామ సందేశమునకు బదులుగా ఆమె ఇచ్చిన సందేశమును, ఆనవాలును గొని, తిరిగి రాముని జేరి, 'చూచితి సీతనని' శుభవార్త చేరవేసిన హనుమద్ వాక్చాతురి.

వాల్మీకి విరచిత రామాయణంలోని సుందరకాండను, "శ్రీ పదచిత్ర రామాయణము – సుందరకాండము" అన్న పేరుతో పద్య పదచిత్రములుగ రచించి ఆంధ్రసాహితీ లోకానికి అందించారు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి (విహారి) గారు. మనం ప్రస్తుతం ముచ్చటగా ముక్తసరిగా ముచ్చటించుకొనబోతున్నది ఆ సుందరాంశమే.

పదచిత్ర రామాయణం అన్న శీర్షికే రచయిత కథాకథన శిల్పాన్ని ముంజేతి కంకణంలా కళ్ళకు కట్టిస్తుంది. శ్రీ మూర్తి, కథాకథన గగన విహారి. మూడు నాలుగు వందల కథా పుష్ప మాలికలను తెలుగువారికందించినవాడు. వచన కవితకు, పద్య కవితకు తనదైన రీతిలో ప్రాణం పోసినవాడు. నాటక రచయిత కూడా. చక్కని వ్యాసాలు వెన్నెలల గుబాళింపచేసినాడు. అతడిప్పటికే తెనుగు సాహితీ క్షేత్రంలో జగమెఱిగిన బ్రాహ్మణుడు. "చిత్తమున, చిత్రముగ రామకథ యను తల్లివేరు, పోషణ గోరుచు, తీపు సల్పుచు పూసుక నిలువగా, ప్రథిత షడ్కాండయుతమైన రామకథను, నా ప్రవృత్తి ప్రాబల్యముతోను, పెద్ద మనసుల దీవెన సుద్దితోను, పద్య కావ్యముగ రచియించ గలిగినానని" వినయముగ విన్నవించుకొన్నాడు. చేయి తిరిగిన కథారచయిత కనుక, తానెన్నుకొన్నది మధు మధు మధురధారయైన రామచరిత కనుక అతని మనస్సులో, కథలు – బొమ్మదవులుకొని మఱియొక బొమ్మ తరుముకొన్న రీతిగను, కొండపై మబ్బు లాటాడు కొనిన యట్లు – హత్తుకొన్నవి. చేయితిరిగిన నేతగాడాడించిన మగ్గంపై పడుగుపేకలు మనోజ్ఞ కలనేత అల్లిక లల్లినట్టు! అతడన్నట్లు అందుకే అతని పురాకృత సుకృత వశమ్మున – అతని అంతరంగంలో ఇంత దనుక మౌనంగా కుద్దుగా సద్దు సేయక కొలువుదీరిన ఆధ్యాత్మిక భావలహరులు ఒక్కపరి కట్టలు ద్రెంచుకొని వెల్లువలై సహజ సరళ ధారావాహికలై ఛందోరూపంలో చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలిగా రూపొంది పాఠకుల ముందు నర్తించాయి.

కవి మాటల్లో –

"బాహ్యవర్తన, మంతరాన్వర్థ శీల
చిత్రణాధిక్య గుణముల జెక్కునెడల
రెండు విధముల బదచిత్ర రేఖ మెఱసె–
నొకటి కథ, కథనమ్ము వేఱొకటి కాగ!
రామకథ 'కవి'ది, కథన క్రమము వ్యక్తి
గతము, నిజమస్మదీయ మకృతము–
దృశ్యముల వెంట దృశ్యములు దీటుకొనియె
సంజలో పిల్లలాటాడు సరణిజూపి!"

ఈ కావ్యము వాల్మీకి రామకథ ననుసరించి సాగింది. అయినా పద చిత్రములు



చెక్కడంలో శిల్పి సహజముగ తనదైన శైలిని వృత్తాంతౌచిత్య భంగము వాటిల్లకుండా తమ స్వేచ్ఛగా నుపయోగించుకొను రీతి మూర్తి గారు పదచిత్ర సహజ సౌందర్య ఫణితికి ఉచితమౌ రీతిగ కొంత స్వేచ్ఛను జొనిపినారు. దానిని వారి మాటల్లో విందాం.

"నా రసన కందినట్లు, మననము సాగి
పెకలినగతి భావాంబర వీధి చూపి
నట్టి దెస; కథాధార పయనము జేసె
విపులమయ్యెను చిత్రముల్ విస్తరించె
యెల్ల లెఱుగుచు భావమ్ము లుల్లసిల్ల
వంపు వాటమ్ము లిడితి – బద్యంపు నడక
విజ్ఞతాధృతి నిల్పుచు వేడ్క నిడితి."

అలా చెప్పుకుపోతూ హృద్యపద్య సుచ్ఛవి కదలాడిందనీ, భిన్న భిన్న ఛందస్సులు వాడినాననీ, విపుల దృశ్యభాగములెన్నో గాథల రూపమెత్తెననీ అందుచేత ఈ కథనం చిత్తశుద్ధి పరికల్పితమైనది 'తేట మాటలన్' అని అన్నారు. అది అక్షర సత్యమని అడుగడుగునా దృశ్యమౌతుంది – గ్రంథం పఠిస్తుంటే.

నిజానికి శ్రీ విహారి సామాజిక స్పృహగలిగిన రచయిత. ఆధ్యాత్మిక చింతన ఆయన కథల్లో, కవితల్లో ప్రస్ఫుటంగా కదలాడుతుంది. చలనమ్ ఆయన కథల అంతరంగం. అంటే చైతన్యం – కదలిక – దివ్యచైతన్య దిశకు కాలు కదపటం. అందుకే ఆయన రచనల్లో కథ అయినా, కవితైనా, వ్యాసమైనా, నాటికైనా, ఏదైనా ఆత్మీయతా, దాయార్ద్రతా, పుష్కలంగా పరిఢవిల్లుతుంది. అందుకే ఆధ్యాత్మికత – ఆయన కలంలో సిరాగా మారి కూర్చుంది. ఆధ్యాత్మికత అంటే పిచ్చి ఆరాధన కాదు, మూఢ నమ్మకాల ఆచరణ వేదికా కాదు. అది దీనజనాలని, బాధా సర్పదష్టులని కానని అంధత్వమూ కాదు. ఆత్మకథ అది. ఆర్తుల అర్థార్థుల వేదన నెఱిగిన యథార్థమది. ఈ "దేహీ దేహీ" అనే దీనావస్థనుండి – దేబిరించడం నుండి – బయట పడటానికి సచ్చిదానం దాత్మావృత్త ఆత్మసాక్షాత్కార జిజ్ఞాస కలిగిన జ్ఞానజ్యోతి అది. ఆ జ్ఞానజ్యోతుల వెలుగులో నీ అజ్ఞానాన్ని బాపి – అజ్ఞానాంధకారాన్ని శంకరగిరి మాన్యాలవైపు మళ్ళించి – నిను జ్ఞానిని గావించే దివ్య సూత్రం అది. అందుకే ప్రతి కథా – జీవి జీవన వ్యధను బాపుతుంది. "అందుకే చుట్టూ ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోక ఓ చిరుదీపాన్ని వెలిగించు. కాంతి

జ్యోత్స్నలు విస్తరిస్తాయి.” అన్న కవితోక్తి ఆయన కవితాత్మ. మానవుని సంకల్ప బలంకీ, సామర్థ్య సాఫల్యతకూ నిలువుటద్దం – ఆయన ‘ఓ సూరీడు కథ’ ఆశ క్రమమైతే ఆ ఆశావృత ఆశయం మూడు పూవు లారు కాయలుగ వికసిస్తుంది. “గోరింతదీపం” విహారి కలం ద్వారా పై కవితోక్తికి జీవం చిలికిన కథ. Nativity వెల్లివిరుస్తుంది – ఆయన కథల్లో, సహజత్వం శోభిల్లుతుంది. బోషాణం పెట్టె, గొలుసూ. కాష్టాబూ – కరిణీకం కళ్ళకద్దాయి. శ్రోత్రీయాగ్రహారికులు – వారి ఇండ్లూ జీవన విధానం కొట్టవచ్చినట్టు కనపడుతుంది. ఆధునికత నాగరికత వెల్లివిరిసిన కథలూ ఉన్నాయి. బుచ్చిబాబంటే ప్రాణం. ఆయన కథలపైన చక్కగా చిక్కగా మాట్లాడతాడు, విహారి. అన్నిటినీ మించి ఓ స్వచ్ఛంద సాహితీ కార్యకర్త. ఆ సేవానిరతే ఆయన్ని ఆంజనేయుని ప్రతిభా పాటవాల కద్దం పట్టే “సుందరకాండ”ను తొలిగా ప్రచురింపజేయాలని పురికొల్పిందేమో?!

“పసిపాపల నిదుర కనులలో/ మురిసిన భవితవ్యం యెంతో?

గాయపడని కవి గుండెల్లో/ వ్రాయబడని కావ్యాలెన్నో?”

అన్న దాశరథి కవితాత్మ కదలాడింది కనులముందు పదచిత్ర రామాయణం పరికించగానే.

కల్పనాత్మక కథల రచనామాధురి కలలలో నిదురించిన ఆధ్యాత్మికానుభూతి ఎంతో – పదచిత్రాలలో కనిపించింది. రామాయణంగా పల్లవించింది. సామాజిక స్పృహలో కదలాడిన దీనుల గాథలకు, దుష్ట చింతనలకు గాయపడిన హృదయాన్వేషణలో సీతాన్వేషణ సాక్షాత్కరించింది. హనుమత్సేవాభావం వెల్లివిరిసింది, రామరామాల సౌందర్య వీక్షణలో జీవులకు తారకమంత్రం తోచింది. శ్రీలు గూర్చ జనుల కాధ్యాత్మిక శ్రీల గూర్చ శ్రీకరణము బట్టిన విహారి గుండెల్లో సకార త్రయాంతర్లీన చైతన్యం విరిసి ఆధ్యాత్మిక వెన్నెల విరబూసింది. పాఠకుల గుండెల్లో నిండుగా అద్వైతం, శబార్థ రససౌందర్యము మమేకమై సీతారామ హనుమత్సౌందర్య దర్శనలో భగవత్జీవ ఆచార్య సౌందర్య మనోజ్ఞతను మనసులలో నాటింది; మధురస్వరంతో ‘ముక్తి’ గీతం సాగింది!

వ్రాసిన రామకథ వ్రాయవలెనన్న విశ్వనాథ వాణి సాధించాడు విహారి. గతంలో తాను వ్రాసిన “చిరంజీవి ఆశ” అన్న ఓ కవితలో విహారి.

“జీవితం తిని పండుకోవడమూ కాదు/ ముఖం చెండుకోవడమూ కాదు ... జీవితం/ రసమయ కావ్యంలో హవణించిన హృదయంగమ ఆముఖం” అని వ్రాసారు.



సుందరకాండంలో హనుమ, విభీషణుడు, తదితర కాండలలో మండోదరి, ధాన్యమాలి, జటాయువు, కుంభకర్ణాదు లెందరో రావణునికి చేసిన హితబోధనలలోని మూలం అదే. “తిని పండుకోవటం – భోగలాలసత/ ముఖం చెండుకోవటం – యుద్ధ పిపాస”

వద్దు వద్దు రావణా వద్దు – సీతమ్మను రామునికి తిరిగిచ్చేయి – రామునిపై వైరి భావం వదలు. (పోరు మంచిది కాదు భువి నెక్కడను) అని రాయాయణార్థం విహారి ఆనాటి కవితకు ఈ ఆదిశేషుని భావన.

జీవితమనే బృహత్తర కావ్యంలో – నిజానికి విడివడనిది – పరిమిత జీవాత్మ, అపరిమిత పరమాత్మల మధ్య సాగే అనంత చదరంగ కేళి. ఇది నవరస సమన్వితం. ఈ అమూల్య, అపురూప, అనంత నవరస సాగరమైన, నవనవోన్వేష జీవితాన్ని – మురిసుఖముల ఎఱబడి, మాత్రా – మూత్రా స్పర్శల పరుగు పందెంలో అలసి సొలసి నిష్ప్రయోజనంగా మరణ సంశ్లేషణలో ఒదిగి మ్రగ్గిపోకు అని చెపుతున్నాడు. ఈ సందేశమే సుందరకాండ. ఆత్మ – సమరం కోసం ఆరాటపడదు. సమమే దాని ఆత్మ, సమత్వమే దాని సమరం. సంసారమనే సముద్రాన్ని దాటాలంటే, సహనం కావాలి. మైనాకుని ఆతిథ్యం స్వీకరించి, ఆ ఆప్యాయతతో మురిసి అక్కడే ఆగక ముందుకు దూసుకుపోవాలి. సంసారసాగరమే ఓ దుష్కరకర్మ. దానిని తరణం చేయటానికి ఆత్మ నన్వేషించాలన్న భావన జీవుని మొదటి దుష్కరకర్మ. నిన్ను విడువక వెంటాడే ఇంద్రియ విషయాల వలయంలో చిక్కుపడక, హనుమవలె క్షణంలో మైనాకుని ఆతిథ్యం స్వీకరించి సాగినట్లు – సంసార సుఖాల వలయంలో చిక్కుపడక ఆత్మ సాక్ష్యాత్కారం పయనం సాగించటం జీవునికి రెండవ దుష్కరకర్మ. మైనాకుని వీడి సాగుచున్న హనుమకు సురస ఎదురాయెను. నా నోట దూరుమని కోరిన సురసను సూక్ష్మ రూపము దాల్చి విస్తరించిన (పది యోజనములంత) నోటిలో దూరి, వెంటనే బయల్వెడవలెను. ఇది మూడవ దుష్కర కర్మ. ఆత్మజ్ఞాన సాధకుడు శాస్త్ర విహిత కర్మలాచరించి ఉపాయముగ మెలగినచో ఆత్మ జ్ఞానమునకు సౌలభ్యత చేకూరును. సురసను గెల్చి సాగి, సింహిక మ్రింగజూచెను. సింహిక – రాక్షసి – ఆమె మనో వైచిత్రి వింతయైనది. భువిపై చరించవలసిన ఆమె సముద్రంలో ఉంటుంది. సముద్రంలో ఎన్నో ప్రాణులున్నా వాటిని ఆహారంగా స్వీకరించదు. ఆకాశంలో ఎగిరే పక్షులని లాగికొని ఆరగిస్తుంది ఆహారంగా. అసూయకు ప్రతీక సింహిక. ఆమె బ్రతుకుబాటే విచిత్రం. ఆమె తన నోటిని పాతాళ మంతది చేయగా, ఆమె నోటిలో

జీవస్థానములను గుర్తించిన హనుమ తన శరీరమును చిన్నదిగా జేసి సింహిక నోటదూరి దాని ఆయువుపట్లను గోళ్ళతో చీల్చి, వెంటనే బయటకు వచ్చి, దేహమును పెంచి, సింహిక గుండెను పగులదన్నినాడు. సింహిక విగతజీవియైనది. నాల్గవ దుష్కర కర్మను గూడ హనుమ సాధించినాడు. 'నాలుగసాధ్యకార్యముల నాల్గవ కార్యము పూర్తియయ్యె.....' అనే పద్యంలో (111) ఈ సూచనే, ఈ ఆంతర్యమే అందించారు కవి. ఆధ్యాత్మిక మార్గంలో పయనించువాడు విహిత కర్మలను ఎట్లు ఆచరించవలెనో అట్లే నిషిద్ధ కర్మలను త్యజించవలెను. ఆత్మజ్ఞాని ఏమేమి చేయాలో, చేయకూడదో సముద్ర లంఘన సమయంలో హనుమ సాధించిన నాలుగు దుష్కర కర్మలు విశదం చేస్తాయి. జీవుడు తన స్వస్వరూప జ్ఞాన సాక్షాత్కారానికి, వ్యవసాయాత్మిక బుద్ధిగలిగి బాహ్యాడంబరాపేక్ష నొగ్గి, విహిత కర్మల నాచరించుచూ, నిషిద్ధ కర్మలను త్యజించుచూ సాగవలెను.

ఇదే విహారిగారు ఆనాడు తన "చిరంజీవి ఆశ" కవితలో చెప్పింది. ఈ అద్భుత సృష్టికావ్యంలో పరిమితమైనదైన జీవితం ఓ హృదయంగమ ప్రస్థావన. జీవితాన్ని స్వీకరించిన నీవు సుఖలాలనుడవై, విహిత కర్మల నాచరించక, నిషిద్ధకర్మల నాచరిస్తూ, నీ జన్మను వృథా చేసుకోకు. సచ్చిదానంద స్వరూపాత్మ నెఱిగి నీ జన్మకు సమన్వయం చేసుకో – సమత్వబుద్ధిని సాధించు – దాని నందరితో పంచుకో. ఆ కవితలో కవి చివరకు కోరుకున్నది ఈ తత్వాన్నే.

ఆ మంచిరోజు రానే వచ్చింది విహారి జీవితంలో శ్రీ పదచిత్ర రామాయణ రూపంలో. మానవతా విలువల పరిరక్షణ – జీవాత్మ పరమాత్మల విడివడని బంధాన్ని ఎరుకజేసి, ఇలపై సత్యలోకాన్ని స్థాపించటం. ఆ ఆత్మ సామ్రాజ్యాకాంక్ష, స్వారాజ్యాపేక్ష, బంధరహిత స్వేచ్ఛాయుత జీవనం. సృష్టి ఆగదు. సృష్టి ఉన్నన్ని నాళ్ళు ఘర్షణ ఆగదు. ఘర్షణను శమింపజేయాలంటే శాంతిని వెల్లివిరియజెయ్యాలి. శాంతి కావాలంటే చిత్తం ప్రశాంతం కావాలి. అంటే చిత్తంలో సమత్వం కుదురుకొనాలి. అప్పుడు అసమానత్వం ఉండదు. అప్పుడు స్థిత ప్రజ్ఞత వెల్లివిరుస్తుంది. ఈ మానవతా విలువల పరిరక్షణ – అసురభావ నిర్మూలన – అంతర్జ్యోతిగా వెల్గొందటం రామాయణ కావ్య ఆదర్శం.

నిత్యం మారే ప్రపంచంలో ఎప్పుడూ మారని సత్యాలని, ఎప్పుడూ శిరోధార్యమైన ధర్మాలని పదే పదే పట్టు విడువక జనాలకు వినిపిస్తుండాలి. ఈ పనికి పునరుక్తి దోషంలేదు. అందుకు కథకుడు విహారి కవిగా రామాయణానికి పూనుకున్నాడు. అందుకే ఈ పదచిత్రాలు శ్రీకరం, ఆహ్వానీయం. అందుకే ఆంధ్ర పాఠకలోకం స్వాగతం పలుక సన్నద్ధ మయింది విహారి పదచిత్రాలతో గొంతు కలపటానికి!



రామాయణంలో మానవతా విలువల పరిరక్షణ నుద్దేశించే రెండు సూత్రాలున్నవి. సీతమ్మ యుద్ధకాండలో హనుమకు చెపుతుంది.

"నపరః పాపమాదత్తే పరేషాం పాపకర్మణామ్

సమయో రక్షితవ్యస్తు సన్తశ్చారిత్ర భూషణా!"

"తనకు అపకారము చేసిన వారికైనా శీల సంపన్నులు కీడు చేయరు. ఇది వారి ఆచారము." ఇది ఋక్షగీతలోని సందేశం. వేటగానిని చెట్టు పైనుండి త్రోసివేయుమని కోరిక పులితో ఎలుగుబంటి చెప్పిన వాక్యమునే సీతమ్మ హనుమకు చెప్పింది. ఇది సీత మనసు. రామ హృదయం; రామాయణ అంతరంగం. మానవతా విలువల పరిరక్షణ మానవాభ్యుదయానికి వాల్మీకి రామాయణం ద్వారా అందించిన అమర సందేశం.

ఇక రెండవ సూత్రం – అయోధ్యాకాండలో అరణ్యమునకు వెళ్ళనున్న రాముడు, తన ధనమును ప్రజలకు పంచుతున్నాడన్న వార్త విని త్రిజటుడను బీద విప్రుని రామునికంట బడమని అతని భార్య చెప్పిన సందేశం.

"అపాస్య పాలం కుద్దాలం, కురష్య వచనం మమ

రామదర్శయ ధర్మజ్ఞం యది కించ దవాప్స్యసి॥"

"ఈ పలుగు పాఱ బట్టుకొని (కందమూలముల నేఱుకొని, నేల రాలిన పరిగ తెచ్చుకొని కాలక్షేపం చేస్తున్నాడు. (త్రిజటుడు) ఎన్ని రోజులు పాటుపడుతావు. వీనిలో ఒరిగేది అల్పమే కదా! ఈ సాధనాలను అటు పారవైచి ఓ నాథా! ఆ రామునివైపు వెళ్ళు. అతని కంటబడితే ఆ చూపులు మనకొక్కింత ప్రాప్తిని గూర్చును. దృష్టిమరల్చి కాలటువైపు గదల్చుము" అని చెప్పిందామె.

ఆ ఇల్లాలి మాటలు ఇహలోక సంపదలకు పలికిన పొడి పొడి మాటల సలహాగా పైకి తోచినా భావగాంభీర్యత గలిగి లౌకికా లౌకికా శ్రేయస్సునకు మార్గమును సూచించు గంభీర బోధను గర్భస్థము జేసుకొన్నవి. 'నాథా మనం మన పనిముట్లను, మన శక్తిసామర్థ్యాలను గాఢంగా నమ్మి వాటిని విడువక అంటిపెట్టుకొని ఉంటే, దానివలన ఒరిగేది అంతంత మాత్రమే. ఆ లబ్ధి అల్ప ప్రయోజనకారి, అనంతానంద ప్రాప్తికి అనల్పహాని కల్గించు మహమ్మారి. మన ఉపకరణాలను శక్తి యుక్తులను ప్రక్కకు పెట్టి (ఆ రాముని పరంజేసి) మనం ఆ పరమాత్మ కార్యాలకు ఉపకరణాలం కనుక – ఆ సత్యాన్ని సువేద్యం గావించుకొని, నమ్మ బలుకుకొని, శ్రీరామపాద సంసేవాసక్తిని పదిల

పరచుకొని, వీడక ధ్యానిస్తే, ఆ కూర్మావతారుని చల్లని చూపులు మనలను శాంతచిత్తులను గావిస్తున్నవి – కావిస్తవి కూడ. జీవన్ముక్తులను, చరితార్థులను, కృతార్థులను గావించి, నిక్కముగ, నిశ్చయముగ నిశ్రేయస పదమును జేరుస్తవి. ఆయన చూపులు ఆప్తవాక్యములు. నిస్సందేహముగ నాల్గు పురుషార్థముల గూర్చు తరణోపాయములు" అని వేద హృదయాన్ని ఆవిష్కరించినవి.

నీ చూపెప్పుడూ భగవద్దర్శనం పైనే ఉండాలి. నీ నిజస్వరూప దర్శనం పైననే ఉండాలి. అలా ఆత్మ నన్వేషించి ఆత్మ సాక్షాత్కారం పొందాలంటే శత్రువును సైతం ప్రేమించగల సమత్వబుద్ధి ఉండాలి. సమదృష్టి – సహనం – భగవద్భక్తి, భాగవతులపై అనురక్తి ఉంటే వాదమెక్కడ – వివాదమెక్కడ? సముజ్జ్వల కాంతిపూర్ణమవుతుంది జగతి. ఆ కాంతి పూర్ణ జగతిలో పరిపూర్ణ శాంతి. క్రాంతి, శాంతి పూర్ణంగా ఉంటే జగతిలో సహజీవనం, శాంతియుతంగా ఉంటుంది. శాంతియుత సహజీవనం వెల్లివిరిసినచోట, ఆత్మదర్శనం నిత్యమౌతుంది. సత్య జీవనమార్గంలో సమత వెలుస్తుంది. అందుకే ఆ రెండు సత్యాలూ రామాయణాత్మ. రామాయణ కావ్య ప్రయోజనం అదే – శాంతియుత సహజీవనం – అసూయలేని అంతరంగాల కలయిక – ఆనందమయ జీవనం – ఆత్మ సాక్షాత్కారం!

పై రామాయణ హృదయమే విహారి "చిరంజీవి ఆశ" కవితాత్మ. సమత్వ బుద్ధి కలిగితే, ఆశయాలూ, ఆచరణలూ ఒక్కటవుతాయి. అప్పుడు సింహికలుండరు. అంతా సురసల నిలయమే. అప్పుడిక అసమానతలకు చోటెక్కడ? మ్యూజియంలోనే చోటు! ఆత్మజ్ఞానం సముపార్జించు కొనక వందుకొని తింటూ, ముఖాలు చెందుకుంటూ జన్మను వృథా చేసుకుంటే– మ్యూజియమే గతి. ధృతి – ధైర్యము గల్గి సర్వవ్యాపారములను ఆత్మోన్ముఖం చేసి దృష్టిని అన్యములపై నిలుపక ఆత్మపైనే నిలిపి నిష్కాముడవై నడిస్తే – మతి – జ్ఞానము కలుగును. జ్ఞానము చెప్పినట్లు యుక్త కర్మలాచరిస్తే – ఫలము. యుక్త కర్మాచరణతోపాటు నిషిద్ధకర్మలను త్యజించవలెను. దీనికి సాక్ష్యము – సామర్థ్యము కావలెను. విహారి చెప్పిన కాలం తెలిసిన కాంతిపుంజం, మతి జ్ఞానము కృషితో చార్జ్ చేయబడిన తేజం, సాక్ష్యం – సామర్థ్యం, సహనం.

ఇదంతా ఎందుకు చెప్పబడిందంటే, వచన కవిత, కథా రచనోన్ముఖమైన మనసులో ఆత్మజ్ఞాన సాధనా సంకల్పం దాగి ఉందనీ, అది కవితల్లో కథల్లో ధ్వన్యాత్మకంగా దాగి ఉందనీ, అది క్రమంగా పరిణతి చెంది – రామాయణ కావ్యాన్ని పద్య శ్రీ పదచిత్రాలుగ



ఆవిష్కరించటం జరిగిందనీ! అందుచేత విహారి కలం నుండి రామాయణం కావ్యం రావటం సహజ పరిణామమేనని పాఠకులకు ఎఱుక జేయటానికే! సహజ పరిణామమే కనుక, సజావుగా, సరళంగా కదిలింది కావ్యరచన!

లేని దానిని ఆవిష్కరించే కాల్పనిక సాహిత్యం నుంచీ, ఆత్మ తేజో దర్శనం చేసి, ఆ అనుభూతిలో, అనుభవాన్ని జోడించి, ఉన్నదానిని ఆవిష్కరించే కావ్యాన్ని అందించారు. విహారి జీవిగా ధన్యుడు. తాను ధన్యుడై ఆ కావ్యాలను మనం చదివి, ఆత్మ నెఱుగుటకు సహాయకారి అయ్యాడు. "ఎప్పటికయినా మానవ పథికుడు చేరుకొనే విశ్రాంతి మందిరం కవిత" అన్న ఆరుద్ర ఆలోచన నిజమైంది. ఆ విశ్రాంతి మందిరాన్ని తాను చేరి, విహారి మనమూ అటకు చేరటానికి మార్గం సుగమం చేసాడు. మన చెవుల్లో "ఓం పూర్ణ మదః పూర్ణాత్పూర్ణ ముదచ్యతే! పూర్ణస్యపూర్ణ మాదాయ, పూర్ణమేవాశిష్యతే" అనే ఉపనిషత్ శాంతి మంత్ర మూదాడు.

రచన చిక్కగా, చక్కగా సాగింది. మిగిలిన అధ్యాయాలకన్నా సుందరకాండ విలక్షణమైనది. బాలకాండ, అయోధ్యకాండ, అరణ్యకాండ, కథ చెప్తవి. అరణ్యంలో జీవాత్మ స్వరూప సీతను రావణుడపహరిస్తాడు. రామవిలాపం ప్రారంభమవుతుంది. శబరి మధురఫలము లెంగిలి చేసి ఇచ్చినది. మనసు ప్రపన్నమవుతుంది. సుగ్రీవదర్శనాభిలాష. కిష్కింధాకాండ – రామ సుగ్రీవమైత్రిని వర్ణిస్తుంది. సీతాన్వేషణా ప్రయత్నాలు. ఇక్కడ సుందరకాండ ప్రారంభం – విలక్షణంగా – ఇక్కడ ఈ కాండలో మూలకథ ఆగింది. లీలాకథనం దివ్యంగా సాగింది. నవవిధ సౌందర్యోపేతరసానంద సాగరం. హనుమ ఈ కాండమంతా నడిపిస్తాడు. రావణుని వైభవం తెలుస్తుందిక్కడ. సీతమ్మ శీలం – సీతారాముల అన్యోన్యతా, జీవాత్మ పరమాత్మల అన్యోన్యతా వెల్లివిరుస్తుందిక్కడ. ఆత్మ సౌందర్యం వికసిస్తుందిక్కడ. అద్వైతతత్త్వం ఆవిష్కృతమౌతుందిక్కడ.

సీతమ్మ జాడ తెలిసింది. హనుమ లంకాపురి ఆత్మను, సీత ఆవేదనను అర్థం చేసుకొన్నాడు. భవిష్యత్ కార్యక్రమ రేఖా చిత్రం తయారైంది. లంక చేరటం, లంకాసురిని చంపటం, సీత చెఱ విడిపించటం, దానికి తొలి ప్రయత్నాలు చేసాడు హనుమ. లంకను కాల్చాడు. లంకేశునితో మాట్లాడాడు. లంక ప్రజల గుండెల్ని శోధించాడు. సమాచారం రాబట్టాడు. సీతమ్మలో విశ్వాసం పాదుకొల్పాడు. విభీషణమైత్రికి పాదువేసాడు. తిరిగి రాముని జేరి విషయం చెప్పాడు. వైదేహి మనసు నెఱిగించాడు. యుద్ధకాండకు నాంది. రామకార్యానికి ఆయువుపట్టు యుద్ధకాండ. ఈ కార్యాని కొచ్చిన రామునికథ బాల,

అయోధ్య అరణ్య కిష్కింధ కాండలు. ఈ రెండింటి మధ్య వారధి సుందరకాండ. ఆత్మ, అనాత్మల సంఘర్షణ – అసలైన అవతార కార్యం – శిష్టరక్షణ – దుష్ట శిక్షణ. శిష్టత్వం 6 సత్తు – ఆత్మ. దుష్టత్వం – అసత్తు – అనాత్మ – భ్రాంతి. ఈ సుందరకాండ జీవాత్మ పరమాత్మల మధ్య వారధి.

విహారి కలం ఎలా నడిచిందో స్థాలీపులాకన్యాయంగా కొన్ని పద్యాలను పరికిద్దాం.

మైనాకుడు హనుమతో సేమము కామము గ్రుమ్మరించుచు.

"బహుదూర ప్రయాణమగుట/ సహజము మార్గశ్రమమ్ము, స్పర్శన సుత నా

సహకారం బిది యల్పము/ ప్రహితుడు! నా శిఖరముపై పదమూడు మొగిన్

సాగర తరణంబను నౌక / మేగలి సాగెడు తరణము, మిక్కిలి తీవ్రా

వేగములుండు నయిన క్షణ మాగుము, విశ్రాంతి గొన సమర్థము లొనరున్.

పదాలు సందర్భ చిత్రణని, సన్నివేశాంత రంగాన్ని ఎలా కనులకు కట్టించాయో చూడండి. ఆ పదబంధాలు సమాచారం ఎఱుకజేసి వెళ్ళిపోవు. మనసులో నిలుస్తాయి. అదీ కవితా శిల్పచాతురి. కథలోని కొసమెఱుపు. క్షణమాగుము – ఈ క్షణం తరతరాలు గుర్తుంటుంది. జీవులకు తరణగా. కార్యశీలతకు ప్రతీకగా, సమయోచితంగా కలగలసిన శబ్దార్థ చిత్రణగా.

తన నడుకున్న సురసతో హనుమ పలికిన మాటలు మధురగతిని మధుర, మధురంగా సాగినవి. (75–87) సురస అంటే ఆనందము నిచ్చునదని అర్థము. ఆ ఆనంద ప్రదాయినితో, తనను పరీక్షించవచ్చిన సురస – దాక్షాయణితో ఎంత ప్రసన్న మధురంగా మాట్లాడాడో చూడండి. కార్యసాధకుని మాట తీరు మదిలో నిల్పండి.

అలాగే త్రిజట కలను కొంచెం వింటే –

"రామచంద్రుని గంటి, విక్రాంతి గంటి/ భావిభాగ్యము గంటి, సంభావ్యమంటి

నింటికేగెద నంచు మిన్నంటి దొరయు– నసురకృత్య మాహ్వానించి మసలగంటి!

నూనెలో మున్గి తేలిన వాని, నెఱ్ఱ సేల దాల్చి గన్నేరు పూమాలలుంచి

నూనె ద్రావుచు మత్తుడై హీన గతిని నేలపై దోర్లు రావణు – నేనుగంటి–



రావణునికి రాగల చేటు ఎంతో సహజంగా కనుల నిండుగా వర్ణింపబడింది. లంకాదహనం చేస్తున్న హరిని (980) సీసపద్యంలో దర్శనీయం చేశారు. ఇక – ఇలపై నెవ్వరు తమ చిచ్చును తాము చేసిన అపరాధములతో తమ తలపైకి తెచ్చుకొనకుందురుగాక!

పై విధంగా సుందకాండములోని ఘట్టాలనన్నింటినీ వివిధ ఛందస్సులలో, కావ్య గౌరవానికి భంగం లేకుండా రసమయంగా నడిపారు విహారి.

ముగింపు పద్యాన్ని పరికిస్తూ ఈ ముందు మాటకు ముక్తాయింపునిద్దాం.

"శ్రీదము – రామ స్వాంతము

శ్రీదము సీతా కటాక్ష శీత స్మితం

బాదర్శిత మాధుర్య క

థా దర్శము సుందరమిది యానందించన్!"

ఓం శ్రీరామ్ ! జయరామ్!

**–అన్నవరం ఆదిశేషయ్య**

**తిరుపతి**

# శ్రీ పదచిత్ర రామాయణంలో పదచిత్రాలు

"సుందరే సుందరీ లంకా, సుందరే సుందరీ కథా!
సుందరే సుందరీ సీతా, సుందరే కిం న సుందరమ్?"

శ్రీమద్రామాయణాంతర్గతమైన సుందరకాండకు గల ప్రశస్తి – ఇది. ఆ సుందరకాండను హృద్యంగమంగా విశిష్ట శైలిలో తెలుగుసాహితీ నందనోద్యానవనంలో నిల్పిన కవి శ్రీ సత్యనారాయణమూర్తి ధన్యచరితులు. కావ్య నామము సుందరమైన "శ్రీ పదచిత్ర రామాయణము."

శ్రీ యనగా మంగళము, శుభదాయకము. అట్టి శుభముల నొసంగగల శక్తి శ్రియః పతి పదములకుఁ దక్క అన్యులకు అసాధ్యము. ఆ పదములు గల స్వామి శ్రీమన్నారాయణుడు. నారాయణుడే శ్రీరామచంద్రునిగా మానవావతారంలో భువి నుద్భవించిన మర్యాదా పురుషోత్తముడు. ఆ ధర్మ స్వరూపుని చరితమే శ్రీమద్రామాయణ ఇతిహాసము. ఆ స్వామి పద సేవలో ధన్యతగాంచిన పరమ భక్తాగ్రగణ్యుడు మన హనుమ. "నీ పద సేవాసక్తియెగాక" అన్నట్లు ఆ ఆంజనేయుని ప్రభుభక్తికి నిలయము సుందరకాండ. అందుకే కవి "శ్రీ పదచిత్ర రామాయణము" గా తమ కావ్యమును వెలయించిరి. ఇది చిత్రపద రామాయణముగాదు, శ్రీ పదచిత్ర రామాయణము. పదవైచిత్రితో చిత్తము నంకిత మొనరించి సల్పిన రామాయణము శ్రీపదచిత్ర రామాయణమేగాని, చిత్రరామాయణమును గాదు.

"పద గాంభీర్యమ్ము, శుభ
ప్రద వైఖరి, ధ్వని, విశేష ఫణితియు, భావా
స్పద రసరీతుల్, గుణములు
తదధీనముగ పదచిత్ర దర్శనమయ్యెన్" – అని (165)లో

'.... జ్ఞాన సమన్వితానుధల్, ధారణలెల్ల వాక్యశుభధావనగా కుశలత్వ మీయ సంస్కార మచ్చువడ......' అని (23 వ) పద్యభాగంలోనూ – కవి ప్రకటించిన తన మార్గము నా ఆలోచనను సమర్థించుచున్నది.

కావ్యంలో వర్ణన లత్యంత రామణీయకములు, సందర్భోచితములై నొప్పారుచున్నవి.

'చుక్కల మాలికల్ కదలి....' (50); అశోకవనంలో సీతాదేవి కూర్చొనియున్న భంగిమల్ని వర్ణిస్తూ సాగిన (446) (447) (448) (449) పద్యాలు ఈ కావ్యానికి



శిరోభూషణాలనవచ్చును. కవి ప్రతిభా వ్యుత్పత్తులకూ, భావశబలతకూ దృష్టాంతాలనవచ్చును. ఆంజనేయుని లంకాగమన సమయమున చేసిన వర్ణన కూడా – కవి భావ సంశుద్ధిని, పదసంపదను తెలియజేయుచున్నది.

లంకా వైభవ దర్శనమున హనుమ గాంచిన రావణుని త్రిలోకాతీత శక్తి సంపన్నత వర్ణనలు; రావణమందిరంలో స్త్రీల వర్ణనలు, అశోకవన శోభలు, లంకాదహన ఘట్టములోని సీసపద్యాలు (980) (984) (985) ఉత్తుంగ కవితా గంగలై సాగినవి.

'మణి వికారములైన సంపన్న విహగ జంతు జాలమ్ము, చిత్ర భుజంగ తురగ
రూపచిత్ర చయమ్ము సంరూఢమయ్యె శ్వాసనూదుట మాత్రము స్రష్టమఱచె!'(296)

పద్యం చివరి ముక్తాయింపుకు, అందలి అర్థపుష్టికి ముగ్ధులం కావలసిందే కద!

అశోకవన ప్రవేశములో సీతమ్మ హనుమకు 'కోరిక వేరుగా, దిటవు కూకటి వేరుగ,......' (484) ఒక మహాశయ వృక్షంగా కనుపించినట్లు సాగిన వర్ణన వుంది. ఈ సామ్యము కవి కల్పనాచాతురికీ, ఔచిత్య శుద్ధికీ తార్కాణంగా నిలుస్తుంది. అలాగే, (485) పద్యంలో – సీతాసాధ్వి బాలుడు కూర్చిన ఓంకారము వలె నున్నదని ఉపమించడం ఎంతటి గంభీర భావనా గరిమమును వెలారిస్తున్నదో విజ్ఞులు గమనించగలరు. సీతారావణ సంభాషణ ఘట్టంలో సీతాసాధ్వి పాత్ర చిత్రణ, బహిరంతరతత్త్వ సందేశం – అద్భుతంగా అక్షర బద్ధం చేశారు కవి.

శ్రీ పదచిత్ర రామాయణ కవికి పూర్వకవులపైగల భక్తి ప్రపత్తులకు వారి సాహిత్య సంప్రదాయాల విజ్ఞతకు – ప్రతీకలుగా కొన్ని ప్రస్ఫుటమైన పద్యాలు కనిపిస్తున్నవి.

'నమోస్తు రామాయ సలక్ష్మణాయ – వాల్మీకి :

'ప్రణతి ప్రణతి శ్రీరామ సలక్ష్మణాయ
శరణు శరణు శ్రీ జనకాత్మజా నమోస్తు' (373)

'అది రమణీయ పుష్పవనమావన మందొక మేడ' – కరుణశ్రీ

'ఆ రమణీయ మండపము నందొక భామిని, యేకవేణి'.... (446)

'అదిగో ద్వారక.....' తిరుపతి వేంకట కవులు

అదిగో పర్వతమూర్ధనిర్మితము రాజాధ్యక్షప్రాసాద'..... (201)

'చెవులు ముకుళించి పాదాల జెంతరించి' (30) అనిన తోడనే, భాగవతంలోని 'పాదద్వంద్వము నేలమోపి' స్ఫురిస్తుంది. ఈ (30) పద్యంలో ప్రదర్శితమైన యోగశక్తి – కవి హృదయ భావనా ద్యుతికి హారతు లెత్తుతోంది.

అవనిజాన్వేషణము – రావణ దర్శనము – అంతఃపుర సుందరుల ఆలోకనము సందర్భములో,

"అందురు శుభాశుభావస్థలందు – మనసె
ఇంద్రియాచరణమునకు హేతువనుచు,
కాని. యెట్టి చాంచల్య వికార సరణి
లేక, నామది స్థిరము నిలిచె నిజమ్ము!" (363)

అన్న పద్యం – వాల్మీకి మహర్షి "మనోహి హేతుస్సర్వేషా మింద్రియాణా ప్రవర్తనే, శుభా శుభాస్వవస్థాను తచ్చమే సువ్యవస్థితమ్" అన్న శ్లోకానికి కవి వినయార్ద్ర వచస్సంపదావిష్కారంగా శోభిస్తున్నది.

అవును. సుందరకాండలోని ఆంజనేయుడు శ్రీ పదచిత్ర రామాయణమున స్థిరముగా నిలిచి – కవికి, పాఠకులకు – స్థిత ప్రజ్ఞత్వాన్ని ఆశీర్వాదంగా అందించినాడు.

ఈ గ్రంథములో ఒక అద్భుతమైన పద్యం పతాకంగా భాసిస్తున్నది. అది ఇంద్రజిత్తు భావనలో రావణతత్త్వావిష్కారం. 'ఏదో బ్రహ్మము మూలధాతువయి పోయెన్ గండశైలమ్ముగా....' అంటూ సాగిన (888) పద్యం ధ్వని సంయుక్తమై, రావణ, భౌతిక, అంతస్తత్వ స్ఫోరకమై – కావ్య గౌరవానికి నిజంగా ఎత్తిన వైజయంతిగా నిలుస్తోంది. ఈ పద్య సంఖ్య కూడా 888 గా కుదురుకోవడంలో ఒక ఆధ్యాత్మికాంతరార్థం ఇమిడిపోయిందనిపించుచున్నది. పండితవరులు విశ్లేషింతురు కాక.

అలాగే, 'ఉపతిష్యంబది నీ కభిశపనము....' (946); 'ఆకాశ సంద్రమే మేలు త్రోవల....' (1077) వంటి పద్యాలు జ్యోతిషశాస్త్ర పరంగా గణించవలసినవిగా తోచుచున్నది.

పద్యపు నడకలో – వంపు వాటాల్నీ, సొబగు సొంపుల్నీ; ధారాశుద్ధినీ వెలార్చే అనేక పద్యాల్ని విషయ విస్తర భీతి వలన ఉదహరించలేకపోతిని.

'వామనమూర్తి యట్టిదయె వానరమూర్తి.....' (118) 'పదితలల తేని తలపది మదిమది లేకుండజేసి మదురగజేయన్' (137); 'నిజమగు తూరుపు గాలియె యౌ....' (372); 'వనము వనమంత వెలుగు సంబరపు పట్టుచీరె దాల్చి పేరంట్రముజేర సిద్ధమైన దనినట్లు స్పష్టమయ్యెనపుడు, కొండగోగులెల్ల – మెఱుగుగొండ్లి సలుప' (416) – వంటి పద్యాలు మనోహరంగా సాగినవి.

ఇట్లు అర్థగాంభీర్యము, శబ్ద సౌందర్యము, పద్యసౌష్ఠవము కలిగి ఆధ్యాత్మికత, ధ్యాన, జ్ఞాన, జ్యోతిష, యోగశాస్త్ర రహస్యముల, మార్గముల నాయా తావుల



దర్శింపజేయుచు కవి తమ అద్భుత కవితా శైలిని ప్రదర్శించియుండిరి. వీరి కవితా నైపుణ్యము, రచనా పాటవము, ధారణా శక్తి, ధారాశుద్ధి అనితర సాధ్యమననేరనుగాని అనన్య సామాన్యమనుటలో ఎట్టి సందియమునకు తావులేదు.

వివిధ ఛందోరీతుల, అలంకార, సందర్భోచిత వర్ణనలు, లోకోక్తుల, జాతీయములతో సర్వాంగీణ సుందరముగా మలచబడినది వీరి కావ్యకన్యక. శ్రీరామపద పద్మములకు సమర్పింపబడిన "శ్రీ పదచిత్ర రామాయణము" ఉత్తమ కావ్యము.

వీరీ రచనకు బూనుట వీరి పురాకృత పుణ్య విశేష వైభవముగాక వేఱొక్కటి కానేరదు. ఇది వారే హనుమవాక్సహద్వారమున ప్రకటించుకొనియున్నారు–

"ఏదో జన్మములోనిది
పా – దేదో – సుకృతమునకు బరిభాషా రూ
పాదుల గూర్చితి కాబో
లీ దివ్యకథనమును గ్రథియించితి నేనున్" – (1118)

వీరి కావ్యము, సత్య – శివ – సుందరమయము. "నానృషిఃకురుతే కావ్యమ్" అన్నట్లు ఆ మహనీయ ఋషి పరం పరాగతమైన భావనా భావ సంశుద్ధి విలసిత మనస్కులైన మా బాబాయి శ్రీ సత్యనారాయణమూర్తిగారు అట్టి మహనీయతను సంతరించుకొన్నవారు. వారి ఈ కావ్యమునకు నా ఆలోచనలను పంచుకొన అవకాశమెసంగినందులకు గర్వపడుచున్నాను. ఆనందించుచున్నాను.

చివరగా, ప్రతిష్ఠకై గాక,
ప్రపత్తితో చేసిన శ్రీపతి నీరాజనము –
"శ్రీ పదచిత్ర రామాయణము."

ఇందలి ప్రతి పదము, ప్రతి భావన, ప్రతి వర్ణన, ప్రతి ఘట్టము సుందరమయం. అందుకే అంటాను "కిం న సుందరం?"

**మీ బుధజనవిధేయుడు**

**విద్వాన్ చల్లా లక్ష్మీనారాయణ**

**ప్రథమ శ్రేణి సంస్కృత పండితులు**

**విజయవాడ**

# ఇది సుందర కావ్యం

శ్రీ మద్రామాయణం భారతీయ పవిత్ర గ్రంథం. ధర్మ కర్మ సూత్ర ప్రబంధం. శ్రీరామచంద్రుడు సుగుణాభిరాముడు. సీతమ్మ తల్లి కథ చేతము చెమ్మగిలజేసే వ్యథాభరిత వృత్తాంతం. సీతారాములు ఆరాధ్యదైవాలు. ఆదర్శ మూర్తులు. ఆత్మీయతా ముద్రలు.

భారతీయ సాహిత్యంలో త్రిమూర్త్యాత్మకములైన రామాయణ భారత భాగవతాల్లో – భారతాన్ని కవిత్రయమున్ను, భాగవతాన్ని పోతన్నగారున్ను నాన్యతోవిధంగా తెనుగు చేశారు. రామాయణం మాత్రం కవిలోకపుటదృష్టమేమోగాని, ఎందరాంధ్రీకరించినా తనివి తీరనిదై ఎప్పటి కప్పుడు క్రొంగ్రొత్త చవులూరిస్తూ కథాకథన ఇక్షుఖండమై నిలిచిన దనటంలో సందేహం లేదు. ఆదికవి వాల్మీకి అనాదిగా కవిచంద్రుల కందించిన అమృత భిక్ష రామాయణం. కావ్యనిర్మాణ శిల్ప కళావేత్తల కది యొక పుష్పక విమానం.

అటువంటి శ్రీమద్రామాయణాన్ని ఆంధ్రీకరించటానికి పూనుకొన్న ఆధునిక కావ్య శిల్పి – ఆత్మీయులు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు. మేమిరువురం జీవిత భీమా సంస్థలో సహోద్యోగులమై మనసులు కలిసి మసలిన సాహిత్య పిపాసువులం. మూర్తిగారు కథా సాహిత్య విహారి. వచన కవితా రచనాచణుడు. నిత్య సాహిత్య పారన వ్రతుడు. సరస్వతీ ఉపాసకుడు. బహు గ్రంథకర్త. లబ్ధ ప్రతిష్ఠుడు పద్యములో పుట్టి, వచనములో పెరిగి, తిరిగి తిరిగి పద్యవిద్యకే పెద్ద పీట వేసిన సంప్రదాయ ప్రేమికుడు. మూర్తిగారి రామాయణ రచన దాదాపుగా పూర్తియైనది. మునుముందు – సుందరకాండ దర్శనీయమవుతున్నది.

అనువాదం అసిధారావ్రతం. మూల గ్రంథానికి న్యాయం చేస్తూనే, కవి తనదైన ముద్రను నిలుపుకోవాలి. మూర్తిగారు వాల్మీకి రామాయణాన్ని తెనుగు చేయటంలో తానొక ప్రత్యేక ముద్రను కూడ జోడించుకొన్నారు. అది రామాయణాన్ని పదచిత్ర రామాయణంగా రూపొందించటం. "పదగాంభీర్యము, శుభప్రద వైఖరి, ధ్వని, విశేష ఫణితియు, భావాస్పద రసరీతుల్ గుణములు తదధీనముగ పదచిత్ర దర్శనమయ్యెన్" అని తానుద్దేశించిన పదచిత్ర రచన యెట్టిదో ప్రస్ఫుటం చేశారు. రామాయణ కథా కథన విధానంలో కవి చేసే పదచిత్ర రచనా విన్యాసాలు పాఠకుల మనోనేత్రాలకు రూపుకట్టేటట్లు చేసి, వారి హృదయాలను రసప్లావితం చేయటమే కవి లక్ష్యంగా మనం భావించవచ్చు.



ఇక నీ సుందర సుందరకాండలోని పదచిత్ర కవితానపద్య పద్య పరంపర లవలోకింతును గదా, "కమ్మని తీపి తెల్గు నొడికారము వేరుల జట్టుకొన్న పద్దెమ్ముల కబ్బపుం బుట" లబ్బుర పఱచినవి. "ఏమి యీ ధీమంతుని వాగ్గుంఫనము! నియతాత్ముని పల్కుల వాడి వేడి! ఏమి వేగము! ఉచ్చారణ రీతిలోని నవచాతురి! జ్ఞాన సమన్వితా సుధల్ ధారణలెల్ల వాక్యశుభధావనగా కుశలత్వమీయ, సల్లలితార్ధ మనస్కుడై" రామాయణ రచన సాగిస్తున్న కవి పూర్వజన్మ సంస్కార పుణ్య విశేషమే అచ్చుపడినట్లనిపించినది. అవును. "సుశ్లోకులు లోకమందు కృతిశుద్ధికి హారతు లిత్తురే గదా!" "అంచిత ధర్మకర్మము ననల్పములైన స్వకార్యభారమున్ మించిన భక్తితోడ తన మేలిమి బల్కుల తెల్పు మారుతి" – రామాయణ కథా కావ్య రచనాచణునిగా సత్యనారాయణుని దీవించి యుండు ననుటలో సందియము లేదు.

మారుతాత్మజుని రామకార్యోద్యమ ప్రస్థానము సాగించిన తీరు పరిశీలింతునుగదా, "తరళ మీ పదచిత్ర, మద్భుత ధామ, మక్షర లాస్యమున్; తెరలి రంగులు వన్నెలు పలుతీరులై కళలీనుచుండ నీ ప్రయోగ మద్భుతమ్ముగ భాసిలె" ననిపించినది. "సెలయేటి గలగల కొలనుల కలవడి కదలిక లొలయు చక్కదనము లొకట, ఫలభారనత పాదపమ్ములు పుష్పసంభరిత తరులెనయు ప్రక్కలొకట, నీరెండచాయల నివ్వరి చేలపై తారాడు పిట్టల తట్టులొకట, చూచి, తిరుగాడి, చెరలాడి, చోద్యమైన పలలశాద్వల దేశముల్ పల్కరించి, ఊలపై ఊయియగుచు సరాగమాడి, చెట్ల చేతుల నూపి చేసేత నొరసి సిరము పైకెత్తి యాకనపు సిరులు చూడగా, విరులు జలజల రాలినవి." ఆనంద మంచులు తాకినది.

ఇంతలో సూర్యాస్తమయము. చెట్లు శ్వాసలు స్తంభించి చిన్నవోయినవి. వనము వన్నెలుడిగి విన్నదనము బొడమినది. అంతలో చంద్రోదయము నెలవెలుగుపూత తన వన్నె బలుచబఱచ మొగము చెల్లియు చెల్లక తొగలఱేడు చూచిచూడని యట్లు ఆలోచించుచున్నాడు. సూర్యవంశ తేజః పుంజమైన శ్రీరామచంద్రుని కార్యార్థియై వచ్చి లంకలోచొరబడిన మారుతాత్మజునకు నేనా మాత్రము సాయము చేయకుందునా అని సుధా ప్రపూర్ణుడు తొంగి తొంగి చూస్తున్నాడు.

నా పంట పండింది. కనువిందు చేకూరింది. లంకలోని భవన భవన సముదాయపు కాంచన శోభలున్, రజత కాంతులు, రత్న దీప్తులున్ మించినవి. రమ్యసౌధముల మేలు విశాల గవాక్ష జాలరుల్, నాల్గువైపుల ద్వారముల్, నాల్గుదెసల బహువిశాల శాలల పంక్తి, పరమ గృహము లచట సర్వతో భద్రములై మణిమయ నిర్మాణ ఫణితి నెగడినవి. ఏమి

లంకా వైభము! లంకా వైభవ వర్ణనము! ఉత్తమ గృహములు, వనములు, ఉత్తమ నీవృత్తులు, మఱి యుత్తమ రథ్యల్, పుత్తడిహత్తిన వనితలు, నుత్తమ సర్వోత్తమ నిధుల నిండినవి. నిజం.

అదిగో - కనియెన్ మారుతి పుష్పకమ్ము, బహువిఖ్యాతమ్ము, సౌభాగ్య సర్వ నిధానమ్మును, జాజ్వల్యాగ్ర్య రత్నాకరంబు, అసామాన్య విచిత్ర సృష్టి ఘనమున్, పూర్ణ ప్రభాకారమున్, జనితా వేగ ధరాధర ప్రకర సంశ్లిష్ట వృక్షాంగినిన్. విద్యుల్లీలలు మన్మథాగ్ని శిఖ నిర్వేల ప్రభాహార్యముల్, పద్యార్థాదృత వ్యంగ్యవైభవ లసత్పాండిత్య రేఖాకృతిన్, విద్యా కల్పిత చాతురీ మహిమతో విస్ఫార సృష్టిం బలెన్ - ఉద్యోగించెను పుష్పకమ్మున సమున్ముద్ర ప్రభాసంబుగన్!

ఇదిగో అశోకవనంలో - అనుకుంటుండగానే రావణాసురుడు దశకంఠు డిటే వస్తున్నాడు :

కైలాసనాథుడే కరుణించి దిగివచ్చి, యితని ఫాలము నధిష్ఠించెనేమొ?
స్వర్గాధినాథు వజ్రాయధము తొరగి, యితని కుడిభుజమై యెనసెనేమొ?
మేరువీస్థానమే మేలు మేలనుకొని, యితని యురమ్మునే యెంచెనేమొ?
గానామృతము పంచగా రుద్రవీణయె యితని నాభికి చేరియుండెనేమొ?

'వచ్చెడువాడు వాడె! పరివారమ్మది వెంట వెంట నడువన్ ద్వారమ్ము దాటెన్, మండపము డాసెన్, అయ్యమరారాతి ధర్మాత్మజన్ దరిసె - అదిగో ఆమెయే సీతామాత! చూస్తున్నాడు హనుమ. రాక్షసీగణంతో ఆమె ఎలా చుట్టబడియున్నదో చూడండి :

'దండుగ చీమలెన్నొ తన దాపున చేరగ మధ్య శర్కరా
ఖండము నిల్చియున్న గతి గాంచెను వానరమూర్తి రాక్షసీ
తండక మధ్యమందుగల తల్లిని, కప్పలదొర్వులో తిరం
బుండిన తామరాకుపయి నుండిన చక్కని నీటి బొట్టునున్!'

మఱి రావణాసురుని కంటికి ఆ సీతమ్మ ఏ విధంగా కన్పిస్తున్నదో -

'కళలెల్ల ఒకచోట కలికిగా మారెబో, కలిసి యొప్పుల కుప్పగా కళగొనె,
శోభనోద్యమము విశ్రుతమయ్యెనో యేమొ, శ్రుతము తా విస్తార శోభలెగసె,
సౌందర్యమే నిర్వచన సృష్టి దనరెబో వదనమే సౌందర్య పదము మలచె,



సౌభాగ్య మేర్చి ప్రసన్నతన్ విచ్చెబో, యాప్రసన్నతయె భాగ్యముగ నమరె
నవనవోన్మేష తారుణ్యనందమెల్ల మూర్తిమంతమై భామినీ మూర్తి కొక్క
నూత్న తోరణమ్మగుచు వినోద మిచ్చె, అహహ యనిపించె దైత్యున కామె గనగ!'

ఆ రావణాసురుణ్ణి ఈ సీతమ్మవారిని అంగుష్ఠమాత్రుడై చెట్టుపైన కూర్చుండిన హనుమ చూస్తూనే ఉన్నాడు. రావణుని పలుకుల ములుకులు, సీతాదేవి విసిరిన గడ్డి పరకలు గమనిస్తూనే ఉన్నాడు.

"ఇటు లిరువది బుజమ్ముల భటుడు రెచ్చి,
గర్జనమ్ముల తర్జనమ్ముల కదనుద్రొక్క-
అటు లయోనిజ నిర్విణ్ణనమ్ములోనె,
నొక్క వైరస్య భావనమూరు తఱిని-
మిక్కుటంబగు దుర్ధర్ష మెక్కువెట్టి
డెక్క గీఱి, వెనుతిరగె రక్కసుండు!"

ఆ పై రాక్షసాంగనలు సీతాదేవిని బెదరించటము, వారిని వారిస్తూ త్రిజట తన స్వప్న వృత్తాంతం వివరంగా చెప్పటమూ విన్నాడు హనుమ. సీతాదేవిని చూచాడు. శ్రీరాముణ్ణి స్తుతించాడు. అది ఆవిడ చెవిని పడింది. హనుమంతుణ్ణి ఆమె చూచింది. అతడు చెట్టుమీది నుంచి క్రిందికి దిగాడు. 'నమ్మిన బంటునమ్మ రఘునాయకు దూతగ వచ్చినాడ' నని పరిచయం చేసికొన్నాడు. రామకీర్తనానికి ఆమె ఎంతో సంతోషించింది. సీతాదేవి దుఃఖంతో చెప్పిన మాటలు హనుమంతుడు విన్నాడు. ఆమెను ఓదార్చాడు. శ్రీరామచంద్రుడెలా ఉన్నదీ కూడ హనుమ సీతతో చెప్పాడు.

'తల్లీ నిన్నుదలంచి రాఘవుడు పెల్లొవేదన గ్రుంగి యుండె
కల్లోలాశ్రు పయోధి నీదు రస రాగారాధనే యాశగా
ఫుల్లాబ్జాక్షి మహీజ యేది యను.... ఇల్లాలేదని మమ్ముజూచు.....
అడుగున్ - నేనేమి వర్ణించెదన్.....'

'పూలమొక్కల వెదకు నిను పూవుబోణి!
బంభరపు గుమి భ్రమియించు భ్రమరవేణి!
లేడి గుంపు నన్వేషించు లేడిగంటి!

నదుల జలముల నెమకు వనజదళాక్షి!'

'చెట్టునీడను గూర్చుండు చిన్నబోయి

గరిక పూలను కోయును కరము గొనును

వాని నొక్క టొక్కటి చేర్చు వరుసలేక

చిత్ర మదియెల్ల గూడును 'సీత' యగును!'

అంతా విన్నది సీతమ్మ. ఉద్విగ్నయైనది. హనుమంతుడందించిన రామముద్రిక నందుకొన్నది. ఏమిచ్చిన నైన తీరు ఋణమే హరి చేయు సహాయమంచు తా కృతజ్ఞభార మనస్కయైనది. ఆవేశ పరవశుడైన హనుమ "నిన్ను రామచంద్రుని నీడ నిల్పువాడ" 'నూ' యనుము తల్లీ అని అర్థించాడు.

'అను హనుమంతు మాటలకు నా జనకాత్మజ నవ్వి, యేమి నా

కనునయ మీయ నీవిధము వ్యాహృతి గూర్చుచు నుంటివేమొ? ఓ

హనుమ! అదెట్లు సాధ్యమగు? ఆకృతి జాడగ నల్పమైన దీ

ఘన వచనంబు లేల? సరి, కాగలకార్యము చేసి పెట్టుమీ"

అన్నది. మన హనుమంతుడేం సామాన్యుడా? ఇంతింతై వటుడింతయై నటుల అంతగా తన శరీరాన్ని పెంచి ప్రదర్శించాడు సీతమ్మ ముందు –

"అంగుష్ఠ మంతటి ఆంజనేయుడపుడు, దివ్య ప్రభల జిమ్ము దేవనగము! అమ్మ మాటలకు చిన్ననైన ముఖ మచట, నగ్నిచ్ఛటా దీపితాననమ్ము పలుకు నెటిపలుకు పలువరుస యపుడు, ఘనవజ్ర సదృశ వక్త్రజము, ధ్వజము, పృషదంశక త్రుటి విస్ఫురిత నఖము, లూర్జిత స్తేమ సంయుక్త ఛురులు కాగ భీమమై, యుగ్రభీకరము గాగ, భీషణ ప్రతి రూపమై బెట్టిదమ్ము మీఱ నద్భుతాకారమ్ము నందజేసె, సంతసము మురుపు మరి విస్మయము గదుర!' ఆ హనుమ స్ఫూర్తి, బలము, తేజము, ధైర్యము గమనించి మురిసిపోయింది సీతాదేవి. అయినా రాముడే వచ్చి తనను తీసికొని వెళ్ళవలసి యున్నదని హితం పలికింది. శ్రీరాముని కిమ్మని చూడామణి నిచ్చినది. రాముని కందించవలసిన సందేశం అతని చెవిని వేసింది.

"దినములు లెక్కపెట్టుకొను దీనను, యసుఱుగ్గబట్టి యీ

దనుజుల మధ్య నుండెదను దాశరథీ! నెలమాత్ర, మంతలో



ననుగొన రమ్ము హర్షణ ఘనంబును చేయుము నా మనంబునున్

బనివడి మోయ తప్పదొక బాధ్యత నెత్తిని పెట్టుకొన్నచో"

హనుమంతు డామె దగ్గఱ సెలవు తీసికొన్నాడు. అశోకవన విధ్వంసం జరిగింది. రావణాసురునకు తెలిసింది. హనుమ నెదుర్కొనుమని – తన కింకరులను, ప్రహస్తుని పుత్రుడు జంబుమాలిని, మంత్రుల పుత్రులను, రాక్షస సైన్యాన్ని, సైన్యాధ్యక్షులను పంపగా వారినందరిని మట్టి కఱపించాడు హనుమ. అసాధారణ పరాక్రమ వంతుడైన అక్షకుమారుణ్ణి కూడా పంపించాడు రావణుడు. ఇక–

'పట్టెను పావమాని రిపు ప్రాణపు పట్టుల, కాళ్ళు బట్టి వే

గొట్టెను నేలకేసి యరి కుట్టుసుఱిట్టటు తేలిపోవగన్'

'అంతటి సంగరమ్మున పరాక్రమం తేజము చూపినట్టి వి

క్రాంతుడు రాజనందనుడు గావున కేకలు పెట్టి యాలిగెన్'

రెచ్చగొట్టబడిన కరి పెచ్చరిల్లి, తొండమున బట్టి యొక్కని బండకేసి బాదినట్లయ్యె కసిమసి మోదినట్లు, నయ్యె పదచిత్ర రచన మచ్చుపడగ!

'క్షమయె దుమ్మురేపెను తరంగముల బెంచె, వార్ధిద్యుమణి చల్లబడియె వాయువొక్క

సారి స్తంభించె నిక యాకసమున సహజ వర్ణ రాశిక్యమది మాఱె, వాసి మాసె!'

ఈ విధంగా అక్షకుమారుడు నిహతుడు కాగా, ఆలోచనలో పడ్డాడు రాక్షసాధీశ్వరుడు!

"పిడికిలి గడ్డము క్రిందుగ

నిడి మోచేయది కాలి నెక్కగ, దేహం

బెదమ కొకించుక వాలగ

నొడయడు నాలోచన బడె, నొకడై తలచెన్"

రావణుని కొలువు కూటానికి కొనితేబడినాడు హనుమ. వాగ్వాదములు హితవచనములు పూర్తియైనవి. కోతితోకకు నిప్పంటించి వదలమన్నాడు రావణుడు. అదే శిక్ష అనుకొన్నాడు. లంకాదహనమైంది. సీతాపునర్దర్శనం చేసికొని, సీతాసందేశం ఆలకించి, తిరుగు ప్రయాణమైనాడు ఆంజనేయస్వామి.

"రామసతి సీత సుచరిత రామనియత ప్రాణయుక్తను దర్శించి వచ్చినాడ" అని చెప్పగానే,

"అమృత ప్రాయంబగు నా
సమయజ్ఞుని వార్త రాము స్వాంతంబునకున్
సమవాయ మలదె, నితమై
సమర్థన స్పర్శ మన్యజనులను తాకెన్"

ఇదీ కథ. ఇది సుందరకాండం. సుందరకావ్యం. ఇక, ఇంత రసవత్తరము రమ్యమునయిన రచన ఆసాంతం ఆస్వాదించి అనుభవైక వేద్యం చేసికొనవలసింది రసజ్ఞులే! వర్ణన నిపుణుడైన కవిని పై ఉదాహరణలలో దర్శించవచ్చు. పదచిత్ర రామాయణంగా తీర్చిదిద్దిన కవి పద్యాలలోని పద చిత్రాలను ఇట్టే గుర్తుపట్టవచ్చు. మూల గ్రంథమైన వాల్మీకి రామాయణానికి మెఱుగులు తురగలింపజేసే కవన చాతుర్యాన్ని గమనింపవచ్చు. కథా కథన శైలి పాఠకులను తనవెంట పరుగులు తీసేటట్లు చేసి, రసరమ్యమైన లక్ష్యానికి చేర్చగలదన్న నమ్మకం నాకున్నది.

ఏ పూర్వజన్మ సుకృతమో వెంట వస్తేగాని, కవి కలం రామాయణం మీదికి వెళ్ళదు. మనసు భక్తి భావ రసార్ద్రం కాకపోతే సుందరకాండ రచన హనుమద్భక్తితత్త్వాన్ని ఆవిష్కరించలేదు. ఈ రెండూ ఒక చోట తారసపడిన యోగమే, మిత్రులు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారి రచనా సామర్థ్యానికీ, కావ్య నిర్మాణ కృతార్థతకు ఆలంబనం. త్వరలో వారి కలం నుండి జాల్వారే సంపూర్ణ పదచిత్ర రామాయణ రసకలశం కోసం ఎదురుచూస్తూ – అభినందిస్తున్నాను.

"ఛందస్సుందర కావ్యనందన కళాశాఖాధిరూఢుండు, తా
సౌందర్య ప్రతి సీత జాడ తెలిపెన్ – సౌశీల్యవారాశి యా
నంద ప్రాకృతి రామచంద్రునకు; తన్నవ్యాతి నవ్యామృత
స్యందమ్మున్ పుడిసిళ్ళ నింపు కవితా "సన్మూర్తి" కీర్తించెదన్"

**–పువ్వాడ తిక్కన సోమయాజి**
**మహాకవి గడియారం వేంకటశేషశాస్త్రి అవార్డు గ్రహీత**
**విజయవాడ**



# శ్రీ పదచిత్ర రామాయణము
# కృతికర్తృ నివేదనము

ఒ క ఆదర్శము వ్యక్తి జీవన వికాసోద్యోగ హేత్వర్థమై
ఒక ఆదర్శము సంఘువృత్త గతి సారోపశ్రుతాశ్లేషమై
ప్రకటస్నిగ్ధ మహానినాదముల గూర్పన్ నిల్చె నీ ధాత్రి, గీ
లకమా రెండును మానవాభ్యుదయ వాల్లభ్య ప్రసారమ్మునన్

శీలమొక్కటి, వేరొండు సేవ; యిదియె
రామగాథ సందేశ సంశ్రవము, భవము;
దాని ప్రాచుర్య దీక్ష కర్తవ్యమగును
'కవి' పదము దాల్చ దలచు యే ఘనునికైన!

అనెడు – దృఢభావ మొందు నా యంతరాత్మ
గుదురుగా బట్టి వేధింప, గొదరు కోర్కె
గలము చిందులు వేసె – సత్కథకు నోచి,
క్రియగ రమ్యరమ్యాక్షర శ్రేణి కదలె!!!

రససారమ్ములు కొన్ని నేర్చుకొని శ్రీ రామాయణంబంత కా
వ్య సుధామంజుల భాషణంబు నిడ భ్రాజ్యంబైన యుద్ఘూర్ణ సా
హసమున్ జేకొని యుంటి, లౌల్యమగు నా యాలోచనంబైన, మా
నస సన్నాహము, నాత్మతృప్తియును సందర్భించె నీ రీతిగన్.

పలుకులు దూకె నిత్తఱిని బ్రాక్తన పుణ్యవశంబునన్, మనం
బలరగ రామగాథ వినయంబున బల్కితి – ధర్మ ధారణా
విలసిత శీల సంజనిత వృత్తలతాంతము నొక్కదాని బా
సల తొలి ముద్దరాలి పద సన్నిధి నుంచెదు భాగ్యమబ్బగన్

మనమున రామగాథ శ్రుతి మాన్యము జేయగ, విన్నయంతనే
మునుకొని కన్నులేమొ తమ మూర్తికి జేరువయయ్యె, గుండె – రా
ముని కడ దిష్ఠవేసె; శుభముల్ శుభరాగ విచారసారముల్
తనవిగ పట్టునీయ, స్వగతమ్మున ధారకు వారమేర్పడెన్

ఈ మధు మధు మధురధార – రామచరిత
కనుక – నా మనోగతమయ్యె గథలు – బొమ్మ
దవులుకొని మతియొక బొమ్మ తరుమురీతి;
కొండపై మబ్బులాటాడుకొనిన యట్లు!

నా రసన కందినట్లు, మననము సాగి
పెకలిన గతి, భావాంబర వీథి చూపి
నట్టి దెస – గథాధార పయనము జేసి
విపులమయ్యెను, చిత్రముల్ విస్తరించె!

వర్ణచిత్రమ్ము లిచ్చితి బరిథి గూర్చి,
యెల్ల లెఱుగుచు భావమ్ము లుల్లసిల్ల
వంపు వాటమ్ము లిడితి బద్యంపు నడక–
విజ్ఞతాదృతి నిల్పుచు వేడ్కలిడితి!

ఇవి పదచిత్రముల్, వరుస యేర్పడె, నన్నిట హృద్యపద్య సు
చ్ఛవి కదలాడె, బద్యముల ఛందపు రూపము భిన్న భిన్న మ
య్యె, విపుల దృశ్యభాగముల వెన్నియొ గాథల రూపమెత్తె; నా
కవనము చిత్తశుద్ధి పరికల్పితమైనది తేటమాటలన్.

బాహ్యావర్తన మంతరాన్వర్థ శీల
చిత్రణాధిక్య గుణముల జెక్కు నెడల
రెండు విధముల బదచిత్ర రేఖ మెఱసె–
నొకటి – కథ; కథనమ్ము వేఱొకటి కాగ!
రామకథ – 'కవి'ది; కథన క్రమము వ్యక్తి
గతము; నిజ మస్మదీయ మా క్రమము; కనుక



దృశ్యముల వెంట దృశ్యముల్ దీటుకొనియె–
సంజెలో పిల్లలాటాడు సరణి జూపి!

ఈ కృతిలో నా రీతిని
నాకృతి దయ నాకళించి, నా పద సౌభా
గ్యాకారణ నందుకొనుడు
సాకల్యాకాంక్ష తోడ; సద్భావమునన్

★★★

సాహిత్యాభిజనమ్ము కొక్క నవ విశ్వాసంబు బూరించి, ఛం
దోహేతిన్ గరమందుబెట్టి శుభ శబ్దోత్కృష్టతన్ దెల్పి, నా
యూహల్ ప్రోవుల కొక్క నెరవున్ యోగ్యంబుగా జేసి, తా
సౌహార్దంబుల రాశిబోసె, గవితా సాహిత్యమందించుచున్;

శ్రీ హర్యాన్వయ వార్ధిచంద్రు దలఘు శ్రీ సాంబమూర్తీశ్వరుం
డా హేళిన్ మరువంగలేను, నిజమా యాశీస్సులీ భంగి నా
సాహిత్యావగతిన్ క్రమంబు, రచనా సారమ్ము బోషించె; ద
న్మాహాత్మ్యద్యుతి కేను మ్రొక్కిడెద – నాత్మాయత్త సంస్కారముల్

అగునా తాతయొకండు – దాశరథి సప్తాహంబులందైక్యమై
సగమై పోయె నటంద్రు; వేరొకరు నిస్సంతాపుడై తాత్త్వికం
బగు సుశ్లోకము జీవనంబుగనె నంద్రాయూరి వారందఱున్;
తెగ చాయల్, తులకింపు లింతపడుగాదే – కోవవైనమ్ముగన్

సుకవి రామబ్రహ్మ మకలుష విశ్వనా
  థ మనస్వి మాతులద్వయమునాకు,
రామకథామృత గ్రంథకర్తయు, ఋషి
  రాఘవ పూర్వనారాయణుండు–
మేనమామకు బావ – తా నుపనేతయై
  ఆశీర్వదించె నా యనువు పండ,

ఒక్క పద్యవ్యూహ మూర్జితాద్భుత కీర్తి
సంజీవి జేసెను సాంబమూర్తి

నసమ సంభృత శ్రుతుని బెద్దమ్మ కొమరు-
నేమొ - యే పుణ్యలేశమ్ము నిచ్చినారొ-
ఇట్టి అక్షర జ్ఞానమే ఇష్టగంథ
రూపమున సంక్రమించె, సంరూఢమయ్యె!

ప్రథిత షట్కాండయుతము శ్రీరామ కథను
గ్రంథ రచనము గావించ గలిగినాను;
బలము - నాదు ప్రవృత్తి ప్రాబల్యమందు,
పెద్ద మనసుల దీవెన సుద్ధి యందు!

అసమయమె యైన నిపుడు నాయనయు, నమ్మ
యున్న నెంత సంతసపడి యుండు వారొ,
కొడుకు రామాయణము జూచి; కూర్చియుండ
జాలెద రొక కన్నీటి ముత్యాల పేరు!

సమభృత్యులు శ్రీదేవి, గు
ణము మేధా పూర్వ దక్షిణామూర్తి, ప్రతీ
త మహాశయులు, బ్రదుకున య
సమృద్ధిని సమర్థులైన జననీ జనకుల్!

ఏరా పొయ్యిని బెల్లి లేచినదిరా - యీ పూట యంచెంతయో
ఆరా దీయుచు దిండివెట్టె నపుడమ్మక్కయ్య పుత్త్రుండు, నే
నా రోజుల్ మరువంగలేను నిజమా యాత్మీయతల్ మెండు, యే
దూరంబుల్ కొలువంగ బోరు; యెదలన్ దోడ్తోడ గాపాడుచున్;

అనురాగంబును బంచె నాయనయె, నన్నాశ్వాసితుం జేసె, గా
వ్య నదీ సంగ్రహమందజేసె, బదసంపన్నంబు జేకూర్చె, జీ
వన మార్గంబున నాకు వెల్ల గొడుగై వాసిల్లె మా శంకర
న్న, నమస్కారములిత్తు, నిత్తు మనసా నా హృద్గతంబౌ నుతుల్!



ప్రక్కగ బాధలం గడుపు వారల మా దయనీయ దుస్థితిన్
మిక్కిలి సానుభూతి గని మించిన శక్తి సహాయమిచ్చి నా
రక్కడ - శాస్త్రి, రాధయ మహార్యులు వారలు చిన్ననాయనల్
పెక్కులు జెప్పలేను, మదిబేర్చి సుమాళపు బీటవైచెదన్!

రాధాకృష్ణుడు - చిన్ననాయన - ననుం బ్రత్యేకమై చూచి, నా
యాధీనం బొనరించె జీవికను, నాకానాడు చూపించె - బా
ధాధూతాత్మకుడైన వైదికుడు - సీతారామయన్ భ్రాత; నా
ధీ ధారన్ గమనించి వారిడిరి భుక్తిన్, గొల్తు నా యిర్వురన్!

ప్రేరణ తాముగా నిలిచి పేరిమి, గూరిమి బంచినారు - నిం
డారు మనంబునన్ - వదిన, యన్నయు; వత్సలతానుబంధ మ
వ్వారల యాదరమ్ము; జయపార్వతి, శ్రీ నరసింహశాస్త్రి - స
త్కారణ కారుణుల్, నియతకర్తలు, చొప్పడినారు - వారికిం
భూరి కృతజ్ఞతల్ బొసగ, బొట్లముగూరిచి యందజేసెదన్!

ఆదాయమ్ములు లేక కష్టముల పాలై యుండియున్, బ్రేమతో
జేదోడై తన చేతనైన గతిజేసెన్ జోక - బాబాయి - సం
మోదార్థిన్ బలరామకృష్ణుడు సంపూర్ణాదరానేతయై
యేదో చెప్పుటకాదు, హృద్గతము లీయీ శ్వాస విశ్వాసముల్!

స్థిరమయిన దొక్క ఉద్యోగవరము గూర్చ
రామవర్ఘుల కొండయ్య ద్వారమున దాను
దర్శకుండయ్యె బెదనాన్న; తలతు నెపుడు-
దేశభక్తిని నేత, గాంధేయవాది;
రామచంద్రుల హనుమంతరావు - శిష్టు!

ఇందఱు కూడి దోహదము లిచ్చిన మొక్కను, సుంత వృద్ధినిం
జెందితిగాని, మూలమగు జీవన సాధ్వసమేదియో యెదన్
సందడి జేయుచున్ విడదు; సత్త్వముకల్మి గుటుంబ బాధ్యతల్,
చందము లెల్ల దీర్చితిని, జ్ఞాన సృతిన్ - సమయజ్ఞతల్ జనన్

గుండెలు చిక్కువెట్టు కలగుండు, కలంకువ, కష్టనష్టముల్
చెండిన రోజులందు నిలిచెన్, వలచెన్, మలచెన్, దలంచె – దా
నండగ – శ్యామలాఖ్య – సతి; యస్మ దభీష్టము, సాధనమ్ము – త
న్మండిత మర్షభావ గరిమంబు, నిజంబు, వరంబు – నాకిలన్!

పొత్తముల గాక బ్రదుకు విప్పులను చదివె
మా కుటుంబమున కొక ప్రమథితము, నవ
లంబ మత్తగారు – విజయలక్ష్మి, ఆమె
యిడు నిరాడంబరతకు నే నిడుదు – నతులు!

గట్టి గింజలు బిడ్డలు కలరు ముగురు,
పుత్రిక యొకర్తు, కొడుకు లిర్వురును వారె,
యల్లు డొక్క కొడుకనిన జెల్లు, నింక
మాదు కోడండ్రు – వారు కొమరితలందు;

లక్ష్మి నారాయణుండు, శైలజయు నల్లు
కుఙ్ఱయు, కుమార్తె; లింక మా కొడుకులు సుచ
రితులు – దక్షిణామూర్తియు, శ్రీనివాసు;
కలరు కోడండ్రు – లక్ష్మియు, కర్ణికయును.

వలయు దౌహిత్రు, డొక పౌత్రి, పౌత్రుడొకడు
పరగ వేంకటరమణ, మాధురియు, శ్రీక
రాఖ్యులవ్వారు మా ముద్దులందు వారు,
వారికిత్తును దీవెన బ్రాలు, మేలు!

వైదిక వృత్తి జీవనము సాగించు దా
 పాండురంగారావు బావగారు,
సర్వార్థ చన్ద్రికా సత్కృతి ప్రాప్త స
 త్కీర్తి లీలాకృష్ణమూర్తి బావ,
ఉద్యోగ మర్యాద నొదవి యర్హత నేర్చి
 చరియించు శంకరశాస్త్రి బావ,



బ్రతుకు పోరున దస్సి వ్రాలినా రక్కయు,
 బావయు, మూడవ బావగారు,
ఉన్నవారికి, బిన్నల – కూత మిచ్చి
మృదువు చిత్తమ్ము లిచ్చు నెమ్మి నెరవార
జేసి, శాంత ప్రశాంత సంస్కృతిని గూర్చి
కావ వేడెద శ్రీరామ దేవదేవు!

★★★

పెక్కులు చెప్పనీయదు, కవిప్రతిభా ప్రతిపాదకమ్ముగా
మిక్కిలి చెప్పఁకోదగిన మేలికృతుల్ వెలయించె దాను; మా
తిక్కన సోమయాజి; సముదీర్ణ విధంబు మదీయ గ్రంథమున్
జిక్కని చిత్తశుద్ధి బరిశీలనముం బొనరించె, నేర్పునన్!

సుందరకాండమన్న నొక సుందర శోభన భావరాశి, యా
నందముగాదె శుద్ధమగు నట్టి ప్రతిన్ సమకూర్తునంచు దా
ముందుకు వచ్చి వ్రాసె సగముందెర, రాజను మేనయల్లు – దే
మందును – నిండు దీవెనల నందు – చిరాయువు, శ్రీసమృద్ధులన్!

సుందరకాండ మొక్క పరి జుబ్బన చూఱల వ్రాసినాను, న
న్నుం దనియింపజాలు పని నూల్కొన భాగ్యమటంచు జేకొనెన్–
డెందము పొంగు హర్షపు వడిన్ మరి దానిని బూర్తి జేసె, నే
సందడి లేక నాదు సతి, శ్యామల – మెచ్చెద దత్స్వభావమున్

★★★

# కైమోడ్పు

ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాస సమయంలో నా కవితాభ్యాసం మొదలైంది. ప్రేరణ : మహావిద్వాంసులు, 'భారతీ నిరుక్తి' కర్తలు స్వర్గస్థ శ్రీహరి సాంబశివశాస్త్రి గారు. భారతంలో కొన్ని ఘట్టాలతో మొదలెట్టి, ప్రబంధాలు, కావ్యాలు వారుగా విశదీకరించడం – నా పూర్వపుణ్య ఫలం. పద్యాలు వ్రాసి చూపిస్తూ వుంటే అద్భుతమైన ధారాశుద్ధి వుందిరా వ్రాయి – అని ప్రోత్సహిస్తూ వుండేవారు ఉపాధ్యాయులూ, సహాధ్యాయులూ.

కొన్ని ఖండికలు – పన్నా, సోరాబ్ – రుస్తుం, విశ్వనాధనాయకుడు వంటివి ఆనాటి నా పద్య రచనలైనవి. ఇప్పుడు లేవు. వ్రాత ప్రతులూ పోయినవి.

బ్రతుకు తెరువు ఆవశ్యకమైంది. జీవికకు పెద్ద పోరాటమే చేశాను.

ఒక ఆరేళ్ళపాటు భుక్తికోసం చెమటోడుస్తూనే, పుస్తకాల పురుగునైనాను. ఎందరో కురువృద్ధుల వంటి సాహితీ వేత్తలు, సిద్ధాంత ప్రవీణుల సాన్నిహిత్యంతో ఆధునిక భావజాలం పూర్తిగా వొంటబట్టింది. అయితే అది చాలా పటిష్ఠమైన, ఆలోచనీయమైన, ఆచరణీయమైన, ఆవశ్యకమైన సంప్రదాయ, భావనల పునాది మీద – మనిషి అభివృద్ధికి ఉన్నతంగా లేచిన భవంతి.

కాలు నిలద్రొక్కుకోనిచ్చిన ఉద్యోగంతోపాటు సహగమనం సాగిస్తానంటూ వేలు పట్టుకుంది – ఆధునిక భావజాలం. ఫలితంగా కథ, నవల, వ్యాసం, నాటిక, కవిత, విమర్శ – అన్ని ప్రక్రియలూ ఉత్తుంగంగా ఎగసి నన్నొక రచయితని చేసినవి.

కథ, కవిత్వం, రచనలు ఒక వంక, మరొకవంక సాహిత్య కార్యక్రమ నిర్వహణ, సంస్థల కార్యకర్తృత్వం, వీటి మధ్య లౌకికమైన డిగ్రీల పరీక్షలు, సభలు, సమావేశాలు, నాటకాలు, కాంట్రాక్ట్ బ్రిడ్జి, ప్రయాణాలూ, ప్రసంగాలూ.... ఇరుసున కందెనలా కుటుంబ బాధ్యతలు, ఈతిబాధలు! ఒక ఉప్పెన, ఒక సుడి, ఒక జడి, ఒక ముడి, ఒక ఆరని దాహం, ఒక లేచి లేవలేని మునుక! ఏ పదాలూ వర్ణించలేని సాలెగూడులో చిక్కుకుపోవడం.

కానీ, దాన్ని ఛేదించుకుని బయటపడగలిగిన వివేకం, విచక్షణా, వివేచనా, జీవన తాత్త్విక తావలంబన– నన్ను నన్నుగా నిలబెట్టిన నాదైన శక్తీ, సామర్థ్యం. చేపట్టిన ప్రతి పనిలోనూ నలుగురి చేతా ఎప్పుడూ అవుననిపించుకున్న బలం, చేవ, జవం. ఓహ్! వ్రాసుకోవడానికి కూడా అందని వొక మహోత్తుంగ తరంగం – ఆ సమయపరిచ్ఛేదం. సరి; జీవితం నేర్పిన అనుభవాలు.... ఉద్యోగ బాధ్యతలు, పదవులు, బదిలీలు..... అదొక అధ్యాయం. కాలం – కనురెప్పల అనుభూతిని స్పర్శిస్తూ, ఐదువేళ్ళ సందుల్నుంచీ జారిపోయింది.

1997 లో మలుపు. రామాయణం వ్రాయాలి. సార్వకాలీనమైన, సార్వజనీనమైన ఆదర్శమానవీయ భావాలకి రూపకల్పన జరిపిన జగత్ప్రసిద్ధమహాకావ్య ఘట్టాల్ని నా నోట పద్యాల్లో పలకాలనే ఒక ఉద్విగ్నత, ఒక మత్తు. ఒక నిర్ణయం మొదలైంది. ఒక దీక్ష, ఒక ఊపు, ఒక పిచ్చి!

ఇది సుందరం. ఇది చాలా చదివి కొంచెం వ్రాసిన సందర్భం. సుమారు రెండు వేల పద్యాల్లో చివరికి చేర్చినవి ఇవి.

'పాండిత్య హీనాః కవయో భవంతి'! నాకు బాగా నప్పుతుంది. నా బలహీనతలు నాకు బాగా తెలుసు! నా కవిత్వంలో గుణాలూ, అవగుణాలూ నా కెరికే. వస్తుగతంగా – ఇది 'పదచిత్ర రామాయణం'. వాల్మీకి అనుసరణ, అనువాదం కాదు. అనుసృజన.

ఇక భాషావిశేషాల గురించి నాలుగు మాటలు :–

సంధులకు సంబంధించిన అంశం. ప్రత్యేకించి గసడదవలు, ద్రుతం గురించి చాలా సందర్భాల్లో ఎంతో స్వాతంత్ర్యం తీసుకున్నాను. అలాగే యడాగమం. ఇక ద్విత్వనకార సంధి కొన్ని పద్యాల్లోకి వచ్చేసింది. ద్రుత ద్విత్వము దుష్టము కాదనీ, ప్రౌఢ వ్యాకర్త చూపిన భాగవతం, హరివంశాది ఉదాహరణలకు మక్కువ పడీ వచించినవి. కావ్యంలో అక్కడక్కడా కనపడుతున్న ప్రయోగం – కొందరు పండితులు నన్ను హెచ్చరించిన అంశం: పట్టుకొని, చేసికొని మొదలగు క్త్వార్థక రూపములకు బదులు అసమాపక క్రియా ప్రయోగంలో అతి విస్తృతంగా పట్టుకపోవు, ఎత్తుకపోవు, తీసుకపోవు, తోడుకపోయి..... వంటి ప్రయోగాలు. భాస్కరరామాయణ ప్రభావం. పైగా పద్యం నడకకు తూగునిస్తాయనీ, ముచ్చట పడీ, ఇవి యిలాగే వ్రాయాలి అనీ – ఒక ప్రేరణతో చేశాను. పద్యం చదివించాలి– అనే లక్ష్యం మీద నాకు గురి ఎక్కువ. వ్యాకరణ నియమాల అతిక్రమణం కావాలని చేసింది కాదు. జ్ఞానలోపం వలన జరిగిందే. ఈ విషయంలో క్షంతవ్యుడిని. కవి పండిత విమర్శకుల సౌజన్యాన్ని అభిలషిస్తున్నాను.



క్రియా పదాల పునరుక్తీ, విశేషణాలు వాడేటప్పుడు రెండు మూడుసార్లు అదే విశేషణాన్నీ లేదా ఆ విశేషణం పర్యాయపదాల్నీ పద్యంలో కూర్చటం – ఇవన్నీ అర్థానుకారియై, స్వభావవర్ణనకు దోహదకారిగా ఉంటాయనీ, పద్యానికొక ఊపునిస్తాయనీ వాడటం జరిగింది. ఇది నా శైలీ విన్యాసంలో వొక మెఱుపు; కవితా శిల్పంలో హృద్యమైన చమత్కారపు విరుపు.

ఇక యతి విషయం. అఖండ యతి బాగానే పడింది–మిత్రుడు సోమయాజి హెచ్చరించినా కూడా. నిజానికి యతిస్థానంలో వచ్చిన పదానికి ప్రత్యామ్నాయాలు వెతుక్కోకుండా ఆవశ్యకమని భావించినప్పుడు అఖండయతి ఆహ్వానించదగిన ఛందస్సౌందర్యం అనీ, సంధిలోని పూర్వాక్షర స్పష్టోదీరణము శ్రుతిసుభగత్వ హేతువై హృదయాన్ని రసప్లావితం చేస్తుంది అనీ నేను గాఢంగా నమ్ముతాను. అఖండయతి, ముకారయతి, విభక్తియతి, అవసరమైన చోట విరివిగా ప్రయోగాలు కావలెననే మతం – నా అభిమతం.

అమృతహృదయంతో నా కృతికి అక్షరాశీస్సుల నందిచిన విజ్ఞులు, పెద్దలు, మిత్రులు, శ్రీయుతులు : డా॥ వి.వి.యల్.నరసింహారావుగారు, ఎల్లూరి శివారెడ్డిగారు, బ్రహ్మ శ్రీ క.ల.నా. కొండలరావుగారు, డా॥ కట్టమూరి చంద్రశేఖరమ్ గారు, అన్నవరం ఆదిశేషయ్యగారు, పువ్వాడ తిక్కన సోమయాజిగారు, అభినందనలనిచ్చిన చిరంజీవి చల్లా లక్ష్మీనారాయణ, వీరందఱికీ కృతజ్ఞతాపూర్వక అభివందనాలు. ఈ సుందరకాండము మొత్తాన్ని అనేకసార్లు పఠించి, పరిశీలించి, ఆనందించి, అనేక సూచనల్ని ఇచ్చిన ప్రాజ్ఞులు, ఆది నుంచీ నా శ్రేయోభిలాషీ శ్రీ రామావఝుల కొండయ్యగారు. వారికి నా హృద్గతమైన నుతులు.

సుందరకాండ ముందటి ప్రచురణకు కొందరు బంధుమిత్రులు తమ సహకారాన్ని అందించారు. వారందరికీ నమోవాకములు.ఈ వినిర్మిత ప్రతిముద్రణ విషయంలో నా

ముందడుగుకు చోదకశక్తిని గూర్చి నడిపించిన ఆత్మీయ మిత్రులు– ఉత్తమ జాతీయ ఉపాధ్యాయ పురస్కార గ్రహీత, ప్రముఖ రచయిత శ్రీ సోమంచి రామంగారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ కృతికాకృతి కల్పించి, కృతిస్వీకరణకు అంగీకరించిన మాన్యులు–విద్యావేత్త, సన్‌ఫ్లవర్ గ్రూప్ విద్యాసంస్థల ఛైర్మన్, లయన్ శ్రీ ఎం.డి.వి.యస్.ఆర్. పున్నంరాజుగారు. వారి సౌజన్య సౌహార్ద సహకారానికి హృదయపూర్వక అభివాదాలు, ధన్యవాదాలు.

సుందరమైన ముఖచిత్రాన్ని అందించిన సుప్రసిద్ధులు బాపుగారికీ; శ్రమతో, శ్రద్ధతో డి.టి.పి. ప్రతిని అందించిన మనుగ్రాఫిక్స్ వారికీ ధన్యవాదాలు. పుస్తకాన్ని ముద్రించిన వేణుగ్రాఫిక్స్ వారికి కృతజ్ఞతలు.

పద్య కవితా సౌందర్యాన్ని ఈ 'సుందరం' లో రసాస్వాదన చేయమని పాఠకుల్ని ఆహ్వానిస్తూ......

వినయాంజలితో.....

**–జొ. సత్యనారాయణమూర్తి (విహారి)**



## ప్రధాన ఘట్టములు : అనుక్రమణిక

ఓం శ్రీ గణేశాయ నమః

# శ్రీ పదచిత్ర రామాయణము

## సుందరకాండము

**కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్**
**ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్**

........

శ్రీనిడి, మానవాళి సుఖజీవన రేఖకు స్థైర్య కల్పనా
శ్రీనిడి, మంగళాభ్యుదయ శీల పరంపరకున్ సుబోధన
శ్రీనిడి, కర్మ భార భవసిద్ధి విశేష మనీష కక్షర
శ్రీనిడి, సత్య ధర్మ పరిశీలుడు, రాముడు లోక మోముతన్!

కృతియై నాల్కల వాలి వాలి, శుభ సంగీతార్ద్ర గానామృతో
చిత కంఠోక్తుల దేలితేలి, మహదాశీర్వాద వేదోక్తిగా
బ్రతిభామూర్తుల నేలి యేలి, నిలిచెన్ – రామాయణ గ్రంథకీ
ర్తిత ధర్మాశయ సారకోకిలము – బోధిక్ష్మాజ తేజంబుగన్!

★★★

'కాల చక్రము సతము సంక్రమణ మెనసి
వసుమతి – పునర్వసువికాసవల్లి నెలసి
నభము – మధ్యందినతరణి సభను నిలిపి
కాలగతి సాగుచున్నంత కాల–మిలను;

కొండలన్నియు నిలకడనుండువరకు
నదుల నీటి ప్రవాహము నడచువరకు
రామకథ ప్రచరించును' – బ్రహ్మవాక్కు;
జగము పదగంగ తరియించు – సత్యవాక్కు!

★★★

1. **తతో రావణ నీతాయాః**
**సీతాయా శ్శత్రు కర్శనః**
**ఇయేషపదమన్వేష్టుం**
**చారణా చరితే పథిః**

2. అంతట శత్రుకర్శనుడు హాళిపొసంగగ లో దలంచె, వ
న్యంతర రావణాపహృతయైన మహాసతి సీత గూర్చి, నా
వంతున కీ యదృష్టము వచ్చె నటంచును, నిర్ణయించె – వే
యంతలు చారణాచరితమైన పథంబున సాగిపోవగన్

**హనుమ మహేంద్రగిరి విహారము – దైవప్రార్థన**

3. అంతట, ఆంజనేయుడు ప్రయాణ ముహూర్తము దగ్గఱైన దం
చంతయు జూచె, వైభవ సమాహృతమైన మహేంద్ర పర్వత
ప్రాంతము జేరె, సంతసము పాలికి జేరినయట్లెయయ్యె, నా
వింతల పుట్టినిండ్ల నెఱ – పెన్పు – హొయల్ తనముందు నిల్వగన్

4. కాంచన గండశైలములు, కప్పిరి రంగుల రాలు, రంగు హె
చ్చించిన రూప్యశైలములు, చిత్రవిచిత్రపు వృక్షజాతులున్,
సంచిత ధాతు సంచయము, శాద్వల దేశములెల్ల కూడి రె
ట్టించిన కోపు, నొప్పిదము, లింపుల జల్లెడ బట్టె నయ్యెడన్

5. సంతసమంత దేహము బ్రశాంతిని దేల్చగ, బావమానికిన్
స్వాంతము పండినట్లు సుఖభావన కల్గెను – కారణమ్మదే–
పొంతన తండ్రి హాయినిడె, పోలిక లొప్పునె యార్ద్రతో క్తికిన్
గంతులు వేయసాగె మది, కౌతుక ముత్సవ శోభ దాల్చగన్;

6. కమ్మని తీపి తెల్గునొడికారము వేరుల జుట్టుకొన్న ప
ద్దెమ్ముల కబ్బపుంబుటల తేలిన చల్లని అమ్మ మాటయే
క్రమ్మిన యార్ద్రతాదృతి మొగంబున వెల్గుల బంచుచుండ నా
తెమ్మెరపట్టి సీతకు మదిన్ నతులర్పణజేసె, నాపయిన్;



7. మించిన వేడ్క–తేజు, కడిమిన్ నలుదిక్కుల నింపుచుండ, బ్రా
ర్థించెను పావమాని, రఘుధీరుని – 'నీ కథ నెంచి, పెంచి, హె
చ్చించి ముదంబునన్ సుఫల సిద్ధిని దిక్కుల పర్వజేసి, దీ
క్షించిన పూన్కికిన్, సుకృతికిం, శుభయోగము సంతరింపుమీ!'

8. 'బాహ్యామాంతరమైన సర్వబల వితతి
వేగవేగోచ్చలిత ధైర్య వితతి, శక్తి,
నీ దయార్ద్ర సమ్మతి చేతనే లభించు
స్వామి – కరుణించుమో రఘురామ, రామ!'

9. కిట్టిన మందువెన్క బరికించి పరార్థ్యవరప్రసక్తితో
బుట్టిన చేతనా ధృతియె బూరటిలన్ హరి సత్త్వమూర్తియై
ఇట్టని ప్రాంజలించెను త్రయీతను కప్పుడు, కర్మసాక్షి! నన్
గట్టున వేసిపొమ్ము, మమకారము బంచుము, పంచుమీ దయన్

10. ఆంతర్యంబును జూడ దైవఘటనం బా దేవతానీక వి
క్రాంతి ప్రోద్బల కారకుండవు మహేంద్రా! నిన్ను బ్రార్థింతు – నా
సాంతం బీ యతనంబు మేలువడగా సాగింపుమీ – చంచలత్
స్వాంత ప్రాసము నెక్కు బెట్టకుము, లక్ష్యాపూర్తి నందించుమా!

11. హుమ్మని పైకిలేచిన ముహూర్త సముద్యమమందు ముందుకున్
బొమ్మను చోదకత్వమది పూర్తిగ నీ దయయౌను, తప్పెనా
ధమ్మను సర్వకామ్యము, తటాలున గూలు సమస్త శక్తులున్!
సమ్మతినిమ్ము స్పర్శన! యశస్సహదాతవు గమ్ము, కమ్మగన్!

12. పూనిన కార్యమా, గుణవిభూత ధర్మాత్మజ జూచివచ్చి, మా
మానిత ధర్మమూర్తి గుణమాన్యుడు రాముకు దెల్పునాజ్ఞ, యా
పూనిక నిర్వహించు తటి బొంచిక నే తెగులున్ తగుల్చక
య్యా – నను గాచి ప్రోవుము స్వయంభువ! కోరుదు నీ ప్రసాదమున్

13. ఒక ధనధృవమున్న నొక ఋణధృవమిచ్చు
సమతుల్య సాధనాచణులు, మణులు
నిరుపయోగ జడము, నెప్పెరుగని ప్రాణి
లేకుండ జగము పాలించు ఘనులు

సంక్షుబ్ధ సమయాన సమధర్మ మెరవాటు
వైచి బ్రోచెదు హితవరులు, వరులు
వృక్షాన దాగిన విత్తులై, వేరున
నీరులౌ, నిప్పులౌ నేరుపరులు

మీరు, పాత దారికి క్రొత్త మెఱుగులిచ్చి
క్రొత్త దారికి ద్వారమ్ము లెత్త గలుగు
నెళవరులు, నిజవరులు, మన్నియలు మీరు
పంచభూతములార – నా ప్రాపు మీరు!

14. అనుచున్ మారుతి ఱెప్పలార్చుకొనె, విశ్వారాధనా ప్రక్రియన్
దన కిష్టంబగు రీతి సల్పుకొనె, జిత్తంబందు వేరొక్క మా
రనుభావంబును వల్లెవేసికొనె, ప్రాచ్యాశా ప్రతీక్షన్ ప్రభం
జను బ్రార్థించె మరొక్కమారు, తన లక్ష్యాచార సిద్ధ్యర్థమై

15. ఈ గతి శుభ్రమానసము నీశ్వర భావన నింపి నిల్వగా,
యోగము, దైవ కాంక్షయు నిజోత్థిత శక్తి సహస్ర మేకమై
రాగిలె, సత్యసుందర నిరస్త శివమ్ములు రూపమెత్తె నాన్
బాగరి కేసరిస్వజు డభంగ శరీర వివర్ధనుండయెన్

16. నాలుగసాధ్య కార్యము, లనర్ఘ్యము, లందును నాందిగా యనన్
జాలు ప్రధాన ఘట్టమిది; శారకుమారుడు భీకరుండయెన్
కాలుగదల్చినంతనె వికావికలయ్యె – మహీధ్ర మొక్కటన్
రాలును, కీలురాలు – ధర రాలెను, గీటులు దేలి వ్రేలగన్

17. పూలను రాల్చి భూరుహసమూహము సేసలు వెట్టె నెల్లెడన్;
కాలముగాని కాలము వికల్పము గొల్పె – 'హరీ' యటంచు – భూ
తాలును జంతుజాలములు దట్టుచు నట్టిటు పర్వుబెట్టె; కా
కోలములున్ విషమ్ముమిసె గుట్టల, రప్పల, చట్టు రాలపై;

18. కూలెను మూలికా తరులు, గుంపులు – దేవగణమ్ము జంకి – కు
త్కీలము వీడి, నింగియునికిం గొన జేరిరి – యాంజనేయు నీ
కేలియు, వీక, ముమ్మరపు కేరుపు, తీరుపు – జూడ జూడ నే
వాలును లేక పాడయిన వ్రాలుగ దోచెను దృశ్యమంతయున్!



19. బాలుడొకండు కేలిమెయి పట్టున గోలములోని పూసలన్
నాలుగు దిక్కులన్ విహరణ ప్రకృతిన్ వెస జల్లినట్లు – శై
వాలము రంగవల్లికి ప్రవాళము లద్దినయట్లు తోచుచున్
గ్రాలెను, సత్తు – చెల్లచెదరై పడు బొమ్మల కొల్వెయయ్యెగా!

20. చిరుహాసమ్మధరమ్ముపై గదల రాశీభూత సామర్థ్యమై
మరుదాత్మీయుడు పెద్దవారలకు సమ్మానంపు కైమోడ్పులన్
బరమాత్మీయులు మిత్రులెల్లరకు భావాకాంక్షలందించుచున్
వరవర్ణంబులు విచ్చుకొన్న పదముల్ వాక్రుచ్చె నుత్సాహియై

21. భావనలెల్ల దాశరథి భావన జేసితి, పెద్దలైన మీ
దీవనబ్రాలు దాల్చితిని, ధీరుడు రాముని బాణవేగమే
ప్రావగ నేను లంక జని, పావని జానకి జూచివత్తు; న
త్తావున తల్లి సీత ప్రథితాత్మిక కన్పడకున్న నత్తఱిన్;

22. దేవ జగమ్ము కేగి, యట, దేవి మహీజను గానకున్న నే
రావణు గట్టి తెచ్చెద సరాసరి రాముని సన్నిధానమే
నీ వలనంచు స్వామికడ నెట్టెద, కాదనుకొన్న లంకనే
రావణు తోడుగా నడల, రావడి జేయుచు తెచ్చినిల్పెదన్

23. ఆరయ నాంజనేయు నియతాత్ముని పల్కుల వేడి, వేగ, ము
చ్చారణ రీతిలోని నవచాతురి, జ్ఞాన సమన్వితా సుధల్
ధారణలెల్ల వాక్యశుభధావనగా కుశలత్వ మీయ; సం
స్కార విచారమచ్చువడ, సల్లలితార్ద్ర మనస్కులై – కపుల్

24. ఏమేమి నవవ్యాకృతి?
యేమీ వాగ్గుంఫనమ్ము? ధీమంతుండీ
సామీరి – యర్థ సారము
మా మదిని బ్రవేశపెట్టె మంగళ మొప్పన్

25. అని తాముబ్బుచు జుట్టు ప్రక్కలకు ద్రోయంసాగి రాస్వాంత సం
జనితానంత నితాంత కాంతి తతి, బ్రాజ్యంబైన తత్ప్రాప్తి కొ
య్యన సింగారము సంతరించుకొని నెయ్యంబొప్పగా సంద్రమున్
గొనబుల్ మీరగ నుబ్బె – వానర మహోద్యగ్ర ప్రహర్షమ్మునన్

### ఆకాశపరిలంఘనము

26. అది సంధించగ వేళయంచు తన వీరైశ్వర్య, శక్త్యనృశం
స్య దయా, జ్ఞాన బలాది శీల, గుణభూషల్ నివ్వటిల్లంగ దా
నుదితోత్సాహుడు దేహమంత కదలన్పూగించె, లోకంబులే
తుది సాఫల్యత గోరుచున్నులికె, బ్రత్యుత్థాన మందించుచున్

27. కాలాభ్ర ముఖిమెనా, నతి
వేలంబగు సింహనాద వేపథువు మహో
త్తాల శరీరుడు చేయగ,
నా లోయలు గుహలు ద్రుళ్ళి, నానందించెన్

28. శిరమును పైకి యెత్తుకొని సీమలనెల్లను పాఱజూచు నా
వరకపి జూడ, మోర – పయిపై నిగుడించిన యచ్చుటెద్దు నా
బరమ మనోజ్ఞమౌ, నయిన వర్ణన మొప్పు వరాహ రూపమే
వరలెనటన్న – బ్రీతియగు, వానికి, వీనికి, నెల్లవారికిన్!

29. ఓలము బెంచి చేతులను నుక్కున చేర్చుచు నప్పళించి, తా
నేలకు నాని కూర్చొని, వినీతుడు, మారుతి – స్థైర్యచిత్తుడై
వాలము దగ్గరించుక నిబంధనమై తనరార జేసె, మో
కాలును వంచి కూర్చుకొని కంఠము నిక్కగ నుగ్గబట్టుచున్

30. చెవులు ముకుళించి పాదాల చెంతరించి
ప్రాణశక్తి హృదయ నిబంధనమ్ము
జేసి, బలపరాక్రమముల చిత్తశుద్ధి
నుంచి, లక్ష్యాన కేంద్రీకరించె మనము

31. ఒక్క ఊపున గగనమ్ము నొత్తరించె
పాదఘట్టన ఘర్షించి పాటు నిడగ
పిడుగులై రాలు రాలెను – పిట్టపిడుగు;
కొండ కొండంత వణుకున గోడియయ్యె



32. గమన వేగాన వృక్షాలు కదలి కదలి
ఊగి యూగి, సమూలమ్ము నునికి నూడి,
హనుమతో గూడి సాగె నాత్మానుబంధ
మెదియె యొక కొంత నుత్సాహ మేచి కోర!

33. కరము శుభమస్తు గాలి యందఱకు దగిలె
గొండమల్లెలు విచ్చగ, కొండగోగు
వేరు బళియన, మొగ్గలు వీగివీగె;
కతయె నిక్కలయయ్యె ప్రకృతికి, వృతికి!

34. తరలి వచ్చిన తరువులు ధరణి కొన్ని,
జలధి కొన్ని – పడుచునుండ, జలజలమని
తన పయిని రాలు పూల ముత్యాలు, కెంపు
లింద్రనీలాలు, మరకతాలెల్ల హరికి
సేసలై, దేవవర్గపు టాసలగుచు,
తనదు మేనున కొక క్రొత్త తగటు గూర్చె,
మెఱపు తీవలు నిండుగ మెఱయుచున్న
నీటమోపరి గుమివోలె నిగిడె, హనుమ!

35. ఆకస మేచి పూచెను యథానుగుణంబున, నాంజనేయ నీ
రాకకు స్వాగతమ్మనుచు రాగము గూరిచి వెల్లునింపి, తా
నా కమనీయమూర్తి కభయాద్భుతి గూర్చెను, కూర్చె బ్రీతి, సు
శ్లోకులు లోకమందు కృతిశుద్ధికి హారతులిత్తురే గదా!

36. సుందరు డాంజనేయుడొక సొంపగు నౌకగ సాగుచుండగన్
సుందర దృశ్యమేర్పడెను, సూర్యుడు జంద్రుడు బ్రక్క ప్రక్క గ
న్పిందులు చేయుచుండె నన వేడుక మీర హరీశు కన్నులం
దందున బొందు బొందె, బెనుపైనవి దృశ్యవిశేష సామ్యముల్

**త్రిపదలు**

37. కదిలెడు కలశము పదరగు నా హరి,
చెదరని యింద్రధ్వజముగ
గుదిరెను లాంగూల మదియె

38 అది వలయాకృతి నొదరగ – పోల్కికి
గుదురును భాస్కరునికి వ
రద గుడి వేసిన దనగ!

39. తోక నిటారుగా వీకదనర్చగ
తోకచుక్కవలె నటు నిటు
నాకంపిత మగుచుండె నది!

40. తేజఃపుంజము జూచిచూచి పరమోత్సేక ప్రహృష్టాత్ములై
భ్రాజిష్ణుండగు ఆంజనేయునికి సర్వార్థాభిమానమ్ముతో
నోజస్సంభృత రాగ గానముల బ్రహ్మోత్సాహ మెక్కాడి రా
యోజన్ సిద్ధులు, గిన్నరుల్, ఋషులు మేలొప్పన్ ప్రబంధాభకున్

41. లోకశుభంబు నీయు యనులోమపు వర్తన నీది కాన సీ
తా కనకాంగి వార్త విదితమ్మగు, మంగళమౌను, యీ తమో
వ్యాకులమౌ రఘూద్వహుని బాములకీవె ప్రభాతమిత్తు, వీ
పోక నిజమ్ముగా వెతల పోకయె దేవజనాళి కంతకున్

42. లోకులు, లోకంబులు, మఱి
లోకేశులు నీకృతి యవలోకన భాగ్యం
బే కనువిందనుకొన, నా
నా కళ్యాణ ఘటనా ప్రణాదము నిడుచున్..

43. సాగుము, సాగింపుము, మా
ఆగామి శుభ ప్రదాత, ఆగమవేత్తా!
నీ గమనము నిర్విఘ్నము
కాగ, గొనుము దీవనశత గాంధర్వంబున్



44. అనుచు పేరు, పెంపు గల వారందరనగ
కేసరిసుతుండు, నగమునకే – వెఱగున
రెక్కలు సమకూరినవన పక్కి తెరువు
మలసి వేగసాగెను ప్రశ్రమమ్ము లేక!

45. ఆకాశ పథంబున శో
భాకర చిత్ర మొనగూర్చు పావని ఆభీ
లాకారపు పెనునీడను
భీకర పత్రమ్మనవలె – పెనుపును బొగడన్

## గమనము – మైనాక సమాసక్తి

46. అంత విశాలమైన యనిలాత్మజు నీడకు గాలి యొత్తిడై
చెంతనె యున్న మేఘములు చిందులు త్రొక్కగ, నీడ సాగు ప
ర్యంతము క్రిందనున్న విపులాంబుధి భాగము ద్రోణియయ్యె, బా
హ్యాంతర హృష్టిపొంగ ననుమన్నకు 'జే'యనె నీటికుప్పయున్

47. మారుతి నీడసోకు తన మానస సీమకు హర్షమీయ, నా
వారధి పూర్వగాథ తన భావనకు న్నులివేడి గూర్ప, నిం
డారు కృతజ్ఞతాభరము నందున నంతకు కొంత దీర్చుకో
దారి తనంత దానెదుర దక్కినదంచు దలంచి; మీదటన్;

48. తన నీరంబుల మున్గియున్న నగవైదగ్ధ్యుండు మైనాకు, కాం
చన నాభున్, సుఖశోభునిన్ – బిలిచి, వాత్సల్యంబు నిండార దా
ననె – బాథోధి – ఫలోదయాప్తికిని పౌర్వాపర్యముల్ దోప, పా
వని కాతిథ్యమునిచ్చి, పైగతులలో వర్ధిల్లుమంచాపయిన్

49. ఘనుడా సాగరు కోరిక
యనుసరణీయంబగు పని యని మైనాకుం
దనుకొనె, పనిగొనె, పయిగనె,
నినుమిడి యరుసము మయిగొనె, నెనయిక మీఅన్

50. చుక్కల మాలికల్ కదలి చోక్షముగాగ నలంకరించె నాన్
బెక్కుగ పుష్ప సంభరిత వృక్షసమూహము వెల్గులీన సొం
పెక్కిన స్వర్ణకాంతి తన మేను బయల్పడి వారిరాశిపై
నిక్కుచు ధాళధళ్యముల నీయగ, లేచె హిరణ్యనాభుడున్

51. ఇంత కింత ప్రసార మ దేను గొందు
నంచు – దివి నీలియవనిక నించె స్వర్ణ
వర్ణమం దిక వలయునే వర్ణనమ్ము?
ప్రకృతి బంగారు తొడవున ప్రతిఫలించె!

52. రయము రయమున గుతుక మిరవుకొనంగ
జనుచునున్న మారుతికట చలన మొకటి
కంటబడె – గడలి బడలికల నడుమను;
నిశిత దృష్టి – ప్రమత్తత నెరవు జనునె!

53. ఇంత యటాత్తుగా నెవడొ యీతడు శీఘ్రమ వచ్చుచున్న వా
డెంతటి తెంపు? నిక్కముగ నియ్యది విఘ్నమొనర్చు యత్నమే
చింతనకేల కాలమని చెచ్చెర ధీకొనె వాయుసూనుడా
పొంతకు జేరినట్టి నగపూరుషశోభుని, స్వర్ణనాభునిన్

54. అంతటి తీవ్రధాటికి మహామహుడా హిమనందనుండె యొ
క్కింత చలించె, నిల్చె, గమనించె, హసించె, సమీరసూను వే
యంతలు జూచె, లోమనము నంతయు నాతనికిచ్చె, హృష్టుడై
చెంతన నంజలించి యనె – సేమము, కామన గ్రుమ్మరించుచున్

55. బహుదూర మీ ప్రయాణము,
సహజము మార్గ శ్రమమ్ము, స్పర్శనసుత! నా
సహకారంబిది యల్పము
ప్రహితుడ! నా శిఖరముపయి పదమూను మొగిన్

56. సాగర తరణంబను నొక
మేగలి సాగెడు తరుణము, మిక్కిలి తీవ్రా
వేగములుండు నయిన క్షణ
మాగుము, విశ్రాంతిగొన సమర్థము లొనరున్



57. రామ కార్యార్థివై చను ప్రథితయశుడ
రామచంద్రుని పూర్వుల ప్రేమవలన,
నింత వాడైన సాగరు డియ్యకొనియె
నోయి – ప్రత్యుపకార పరాయణత్వ
బాధ్యత, మరి కృతజ్ఞతా భావనమ్ము
తరగలెత్త నియోగించె దాను నన్ను,
సముచితంబగు నాతిథ్య మమరజేయ;
సుంత నిలువుము, నిలిచి విశ్రాంతి గొనుము!

58. ధర్మజ్ఞుండయినను, మతి
ధర్మ రిరక్షువగు నొక నిదర్శువె యయినన్,
ధర్మము మాన్యతతి కతిథి
కర్మలిడుట, విధియగునది ఘనులకునేనిన్

59. అని యిటు లుచ్చరించి వినయార్ద్ర వచస్సు, మనస్సు బేర్చి నా
ఘననగరూపి వేడుకొన, గాగల కార్యము దైవనిశ్చితం
బను నిజమాత్మ నెంచి దరహాస విధేయత బ్రీతిమై వచిం
చెను చలినట్టు పట్టి– సమశీలపు భావన భావమై చనన్

60. సేదందేటి పొకాలుమన్న సఖుడా, శ్రేయోభిలాషీ, త్వది
చ్ఛా దాక్షిణ్యము నన్ను గట్టి నిలుపన్ సర్వ ప్రయత్నమ్ములున్
మీదౌ, క్రిందవు, రామభావన మదిన్ మేటిల్లె, కార్యార్థి మ
ర్యాదల్ మన్ననలంచు కాలహరణాయామమ్ము సైరించునే!

61. ఒడబడికగా గనబడని
కడకు నొడబడితి, సఫలత కడపల వలయున్
కడమ మది బట్టని దిపుడు,
కడపుము, మరి యేవిధమగు కలకువ లేకన్

62. ఈనాడూర్జిత సౌహృదమ్ము ఫలమయ్యెన్, జాలు – నీ పేర్మియే
నానా రీతుల నాతిథేయముల సన్మానాదులన్ మించెబో
భానుండస్తము జేరుముందె నగర ప్రాంతావగాహంబుకై
నేనా తీరము జేరగావలయు, నా నీమంబులన్ నిల్పుమా

63. అనుచున్ మారుతి చెప్పగా బ్రకృతమౌ నాంతర్యమున్ విన్న కాం
చననాభుండును నెమ్మదించె; దన హస్తస్పర్శచే వాని శృం
గ నికాయమ్మును గారవించె - గపి, సౌఖ్యశ్లోక సంతృప్తితో
వినయాధిక్య గుణ ప్రదేశము పయిన్ బెంపైన చిహ్నమ్మునాన్;

64. పలుకు పలుకున దేనియ లొలుకజేసి
విస్తర, మతిరిక్తము, విలంబితము గాని,
మధుర ఫల పదవాక్య గుంఫనమునిచ్చి
మనసు వెన్నల వెన్నెల మనవి ననియె

65. ఎట్టి సందిగ్ధములు లేక గూర్చి
శబ్ద సంస్కార సంపన్న శంసలోన
మధ్యమస్థాయి సంగీత మాధ్యమంబు
వరలె, పలుకు మేల్మియు, తాల్మి పరిమళించె,

66. అసదృశ దృఢ చిత్త స్థైర్యమదియు బూస
లోని దారమ్ము పగిది విలువల దెలుపు
తరుచర ఘనునకు - దుహిన ధరణిధర కు
మారు డవ్యక్త నతుల నాచార మిడియె!

67. సెలవని మారుతాత్మజుడు చెచ్చెర ముందుకు సాగిపోవ, నా
జలధి, హిరణ్యనాభ, దివిజాదులు మించిన వేడ్కజూడ, వ
త్సలత తనర్చ, నింద్రుడు సుధాముని జేసెను హేమనాభు, న
య్యలఘు హితమ్ము గొంచు వినయాబ్ధిని ముస్గె నగమ్ము; మీదటన్-

**ద్విరదగతి**

68. ధ్యేయపూరణ గొంచు తేజోమయాత్మకుడు
వాయువీధిని వీడి పవమాను నాత్మజుడు

69. విమల నీలాంబరపు వీధిలో పయనమ్ము
నమర జేసెను : గమ్య మనువొంద నయనమ్ము

70. కాయమ్ము నిల్పుకొని కంథరపు నావగా
సాయకము రీతిగా సాగెనా త్రోవగా



71. శ్రీరామ దాసునికి, క్షేమ ప్రదాతకును,
తీరుగా లభియించె దివ్యవరజేతలును!

**సురస విరసము - హనుమ సంప్రసిద్ధి**

72. ఆరయ నిర్ణయంబు తమదైనను, కార్యము వారిదైన, యీ
ప్రేరణ కెల్ల మూలమును పెద్ద లమర్త్యులె యైన, వారలే
మారుతి యత్న మందును సమాపనమం దవరోధమిచ్చి, యే
మేరకు దానునిల్చు, నొగి మించునొ, యోపునొ, సాగునో - కనన్

73. సరగున వర్తమానమును సర్పసవిత్రికి బంపినారు, తా
నరుగుచునుండె వేగముగ నంబుధి దాటగ, లంకజేర, నా
కరువలి పట్టి, నీదగు రకంబు పరీక్షను పెట్టు మంచు; న
క్కరణిని మెచ్చి యొక్క భయకంపము నీయగ జృంభణాదృతిన్,

74. గ్రక్కున నిల్చె నా సురస గాలికొమారుని సమ్ముఖంబునన్
నిక్కుచు, హుంకరించుచు - బనింగొన నుంటిని, నీవు నా కిటన్
జక్కని ఖాద్యమౌదువని, చయ్యన రమ్మిక నోటి గూటికం
చక్కజు పాటు జూపె, దన యాజ్ఞల ఘంటల మ్రోత జేయుచున్

**మధురగతి**

75. మధురగతి ననియె మారుతి నతుడై
విధి కర్తవ్య ప్రేరణ రతుడై -

76. ప్రభువుల కార్యము పస నావటిలన్
శుభగతి గూర్చుచు సుఖమీయవలెన్

77. దశరథ సూనుడు, దాంతుడు, శాంతుడు,
ప్రశమిత ధీనిధి, పౌరుషవంతుడు

78. జనకుని నియతిని సరిదీర్చు గతిన్
వనవాసమునకు వచ్చెను తృప్తిన్

79. ప్రతిఘుడు, గద్దఱి, ప్రఘనుడు, విరసుడు,
మతకరి, రావణు మాంసలు, దురసుడు

80. ఖడికల గింజక కటకటలాడెను
మిడుగురు సామ్యము మిటమిటలాడెను

81. సుగణోపేతను, శోభన సీతను
నిగిడి హరించెను నిప్పుక – మాతను

82. ముష్కరు రాష్ట్రమ్మునకేగ వలయు
విష్కంభంబిది విరచించవలయు

83. తల్లిని సీతను దర్శించవలయు
తల్లిరొ సురసా దయ జూపవలయు

84. కాదగినది శుభ కార్యము – నేనుగ
కాదగినది చేతు, గట్టెద నేనుగు

85. శశకము పోలికి చండకమొనసెద
దశరథసుతు దయ దనుజు నే నెనసెద

86. నమ్ముము తల్లీ నాపని జరిగిన
సమ్మతి వచ్చెద జననీ సరగున

87. పోనిమ్మిక నా పూనిక దీరన్
పోనిమ్మిక జెప్పుదు నీ తీరున్

88. అంచిత ధర్మ కర్మము ననల్పమునైన స్వకార్య భారమున్,
మించిన భక్తితోడ తన మేలిమి బల్కుల దెల్పు మారుతిన్
గుంచిత దృష్టి నిండ పులుగుంబలె బుల్కున, గిల్లచూపులం
గాంచి, తృణీకరించి, యణగారని కోర్కెను గ్రుమ్మరించుచున్

89. పన్నగమాత యిట్లనియె 'బావని! యెంతలు నేర్చితీవు నీ
పన్నుగడల్, ప్రసంగపు బ్రవాహములున్ – నను మోసపుచ్చలే
వన్న! మదాస్య గహ్వరమునందున జొచ్చుము నా క్షుధా <u>ర్తికై</u>
యెన్నికగన్న యోగిరమ! యీగతి మాటలు కట్టిపెట్టుమీ!



90. నన్నతిక్రమించి వెడల నలక మిగులు
కామరూపిణి నేను, నా కామితమ్ము
దీర్చుకొన గల్గుదాన, సందేహమేల?
బ్రహ్మదేవుని వరమిది పవనతనుజ!

91. వరధర్మస్థితి వీనుకెక్కమి విషవ్యామోహి, వ్యాళాఖ్య – పో
సరిగా దంచును కట్టడించగ – వికాసావిష్ట కోపిష్టియై
సురసన్ గాంచుచు పావమాని యనియెన్ "జూపింపు మీశక్తి – నీ
యరువున్ ద్రిక్కకు మందువేసి చను ప్రఖ్యాతున్ సమీపింపుమీ!

92. ఏవిధి నన్ను నీవు సహియించెదవో కననిమ్ము, రమ్ము – నీ
వే విధి నాస్యలాఘవము నించెదవో సురసా – దురంత వా
దావృత వర్తనీ! యిదిగొ! తావక గ్రాసము నౌదు" నంచు నా
పావని దేహ విస్తరము వాలిక జేసె నమేయ రీతిగన్

93. దశయోజనముల చదరమయ్యె మారుతి
యొకసారి దేహమ్మునుబ్బరించ
నిర్వది యోజనాలిట జేసె సురసయు
విరివి దదాస్య గహ్వరము, వరము;
గంధవాహునిపట్టి కాయమ్ము ద్విగుణీకృ
తమ్మును ద్రిగుణీకృతమ్ముజేయ
నాగమాతయు వదనము నవలీలగా
రెట్టింపు పెంచి వక్రించి నిలిపె
సూక్ష్మబుద్ధి తోడ, సమయస్ఫూర్తి కూడ
మెఱయ – హరి, యున్నటులెయుండి మెఱపు వేగ.
మమర జేసి యంగుష్ఠమాత్రమగు దేహ
మురియ సురసాస్యమును సొచ్చి తిరిగి వచ్చె!

94. క్షేమస్థైర్యము శీఘ్రతల్ వరలగా వాజ్నేత యౌ కేసరి
ప్రేమాశ్లిష్ట వరప్రసాది – నిజకార్యేచ్ఛన్ బ్రతాపించి – తా
వ్యోమాధ్వమ్మున కేగి నిల్చెను – రుచివ్యూఢమ్ము వ్యాపించ – నా
గామోద ప్రతిపాలికన్ గనుచు, వాగార్థంబు దెల్పెన్, విధిన్

95. మున్ముందు చూపిన ముష్కర రూపమే
యొక్కింత యనుమాన మొదవజేసె
పిమ్మట జేసిన పెల్లిదపు బలుకు
నీలోని శక్తిని నిశ్చయించె
నన్నడ్డగించు సన్నాహంబు గమనించ
గండకత్తెరగంద్ర-ఖద్ది గలచె
మొక్కవోవని పూన్కి ముఖవిస్తృతము జేయ
తృటిలోన లోవెల్గు దీప్తమయ్యె
నెంచి నా రాము మది నిర్ణయించుకొంటి
నిన్నుగడచుట కాతడె నేర్పునిచ్చు
నంచు, మెఱపు మెఱసెను భావాంబరమ్ము
నందు, మీద జరిగిన దీ వరసినదియె!!

96. ఎందుకీ విఘ్న, మవరోధ, మెవరి సేత?
దారి గాచగ నీకేమి తగవు కలదు?
నన్ను మ్రింగగ నీకేల పన్నుగడలు?
సుంత యోచించ మర్మమ్ము సొంతమయ్యె!

97. దొడ్డ మనస్సు నిర్జరులదో సురసా! కనుమీ నెపమ్ము - ని
న్నడ్డము వెట్టి నాకొక మహానుభవమ్మును గూర్చినారు, యీ
యెడ్డమి దీర్చినావు గద-యేకట-యమ్మరొ-నీ కతంబునన్
సడ్డ కనంబడెన్, మఱొకసారి - బలమ్ము ప్రచోదితంబయెన్!

98. ఓ దాక్షాయణి నీకు నా నతులు, భావోద్ధర్ష సంపన్నమౌ
వాదంబుల్ పురిగొల్పినన్ - సరసమౌ ప్రావీణ్యమేపారె, నీ
నా దాయంబులు రెండు బాఱె-సెలవా, నా స్వామికార్యంబు-న్యా
యా దర్శంబుగ బూర్తిచేతు నిక-నెయ్యంబైన తియ్యంబుతోన్

99. అను హరి సౌమ్యవాక్కు లమృతాంచిత సేకము లౌచు దోచగన్
కనులు చెమర్చగా సురస-కాయము సాజమొనర్చి, సొంత బి
డ్డను గను తల్లివోలె కపి డగ్గరగా జని, చేతులెత్తి-దీ
వన లిడు సంజ్ఞ జేసి, తనవంతు శుభాంశువు వెల్గ-నిట్లనెన్



100. క్షమయున్, ధైర్యము, సత్యధర్మముల సూక్ష్మగ్రాహివై, యాపద
క్రమమున్ దాటి, జయమ్ము గైకొనియు, సారాంశమ్మునన్ నాకు-స
క్రమమౌ కీర్తిని కట్టబెట్టితివి - సాకల్యంబునౌ నింక, నీ
సమయోద్దీపిత కార్యదీక్షయు; మహీజాతన్ గనం బొమ్మికన్

101. అను దాక్షాయణి సౌమనస్యమును మర్యాదన్ బ్రశంసించి, హె
చ్చిన భక్తిన్ బ్రభుకార్యముం దడవి, రాశీభూత చైతన్యమై
చనుచున్నప్పుడు - సర్వదేవ గణముల్ సాధీయసున్, వాయునం
దను దీవించిరి, సిద్ధసాధ్యవరు లెల్లన్ 'సాధహోసా' ధనన్!'

## గమనానుక్రమము - సింహిక హననము

**తరళములు**

102. తరళ మీ పదచిత్ర మద్భుత ధామ మక్షర లాస్యమున్
హరి వరుండిపుడేగుచున్న ప్రయాణ మార్గము జూడగన్
తెరలు, రంగులు, వన్నెలున్ బలు తీరులై కళలీనుచున్
పరిచితోత్తమ సంప్రయోగ సభాజనమ్ముగ భాసిలెన్

103. వెరవు నేర్చిన ధీరవర్యుడు వేగమై చనుచుండగన్
తెరువదంతయు వింతవింతల దేలు నాకృతి వీథియై
పరగె, నీ కడ మబ్బు తున్కలు పొందు రాగము మీఱగ
న్నురవడించెను - పావమానికి నూర్జితాకృతి గూర్చుచున్

104. అరళముల్ విరళంబులై ననిలాత్మజున్ గదలించగన్
శరము విల్లును జేత దాల్చిన స్వామి ముంగిట నిల్చిన
ట్లిరవు నారెను మేఘరూపము - యిస్తువే నిలువెల్ల సం
బరపు టూపిరి నూదగన్, హరి - పాత్యగేయము బాడుచున్

105. "శరధి దాటగ సర్వశక్తుల శ్వాస నేర్పిన ప్రాణమా,
ధరణి జాతను జూచివచ్చు ప్రతాప మిచ్చిన భావమా,
వర మహాభ్యుదయమ్ము గూర్చెడు భాగ్యమిచ్చిన దైవమా,
యరుగు దెంచిన భక్తపోషక! హర్ష వృద్ధి నిధానమా!!"

106. తరుచరుండనుకొనుచు సాగెను – ధారణన్ రఘురామునిన్,
పరిచితంబుగ రామచంద్రుని భావనల్ నలి వీచగన్
తిరిగి వేరొక వారివాహము దేవిజానకి తీరుగా
నరసె పావని, దీవెనల్ గురియంగ జేసెడు రీతిగన్

107. ఒరిమ – ముందున ప్రక్కలన్ గనుచున్న పావని కొయ్యనన్
గరిమమౌ మొయి లొక్కసారిగ గంటయై, పెనుగంటయై
త్వరితమై జయఘంటికై, వరభావబోధనకాగ, దా
నరసి పావని యంజలించెను – హాసపూరిత దృక్కులన్

108. సరభసంబున నాంజనేయుడు సాగుచుండగ గ్రింద నొ
క్క రమణీయ నభమ్ము పాండుర కాంతితో; మరి ప్రక్కగా
మెఱయు నీలపు మేఘపుంజము; మేలి చాయల వెల్లయై–
వెరవుగా, కనువిందుగా, వినువీధి దర్శనమీయగన్;

109. హరికి దోచెను రెండు పుండ్రములాస్థ నొందు మరొక్కటన్
దిరముగా నట బోరగిల్లిన తీరుగా నభమెంత యెం
త రహిసూపె; విశేష రూపము దాల్చెనంచు ప్రమోద సం
భరిత మానసుడయ్యె పావని పారవశ్య సుదంతుడై!

110. ఛాయా గ్రాహిని సింహికన్ దునిమి, విశ్వాధీశులున్, దేవ వ
ర్గీయుల్ మెచ్చగ, గాలిపట్టి ప్రభు సుగ్రీవున్, వరిష్ఠుల్, సహా
ధ్యాయుల్ వృక్షచరాది ముఖ్యుల మదిన్ దర్శించె, నావెంట, సం
ధ్యా యామమ్మున లంక జేరు తలపుల్ దాపింప, సంవేగియై,

111. చనుచుండన్ జనుచుండ, సిద్ధులు – నిజాచారమ్ము గీర్తించి చె
ప్పిన వాక్కుల్ పునరుక్తమయ్యె హరికిం బెంపొందుచున్ దూకుచు
న్ననువౌ నేర్పును, సూక్ష్మ దృష్టియును, ధైర్యస్థైర్యముల్, బుద్ధియున్
దనవై యుండిన వంట, వారిదొక వాత్సల్యాభిమానంబగున్!

112. నాలుగసాధ్య కార్యముల నాల్గవ కార్యము పూర్తియయ్యె; లాం
గూలము, పాదముల్ మరియు క్రోడము హస్తములొక్కటన్ మహా
భీలపు భంగిమన్ నిలిచి పెంపగు చోదక శక్తినీయ, దృ
గ్జాలము నెల్ల గమ్యపు దిశన్ నిలిపెన్ హరి, ముందుకేగుచున్



## నగర ప్రవేశము – నాంది – ఆలోచనాలోచనము

**కవిరాజవిరాజితము**

113. చనిచని వానరసత్తము డంబుధి చంక్రమణమ్మును సల్పి; ఘనా
ఘనమన నొప్పెడు కాలు త్రికూట నగమ్మున నిల్పి, నగమ్మది, వే
రు నగపు నట్టుగ రూపమరెన్, కపి రూపము భీకర రూఢముగాన్
వనచర ఖేచరవర్గ మదాటున ప్రాయిడి మోముల పాఱుచుబోన్

114. విమల నదీ నద గతు లా
సమయంబున బొంగెను; కపి సత్తము గనుచున్
సరసులు, తటములు, కమలా
కరములు నును వెచ్చనివయి గారవమిచ్చెన్

115. ఈషణ్మాత్రము గ్లానియు, వి
శేష క్లేశమును గొనక, స్మేర సుముఖుడై
వైషయిక నిష్ఠ – భ్రుకుటీ
భీషణ ఫాలుండయి – కపి వేడ్కల గనుచున్,

116. ఒక క్షణమందు లోక శుభ యోగము లెల్లను జూడ్కి నింపు, నిం
కొక దిశ జూచు, దర్శనము నూష్ణశరమ్ముల నింపు, తావులు
త్సుకత చిగుర్చ నింకొకట చూపు విదుర్చు, సచేతనుండుగన్,
సుకరము కాకపోదు పరిశోధన – జాణకు, హస్తవంతుకున్!

117. ఇంత విశాల దేహమున నీ విధి ద్రిమ్మరుచుండరాదు క్రూ
రాంతర వృత్తులౌ యసురులందఱు జుట్టగ వత్తురంచు, భా
వాంతరమున్ మనంబున సమాహృతిజేసి, సుఖంబు గూర్చ, ధీ
మంతుడు, శాంతుడైన హనుమంతు దవాంతర మంతరించుచున్

118. వామనమూర్తి యట్టిడయె వానరమూర్తి, తదీయ రూపమున్
ప్రేమము మీఱు రాగముల వేణువనమ్ములు స్వాగతించె, నా
రాముని బాణమౌ హనుమ రాముని భావన నామతించి, ఆ
రామపు రామతమ్ములభిరామ సుగానము లందు దేలగన్

119. అగణిత శోభల దనరెడు
నగము త్రికూటమ్ము దాని నడుమన్ గల లం
బగిరి శిఖరమ్ము మీదన్
దగు విహరణమున్ బయిగొనె – దరుచర వరుడున్

120. సెలయేటి గలగల, కొలనుల కలవడి,
కదలిక లొలయు చక్కదనమొకట,
ఫలభారనత పాదపమ్ములు, పుష్ప సం
భరిత తరు లెనయు ప్రక్కలొకట.
నీరెండ ఛాయల నివ్వరి చేలపై
తారాడు పిట్టల తట్టులొకట,
నెత్తురు బ్రొద్దులో నెత్తమ్ము లలరించి
వీచు వీజనముల వీడులొకట
చూచి, తిరుగాడి, చెరలాడి, చోద్యమైన
పలల శాద్వల దేశమ్ము బల్కరించి,
ఊలపై ఊయి యగుచు సరాగమాడి,
చెట్టుచేమల నూపి, చేసేత నొరసి;

121. రెండు మూడైన యడుగులు రెచ్చి సాగు
హరి త్రివిక్రమ స్ఫూర్తికి తరులు –విరుల
వీక సేసలు వెట్టిన వితమెయయ్యె,
హరి వరుండయ్యె నొగి పుష్పగిరి వరుండు!

122. సిరము పైకెత్తి యాకస సిరుల జూడ
విరులు జలజల రాలె – కేసరి కుమారు
సిగల నుండి,యిటు కనిన – జిగురుటాకు
లఱగ దీసి, కప్రంపుటరఖు గలిపి,
పులిమి కట్టిన చాందినీ పొడవు సూపె
నభము – క్షితిజ రేఖకు చుంబనము నిగుడ్చ;
భూ నభమ్ముల పళ్ళెరమ్ములకు నడుమ
వర్తులాకార పాత్ర – లంబగిరి యయ్యె!



123. కపి తన కెంపుచూపునడకన్ మునుముందుకు బంప, రాజ సౌ
ధ పటలి వీక్ష్య శోభల ప్రదర్శన మిచ్చెను – వజ్ర, ముత్య, ర
త్న, పృథుల, పుష్యరాగ ఖచితంబుగ కాంతుల నీనుచున్, సుప
ర్వ పటల శీర్ష సంకలిత వర్ణకిరీట సమూహ పంక్తియై!

124. నగరమ్మంతయును త్రికూ
టగిరి శిఖరముపయి నలరుట గనుకొన తమిన్
గగనములో తేలెడు నౌ
కగ దోచెను – లంక – చిత్ర కాంతుల కలిమిన్

125. చిక్కు సవరించి సిగపాయ జక్కజేసి
రాణ జడలల్లి వదల హెురంగు తుఱుగ
లించె నాన్ – రాజ వీధులు మించె నచట,
లంక నుపమించ శిఖరిణి లావు నిలుచు!

126. ఏలనన విశ్వకర్మయు లీలల కల
గల్పి, మానసాంభోధి సంకల్ప బలము
నిల్పి, నెలకొల్పె; నీరధిన్, నేల, నింగి,
లంక సంగమించు కల కలంక నిలువ!

127. అలముకొను సంజ నగరపు
కలకల మలబలము వినెను – కపి వీరుడు, కో
రలతో కృపాణ పాణుల,
బలవంతుల, రక్కసులను, పగతుఱ గనియెన్

128. వారల ఱొమ్ముల విరుపులు
వీరత్వపు నడకలు, మరి బెట్టు, బిగువు ధా
టీ రాగ జనిత దృక్శీ
త్కార భయంకర కృశాను ధర్షణము గనెన్

129. చూచిన దృశ్యతతియు నా
లోచనలున్ మారుతి మదిలో రేపెను – వే
ళోచిత ప్రశ్నలు, ననలే
పూచిన విరులయి తరువుల పొదలిన భంగిన్

130. అటు అంభోనిధి, లంబపర్వత మిట న్నా ప్రక్క పెన్ గందకం
బటుపై సాలము, క్రూర రాక్షసు; లసాధ్యంబైన కార్యంబు – కా
లిటమోపన్; నగరంబు ముట్టడికి నింకేవ్యూహముల్ కావలెన్,
కటువౌ నిర్ణయ మందుకోవలెను – ముఖ్యంబైన వీ యోచనల్

131. వీరిన్ సామము దానమున్ మఱియు నే భేదమ్ము బ్రేరేచియున్
గారాకూరము జేయలేము, కనుకన్ గానైన కార్యమ్ము యీ
యీ రక్షోబల దండనమ్మయిన; యేరీ చేరు వా రీ పురిన్
పారావారము దాటి దాటి, మహదావాపమ్ము గావింపగన్?

132. భావన జేయగన్ దగును వానరయోధ సమూహమందు సు
గ్రీవుడు, నీలుడున్ మఱి ప్రకీర్ణబలుండగు వాలిసూనుడీ
స్థావరమున్ గమించగల వారలు, వచ్చిన వారలైన యీ
దీవిని వీడిపోగల గతిన్ గనలేరిక మార్గమే మగున్?

133. చేవయు, క్రేవయున్, జవము, జీవము గల్గినయట్టి వారికే
యీ వెత యింతదన్న మరి యేమగు తక్కినవారి మాట?యిం
కే వెరవున్నదో తెలియదీ క్షణమం దను నూహపోహలన్ –
బావని సాగె లంబగిరి భాగము నుండి పురమ్ము దిక్కుగన్

134. అంత దటాలునన్ సహజమైన దొకానొక శంక – చేత నా
భ్యంతరమందు లేచుచు భయమ్మున ముంచెను వాయుసూను 'నా
యింతుల మేలుబంతియు, మహీజ, పునీతయు, మాత సీత, సీ
మంతిని యింత కాలమిట మంచిగ దా మనియుండి యుండునే?'

135. ఇది తనకున్ మ్రింగుడు వడ
నిది యగుటన్ గపి, తల విదిలించెను 'పాపం
బది శమియించును గాత' మ
ని దండమిడె విశ్వవిభు, కనిమిషావళికిన్

136. ఆవిధి వ్యగ్రభావముల నార్పుచు నిల్చె నగడ్త ముందఱన్
బావని............................................



## లంకాధిదేవత శ్రధనము

అవిధి వ్యగ్రభావముల నార్పుచు నిల్చె నగడ్త ముందఱన్
బావని, మంగళావహ శుభాశయ వాహనమెక్కె.........

137. పదమెత్తెన్, బదమెత్తె – పృ
షదశ్వ తనయం డధోక్షజ దమ స్ఫూర్తిన్
పదితలల ఱేని తలపది
మది మది లేకుండ జేసి మదురగ జేయన్
...............................................
............................................. దూకె, దా
నావలి గట్టు జేరె పరయంత్రణధామము – కోట గోడపై
జేవ దలిర్ప నిల్చె, జవ జీవము లెల్లను యోగ్యమై జనన్

138. రాశుల్ రాశులు కొల్లగొట్టి తనదౌ రత్నాకరప్రఖ్యకున్
దాశీత్వమ్మును గూర్చె రావణుడు – నౌద్ధత్యమ్ము జూపించి, త
త్త్రాశస్త్యమ్మను జాటె, నా కతన గాదా లంక మేలొందె నం
చాశాబంధమునందె వార్ధి, యటు ఖేయమ్మాజ్ఞ పాలించగన్

139. జగదానందకరుండు రామవిభు నోజన్ బూని సాగించు యిం
పగు కార్యంబున నాంజనేయుడు హిత వ్యాపారమేపార ముం
దుగ ప్రాకారము నెక్కె – చాలును విశుద్ధుండాత డామీదటన్
జగముల్ వెల్గగ జేయు, నేనరిగి విశ్రాంతిన్ వహింపందగున్
బ్రగుణమ్మేర్పడనంచు నస్తగిరి జేరంబోయె సూర్యుండొగిన్

140. ఇల తిమిర మకరము మ్రింగె వెలుగుటెద్దు,
చెట్లు శ్వాసలు స్తంభించ జిన్నవోయె,
నూర్మికలు కాటుక గలియ నుంకడంగె,
వనము వన్నెలుడుగ విన్నదనము బొడమె!

141. పదవడి ముందు వెన్కలను పార్శ్వములన్ బరిశీలనమ్మమై
పదము గదల్చబోయి, హరి వాటము గూర్చుక నిల్చునంతలో
గదిరి, యదాటుగా గదిసి, ఘాతుక భీకర రూపి నిల్చుచున్
వదలెను ప్రశ్న పంక్తులను వారెవ! ఎవ్వరి వీవటంచునున్

142. ఎవ్వరి వాడవు, నీవే
సవ్వడి లేక యిటకేల జనుదెంచితి వే
దవ్వుల వాడివొ – నాకడ
రివ్వవు, వ్యవహారము వివరింపుము వేగన్

143. ప్రశ్నలకు సమాధానము
ప్రశ్నగ దా నడిగె కపి – 'పరాక్రమమునకున్
బ్రశ్నను, పఱగడ వాడను
ప్రశ్నించెద నీ విలాసపంక్తినె తొలుతన్'

144. తోక ద్రొక్కిన త్రాచుగా తొరతొరి తొర
బుసబుసల, రుసరుసల, కాపుదలయమ్మ
గుడిగి సరిజేసికొని చూచి, గుడితిరుగుచు,
గోములే గుబ్బతిల్ల వాక్రుచ్చె నిట్లు

145. 'నేనే లంకను; యెవరే
మేనర్థము గోరుకున్న – యీ, నా – యనుమో
దానుసరణము శరణ్యము,
నా నగరము వోదలచిన నచ్చిక నిమ్మా'

146. క్షణములో సగమున విచారణము జేసె
హనుమ, దేహమ్ము నెక్కించి యనియె నిట్లు
'నగర సౌందర్య శోభ నెందరొ వచింప
లంక జూడ నాకు కుతూహలమ్ము గల్గె'

147. పొడవుగా దిదృక్ష పెరిగె, బోయివత్తు,
సౌధ సంపన్నతలు, వనచారువెల్ల
జూచి, తిరిగి నీముందు చేసాచి నిలుతు,
వచ్చిన తెరువు బోయెద – కచ్చితమ్ము!

148. కదలి, సణగి, రేగి, పెదవి గఱచికొంచు
గుదురు దప్పినట్టి కుండ యయ్యె,
తెగిన పేరునుండి త్రెళ్ళిన పూసలై
నోటిమాట లామె వాటమయ్యె!



149. 'చాలుంజాలు నయ వినయ
కేలి, దివిజులకు, నజునకు కిత్తియనంగన్
జాలినదీ లంకాపురి,
చాలవు – నీవోరి – నన్ను శాసించంగన్'

150. అది విని గాలిపట్టి హృదయంబున దాశరథిన్ స్మరించి, "నీ
మది చెడెనేమొ యేమొ– వినుమా యపవర్గపు బల్కులేల, నీ
బ్రదుకు పెనంగియున్న ముడి – పద్ధతి వేరయి యుండెనేమొ – నే
వదలను లంక జూచుకొని వత్తునిదే పని వర్తమానమై....

151. చన, మీకశాంతి తనరును,
నను నమ్ముము, పోయెదను, వనమ్మెరిగెదనో
ఘన వనితా – నాదు – దిదృ
క్షను, మనవిని, చెఱుపకమ్మి! క్రమమును కనుమీ!

152. అను – కరువలి బిడ్డ పలుకు లంతరంబు
తెలియ కటు నిటు దిక్కులు తెలియనిదయి
అతుల రోష జ్వర ప్రజ్వలితగ – క్రోధ
వహ్ని శిఖల జిమ్ముచు, నుపప్లవము పొదల;

153. 'ఎంతటి తెంపరితనమో
యంతట పలుకుబడి నేర్పు, యబ్రపు మెకమా!
పంతము వీడవు, పురి – నీ
సొంతము కాదుర' యని దురుసును గైకొనియెన్

154. అపుడు లంకాధిదేవత, యనిల సుతుని
కిచ్చె హస్త ప్రహారమ్ము – హెచ్చు మీఱి;
సంకటమయి బిట్టఱచె స్పర్శన సుతుండు
మరునిమేషము తత్తఱ మఱచె, నిలిచె.

155. క్రోధావిష్టుడయి తన వి
రోధికి ఘన వామముష్టి – గ్రూరు మొన – బ్రహా
రాధికృత జూపెను – హరి,
యాధూత గిరివలెనయ్యె నా రాక్షసియున్

156. దెబ్బ కొయ్యన నగరాధి దేవతకు – స
మస్త దేహావయవములు మడగె, నడగె,
దల తిరిగెను, సుడివడుచు వలపలించి,
తేలవైచిన కళ్ళతో నేలవాలె!

157. కూలిన వృక్షమై పడుచు గొంకర పోయిన రాక్షసిన్ గనన్
జాలికి నొత్తిగిల్లె కపిసత్తము దా హనుమంతు డంతలో –
బేల తనంబు బోరన, వివేకము నిల్వగ, భీకరాంగియున్,
మేలని విన్నవించె 'నిజ మే నెఱిగింతును, రక్ష' యంచునున్

158. నీ మహా ప్రతాప ధిషణ  లీదృశమ్ము
లే నెరుగదు – నీ నియమ వ్రతేచ్ఛయు, దయ;
పాటు చాలును,  నీకు నే నోటువడితి,
పెను పునాదుల గదలించి వేసినావు

159. "వినుము – 'వానరుడేనాడు నిను జయించి
నిల్చునో నాడు లంకకు నిండు కళలు,
శోభ లైశ్వర్యమేమి విశ్రుతియుజారు,"
నంచు నొకనాడు తెలిపె స్వయంభువు – విధి;

160. తెలినిజము నేడిచట తేటతెల్ల మయ్యె
నగర వాసుల భద్రత విగమ మగును
సీత కారణ మీ లంక చేటుపడును
నంది శాపము దప్పదు, నాశమగును!

161. పొమ్మిక బొమ్ము వానర! అపూర్వ మహత్వ మనంత మంగళా
ర్థమ్ముల కాకృతిన్ గొలిపి, తావక శక్తిని, భక్తి, లోక భ
ద్రమ్మున కేతమెత్తుము, ప్రథన్ గొని, జాతికి నుత్తమోత్తమా
ధ్వమ్మును జూపి నిల్పుము, పదార్థము సర్వము మేలు గూర్చగాన్

162. ఇక నగరమ్ములోనికి యధేచ్ఛ బ్రవేశముజేసి నీకునౌ
సకలము జూచి పొమ్ము,తగు సాయము జేయుము – రామమూర్తి జా
నకి గొనిపోవ, మీద భువనమ్ముల మోదవనాల జేయుచున్
దనుపును గాక – రాముడు, విధాయక సుస్థిర పాలనాక్రియన్!



163. అని యా లంకిణి పోవ – పావని విచార్యంబైన యా పల్కు లా
త్మనిదానంబులుగా గొనెన్, బిదపకర్తవ్యమ్ము నూహించె, దా
ననుకొన్నట్టిది జేయగా  వలయు సూక్ష్మంబైన రూపంబు నం
చనపాయమ్ముగ వెంటనే తనదు దేహాకారమున్ మార్చుచున్

164. పృషదశ్వ సుతుండప్పుడు
పృషదంశక మాత్రుడుగ తరిగినట్టిడునై
విషయాంశము నిడె – కవి శే
ముషికిన్, ఋషికిన్, మనీష మూర్తుల కృషికిన్ !

165. పద గాంభీర్యమ్ము, శుభ
ప్రద వైఖరి, ధ్వని, విశేష ఫణితియు, భావా
స్పద రసరీతుల్, గుణములు
తదధీనముగ పదచిత్ర దర్శనమయ్యెన్!

166. సుందరుడా హరి యాకృతి
చందము గన నాశ్రయించె సంజ్ఞను – ఛంద
స్సుందర కవితా బంధము,
సందర్భోచితము, శబ్ద సత్వము నిగుడన్!

167. నా కన్న మిన్నయగు యీ
వీకన్నకు నెలమి గూర్చి వీచెద ననుచు
న్నాకడ గదలాడి, యుసిరిడి
జేకొనె నౌరసు; నచట శుషిరమము ప్రసన్నన్!

168. నెలవెలుగు పూత తన వన్నె బలుకబఱచ
మొగము చెల్లియు చెల్లక తొగలతేడు
చూచె, చూడని చూపుల సూడుపట్ట,
లోపిరికి వెలిపిరికి యాలోకమిట్లు!

169. రాముని కార్యమోర్చుచు చొరంబడె నీతడటంచు మించి – యా
సోముడు తొంగిజూచుచు ప్రచోదితుడై కపిజూచి లేవ; యే
మేమి యలభ్యదర్శన మిదేమిటి భేషజమంచు నవ్వుచున్
భూమియు హాస్యమాడె – నెరపుల్ నెరవై మెఱపీనుచుండగన్!

170. నేలకు నింగికి సాజము
మేలము, యిది సరియటంచు మేలగు దారిన్
వీలుగ ద్వరితము సాగెను
గాలికొడుకు తెమ్మెర పులకల – కలవడుచున్!

## నగర రక్షణ కవచ పరిశీలనము

171. క్రొత్తడము పైన నిలబడె
పత్తనము గన – పదలాఘవమ్మున వాలం
బెత్తుక,కన్నులు విచ్చుక
హత్తించిన చిత్తరమన హనుమంతుండున్.

172. సూటిగా సరిచూపుజూడ, నాకాశ చుం
బిత సాంద్ర శింశుపా వృక్ష పంక్తి
సరిసమానపు దృష్టి నరయగా, తరుశోభ
తలదన్ను చిత్ర సౌధ క్రమమ్ము
వాలుగా గనగ, పర్వత పీఠి నుద్యాన
ముల మధ్య జలయంత్రముల హొరంగు
నర్థ పరిధి కలయంగ గాంచ – భవనాం
తర దీప దీపిత విరళ దీప్తి
వృత్త, చతురస్ర, పద్మ, నిశ్రేణి, స్వస్తి
క, మురళీ, దీర్ఘచతురస్ర, ఖండ నాకృ
త సువిభక్త నిర్మిత వివిధ పథ పంక్తి –
నగర శోభల హరి వీక్షణమ్ము జేసె!

173. ఇది యీ ఘట్టమున శుభ
ప్రద మిక సంధింపదగు, పదకము జేతన్
జెదరంబడ జేసెద నీ
మదమత్తుల ననుచు సిద్ధమయ్యెను హరియున్



174. అంచిత ధర్మ కర్మ సమయార్థము రూపము దాల్చినట్లు, కు
ప్పించుచు దూకి, నిల్చి, పురవీధిని, కూడలి, వామపాద మా
వంచక రావణాసురుని వక్రత మూలము మీదవెట్టి, కా
వించెను – వాయుజాతుడు భవిష్య సమాగమ సూచనాంకమున్

175. అంతట దృష్టి సంపుటి నిజాశయమున్ విశదీకరించుచున్
బుంతల జూపుచుండ – గపి –పోడిగ జిర్నగవింతతోప, నే
నెంత మహాశయా రఘుపతీ! యిది మీదయ, పోయిచూతు – మా
ర్గాంతర సంఖ్యవెంటనని కాలుగదల్చుచు ముందుకేగగన్

176. ఒక భవనపు శిల్ప మూకొట్టె పురివిప్పి
నిండుగా నిల్చిన నెమలి భంగి,
ఒక సదనకళ యౌనొహొ యనె నర్తకి
పదముద్ర కరలాస్య ఫణితి పగిది.
ఒక హర్మ్య నిర్మాణ మూపిరులూదె – వీ
ణా లసత్పాణి విన్నాణ విధము,
ఒక దీర్ఘ సౌధ సముపకృతి తాననె
నగరాజు నేలు నౌన్నత్యమునకు
మిద్దె యొక్కటి గద్దెయై మేల్వహించె
మేడ యొక్కటి యేనుగు జాడదోచె
మార్గమున కిరువైపులన్ మదికి – చందు
మఱియు కనువిందుజేసె హర్మ్యముల వరుస!

177. కాంచన శోభలున్, రజత కాంతులు, రత్న మరక్త దీప్తులన్
మించిన రమ్య సౌధముల మేలు విశాల గవాక్ష జాలరుల్,
మంచి మదింపుచేత విసుమానమొనర్చెడు ద్వారతోరణాల్
గాంచె నవాద్భుతంబును, ప్రకాశిత భాగ్య మనోజ్ఞ యోగ్యతన్!

178. నాల్గువైపుల ద్వారముల్, నాల్గు దెసల
బహు విశాల శాలల పంక్తి – పరగు గృహము
లచట సర్వతోభద్రములనగ బేరు
వడసె, మణిమయ నిర్మాణ ఫణితి నిండి

179. పశ్చిమ ద్వార రహితము, పరిమితిని - య
ళింద మున్నను లో గదు లింతకింత
వింతల సమకూర్చు కొనుచు వెలయు సదన
రాజి - యచట నంద్యావర్త రమణ వెలయు

180. తూర్పు వాకిలి గల్గి సంతోషమిచ్చు
గృహము లోలినిల్చు - పరమ క్షేమము లిడ
జాలు - స్వస్తి కాఖ్య కళల దేలు, నవియె
వాస్తు శిల్పుల యూహకు బ్రశ్నలగును!

181. ఉత్తములకు గోర్కె జనింప నుద్యమించు
సదన మదియు విచ్ఛందక సంజ్ఞ దనరు;
వర్థమానము దక్షిణ ద్వార రహిత
భవనమండ్రు, సకలవైభవ ప్రశస్తి!

182. ముందుకు సాగిపోయె గపి, ముత్తెపు ముగ్గుల మున్గు ముంగిళుల్
సందడిసేయ, పార్శ్వముల సవ్వడియున్ గమనించి పోవుచు
న్నందున - నంతలోన మదినంతయు లాగుచు నిల్పెనొక్క - ని
ష్యంద సరాగ గాన సుధ; సౌధమె మోహన రాగమయ్యెనాన్

183. సుగమములగు స్థాయిభేద సుప్రయోగ
సారమెల్ల శ్రుతి సుభగ సంశ్రుతమ్ము,
మధుర మంజుల గాన సమరస సరణి-
కమ్మతెమ్మెర కలగల్పు కదలివచ్చె

184. ఎవ్వరిదీ కంఠ స్వర
మెవ్వరిదీ కీరవాణి, యెవరీ గీతిన్
రువ్వినదం చటు కాంచగ
మువ్వల నవ్వుల రమణుల మువ్వము నవ్వెన్

185. రాగాల పుట్టింటి రామ యాలాపమున్
శ్రుతి జేయు వాణి హారతులు బట్టి
కందర్ప శర కరకంకణ పల్లవిన్
లయల ముంజేతిచిల్క తరి నేర్వ



భావార్థ భామ సప్తకి యనుపల్లవిన్
జిక్కిపోయిన హరి చిందు దెలియ
పద సంపదలనేలు మదనిక చరణాల
దంతియే మంజీర తాళమంద
కాంత కౌదీగె నిక్కుల గతులు దేఱ
కొమ్మ మైవిరుపున గమకమ్ము లురల
రమణుల పరిహాస, పరిహార్య, పరిఘోష
లెల్ల విని గపివరు డెద యుల్లసిల్ల!

186. సదనము వెంట సదనముగ
బదము గదల్చ - వినవయ్యె భటవర గర్వా
స్పద బాహుస్ఫాలన జని
త దీర్ఘనినద విదళిత గదాంబర గర్జల్!

187. ధ్వని వెంట సాగుచున్న ప
వన తనుజుండు కనెను - స్వరవర సాధనతో
ఘన మంత్ర పఠనమున ముని
గిన వారిని, రావణనుతి గిట్టిన వారిన్

188. భవనములందు గానములు, వాద, నినాదము, లెల్ల సందడుల్
రవములు, మ్రోతలున్, ధ్వనులు, రావములున్ గలగల్పు సవ్వడుల్
కువకువ రాల, మందసము గూరి గదల్చుచు మ్రోతజేయు భం
గి వినగనయ్యె, లోగిళుల - గేరుపు గోరప - రట్టు - రట్టడుల్!

189. ఉన్నటులుండి నిల్చె హరి, యొక్క వికారుని జూచె, భీకరం
బన్న పదమ్ము మూర్తిగొనె నన్నటు లొక్కట నట్టహాసముల్
దన్నుగ జేసికొంచు, దన దండము ద్రిప్పుచు గాలి యాటచే
మిన్నును మన్నునున్ గనక మిక్కిలి బీరము లాడువానినిన్

190. ఒకటికి రెండు మూడు మఱి యొద్దుగ నెన్మిది యైన మున్నడుల్
చకచక సాగనీయ బెలుచన్; హరి కాంచెను యాజి బృందమున్
సకల ప్రహార ధారుల, నిశాచర ముఖ్యుల, నేక కర్ణులన్
వికటిత కుబ్జ రూపులను - వేనకు వేలు వికార దేహులన్,

191. తేజస్వంతులు, రూపవంతులు, సుధీధీసార సస్మూర్తులున్
ప్రాజాపత్య గృహీత దండధర లబ్ధ స్థైర్య రోషాకృతుల్
సాజాత్యాప్త బలాధిపత్య గురు ధర్మాభ్యాస విస్తారులున్
రాజౌన్నత్యమె సర్వసల్లపనమౌ ప్రాగల్భ్య శౌటీర్యులున్;

192. కనపడ, జూచి చూచి, త్వరగన్ మునుముందుకు సాగుచుండగా,
మునుకువతో పతాకచయముల్ కొనిపోయెడు క్రూర వీరులన్
పినపెద జోదులన్ గనెను, విస్మయ సంభ్రమ, దిగ్భ్రమమ్ములున్
బెనగొన దా దలంచె గపి, ఫేనిల రాశిని పూసలట్లుగాన్

193. ముండిత శిరస్కుడొక్కడ
ఖండవృత్పత్తి నాసికను నాలుకనున్
ఖండించుకొనుచు దబ్బన
మొండా రెంటికి నిలువున నుంచుక నిల్చెన్

194. అట దర్భాయుధ ధారులున్, ప్రచురధైర్యజ్వాలలౌధీరు లు
ద్భట ధానుష్కులు, పాశహస్తులును, శస్త్రా సంగ సంసక్తులు,
న్నిటలాక్షాదులనైన నిల్చి మరి ప్రశ్నింపించు నుత్సాహు లు
త్కటశక్త్యాశని పాణులున్ గలరు, తృప్తస్వైర సంచారులై;

195. రూపరులు కొందఱు, మరి కు
రూపులు కొందఱు, వికార రూపుల గనుచున్,
జూపుల నలు మూలల దా
నై పరిశీలించుచు నొక యధ్వమున జనెన్

196. మధ్య ప్రాకారంబున
సాధ్యాసాధ్య విదితుడు, శాఖాచరుడున్
బాధ్యతతో బదమిడె దన
యధ్యయనము సాగ; చారయాతువుల గనెన్

197. గజయూధంబులు, వాజి, శంబర, తురంగాస్కాదితంబుల్ మతిన్
ద్విజ సంఘాతము, సువ్రతా కరము, తన్వీబృందముల్, కోడె కాం
డ్రు, జరుల్; భీరహితుల్, ప్రతాపధను, లాక్రోశాఢ్య లుత్తేజులున్
స్రజ సంస్ఫూర్తిని కూర్చుచుండ హరి కాంచన్ సాగె నుత్సాహియై



198. విశదీకరించ - సైన్యము
దశకంఠుని కంటియాన దవులుచు నిల్చెన్
కశశక్తికి సంశ్రద్ధా
వశవర్తి యయిన పసరము వలె - వెఱ తోచన్

199. స్యందన పంక్తులు మ
ధ్యందిన భానుని వయినను దశకంఠునికిన్
బందెగొనె; విమానంబుల
చందము వివరించనేల - ఛలమన జాలున్

200. ఇంతటి రక్షణ కవచ మ
నంత వ్యూహము లమితమునౌ పథకములున్
వింతగ దోచెను మారుతి
కంత నొక నిమేషమాగె - నా వంక గనెన్

## పురోగమనము

201. అదిగో పర్వత మూర్ధ నిర్మితము రాజాధ్యక్షు ప్రాసాద, మ
ల్లదిగో కాంచన వప్రశోభ, యదె పద్మాకార కాసార, మ
ల్లదియే బంగరు రంగవల్లులన రథ్యల్, వానిలో సైన్యముల్
చెదరన్ జేయగలేని కాపుదల వాసిన్ జూపు వీక్ష్యమ్ముగన్

202. కాంచన వారముల్, రజత కాంతుల నీనెడు ద్వార తోరణం
బంచిత శిల్పముల్, మణిమయంబగు సుందర సాలంభంజికా
ద్యంచిత శంభు మూర్తులు, సమంచిత కైకసి సూను రూపముల్
పంచు మనోజ్ఞ ధీరపరిపాక రుచుల్ వెలయించు దేహళుల్.

203. పంచిన పచ్చిపస్పు పఱపా యను భ్రాంతిని బంచు యంకణం
బంచుల దీర్చి కూర్చిన తివాసులు, మధ్య ప్రవాళరాశి కా
వించిన డంబు, కేళకుళి, వృక్ష సమూహ, లతా నికుంజముల్
కాంచని కన్ను లెందుకను కాహళి బోలిన ముఖ్య సౌధమున్;

204. కాంచె – ప్లవంగ వీరు డిక గాలు గదల్చగ బోవు నంత – పై
పంచన రిక్కదారి నొక పట్టును పట్టి వెలుంగుచున్న ఆ
మించుపడాలు – వానరుని మేలు పరీక్షల పోకడారసెన్
మంచికి తోడునీడ – యభిమాన పరంపర యౌట సాజమే!

205. ఆరు బయలు నట్టనడిమి,
బీరముతో నిల్చు తెల్లపిల్లి విధము జ్యో
త్స్నారజము న్నింపుచు దా
నారోహించెను – శశి – గగనాంతర పీఠిన్

206. ఊతి బండ నెక్కిన మృగరాజరాజు
కదన రంగము మధ్యన గజపతిపతి
వెండి కంచాన పేరచ్చు వెన్నముద్ద
రాజ్య సంప్రాప్య భోగాల రాజరాజు

207. పాలకడలి నడిమి చెలువమ్ము లెల్ల
పొంది, తలక్రిందు నిల్చిన మందరమన
శశధరుని యాధిపత్యమ్ము జగతి నిండె
పుడిసె డమృతంపు పెరిమె మీ పుడమి నిండె

208. ఇంచుక దగ్గఱ నుండియు
పొంచుక గమనించి, చూపు పొదలక, హరియున్
కించిద్ధ్వనిధ్వనిత పా
దాంచద్భూషయె పదమన నరుగుచునుండెన్

209. పుష్టజనపూర్ణయౌ నంతిపురము నందు
కాలిడెను వాయుసూనుడు, కాయమునకు
నగరు గంధ ధూపములవి యంజలించె,
గమ్మ తెమ్మెర స్పృశియించె, కళవళించె

210. రావణునంత దుర్జయు బరాక్రమ ఘాతికి నోహటిల్లి – హృ
ద్భావము జావకాఱి, మఱి వైభవమెల్లను డిల్ల వోవగా,
జావక జచ్చి, లంకకు ప్రసాదమునీయ సమోష్ణశీత వా
తావళి గూర్చుచుండి రసహాయులరై యట పంచభూతముల్



211. హరికందిన హాయికి మఱి
మరియాదకు కారణమది, మఱతురె యాప్తుల్–
కరమనువు గాని స్థితియే
దరిసిన గాని, తమ సహజతత్వము నెందున్

212. కుడ్య మాణిక్య పంక్తుల కూర్పుగనుచు
బ్రక్కగా నిల్చె లోజేరి ప్లవగవరుడు,
పరుల గృహము పరీక్షించి పరికరించ
గన్ను గప్పిబోవ సుళువు కాదు, కాదు!

213. కాని, కామరూపుడు వాయుసూనుడతడు
ధార్త వరసిద్ధి విస్తార కీర్తి యతడు
రామ భావనా సంభృత ప్రాణమూర్తి
యతడు; సహజ వృత్తమ? వాని కతయె వేరు!

**మధ్యాక్కరలు**

214. గడుసరి రాజు కామితపు గడులకెల్ల బ్రవృద్ధ మేర్చె
గడబిడి మాంస భక్షణము కాముకుల సమృద్ధి గూర్చె
గడుసువడెన్ వాయుసుతుడు – కావలయు ప్రవృత్తి నేర్చి
వడవడికి పులపొడుచుచు నడచె – దృశి నివృత్తి మార్చి

215. కమనీయమగు స్థితిదనర, కనకాంబరపు మాలలేరి,
యమరించుకొని సిగముడుచు నతివ భంగిమ మేలుసొరు,
రమణి యొక్కతె నేస్తకత్తె రాయిడించగ బట్టె, సిగల
విరిగుత్తి – గోసినరీతి బెనగోసి, చేసె – దా రగడ!

216. మాణిక్యముల కోటయైన మానిని ప్రక్కగా వేచె
జాణెత మసిబొగ్గు విధము, సంపెంగ తరువుగా పూచి
రాణించు రమ కడ – కళ నెరసిన యొక్క ముదిమికలికి,
శాణిత వజ్రమౌ లలన సంతన – వికృతమౌ ములికి!

217. ఒకరిపై యొకరు రుసరుస లుఱుము రక్కసుల కసరులు,
పకపకలు, వికవికలవె, పలకరింపయిన విసరులు,
వికసిత దరహాస చాంద్రి వెలగొన్న సుదతి మైవిరుపు
ప్రకటిత సురతాభిలాష వగగొన్న పడతి మైమఱపు

218. పేర్మిమై ప్రియ నంకసీమ పేరుటుంగరముల కతలు
నూర్మిమై వగలు కేరించ నుపవాచికమ్ముల వెతలు
నర్మిలి మాసిన జంట నంటిన పెడకేకరింత
నర్మగర్భ చతురోక్తులకు నయగారముల చిల్కరింత

219. అచట స్త్రీ పురుషభేదమ్ము లవియెల్ల సమభోగనదులు–
పచరించి, శృంగార జలధి ప్రవహించి లీనమై కదలు,
నచట సౌందర్యమను పద మభిసారికల పరమయ్యె,
నచట విద్యున్మాలలన్ని యా నాయికల వరమయ్యె

220. ధీమంతులు, వినీతవరులు, తేజస్వులు, హితసదయులు
సామప్రచారులున్, సుగుణ సాధీయసుల్, సహృదయులు,
దామోదర విధేయులు మఱి ధర్మాయత సుకర్మపరులు
శ్రీమాన్యులేమి, సామాన్య సేవక గణ యోగ్యవరులు

221. కలరు – కలవు – కలిగె; వినె – కనెను వంటి
క్రియలు సకలము ప్రియమయ్యె – కెరలియాడు
భవనములోన పదచిత్ర పంక్తి కదల,
మనసు తడబడని కడ యా – మాటలేల?!

**మధ్యాక్కర**

222. పదము మధ్యాక్కరయయ్యె, భవన వర్ణన కక్కరయ్యె
సదనమండలి దాటు – కపివృషాకపి యట – చక్కనయ్య–
కదలక గదలిన పిల్లి; కాదొక ఖద్యోత కణిక
చెదరి జారని రఘురాము సేవల కర్పూర కళిక!



223. భగవంతంబగు రాత్రి; యీ నిఖిల విశ్వవ్యాప్త చంద్రుండునున్
భగవంతంబగు; ధారుణీసుత – మహాభాగ్య ప్రపూతం గనన్
భగవంతంబగు, జన్మమింక పరిశుభ్రధ్యేయ విస్ఫూర్తితో
భగవంతంబగు, కార్యమాన్యతకునున్ బ్రాథమ్య మొప్పారెడిన్

224. అగవున్ బూనిన వాయుసూను మదిలో నాలోచనల్ నిండె – స
ర్వ గుణారాధ్యుడు రాఘవాహ్వయుని జీవద్రూపమౌ సీతకై
సగమై పోయిన రాత్రివేళల పునస్సంభావనన్ గూర్చి – నా
కగునే మేలను కొంచు నిల్చె – నట – వీధ్యభ్యంతరంబందునన్

225. ఈగతి నాలోచనలన్
సాగించుచు, ముందడుగుల సాగించుచు, నా
వేగమునన్ జిక్కె హనుమ
నే గతి నవనిజ గనియెద – నెచ్చట ననుచున్

226. మూడడుగులు ముందుకువేయ, ముడివడని – స
మస్య లారడుగులు వెన్క మల్లడించె
నెడద పై నెదొ గుదిబండ నెత్తినట్లు
ప్రశ్నలవి లేచె – పైపైకి; బరువుబెంచె!

227. కానరాకుంటినేమి యీ కళల గనుల,
గళల కాణాచి, సద్ధర్మ కర్మవాసి?
కానరాకుంటి నిచట విక్రాంత వనధి–
క్రాంతి దాతను, మాత నేకాంత వనిత?

228. ఏది శ్రీరామ కనుపాప, యేది మాత?
తన్వి సీత, సనాతన ధర్మశీల,
గుణఖని, పతివ్రతా శిరోమణియు నేది?
తృణతృణావర్తమున జిక్కి దృష్టిజెడితి!

229. శతసహస్ర వదన పంక్తి నతి సునిశిత
దృష్టి నవలోకనము జేసి, తిరిగి, చూచి,
శతశతానేక సునయన వితతి, వక్ర
పక్ష్మ చయము పరీక్షించి – బడలిపోతి

230. శత శతహ్రదాభాస భాస్వంత భూష
భూషిత శుభయోషితల - సంపూర్తి జూచి,
పతి వియోగ భార నత వినత సతులను
వేరువేరుగ జూచుచు వేచినాను

231. నా పనికి నేను జాగ్రత్త నడతతోడ
వేచితిని; భూమి పుత్రి యన్వేషణమ్ము
లో విఘడియలు ఘడియల్ ప్రలోభపెట్టె
ననుకొన, మనము మల్లడిగొనెను కపికి-

232. కడకు నాపని నాలుక కఱచుకొనుట
యౌనె యనుకొనె, నాపైన నాపి, క్షణము
నిబ్బరపుటెదలో నాస నిండజేయ,
మనసది పదింబదిగ జెప్పె - మహిత శుభము!

233. రాజవంశ ప్రజాత, పరమ మనోజ్ఞ
మంగళాభిజాతయు, స్వచ్ఛ మానసాభి
జాత యైన సీతా మాత జాడ దొఱకు,
నెచట నుండును? నిజము - తానిచటె యుండు;

234. ఉండనోపు రఘూద్వహు నొప్పిదమ్ము-
దూళి సోకిన బంగారు తునుక వోలె,
నృత్యమాపి వృక్షచ్ఛాయ నిలుచు నొక - భు
జంగభుక్కు నా; నస్పష్ట చంద్రరేఖ
మాడ్కి; మానిన గాయంపు మచ్చ పగిది!

235. ఉండెనేమొ తా సీత యాశోల్బణమున
ననుకొనె; దిక్కు దిక్కున గనుచు, తిరిగి
చూచి; చూచిన పట్టులే చూచి, చూచె,
నడచె - డోలాయమానమానసుడు - హనుమ!

236. క్రూరత్వంబున నెంచకోదగిన యక్రూరత్వ సాధుత్వముల్,
యేరాళల్లరులందు సాగు నురుటుల్, హెచ్చిల్లు మౌఖర్య సీ
త్కార శ్రేణులు దోచె మారుతికి, లంకాస్థానకం బెంతయున్
భారాంగారిణి మధ్యలో వెలుగు శుభ్రాష్టాపదంబో యనన్



237. ఐహికంబైన యీ లంకయందు వింత
లకట! భాగ్య సౌభాగ్యవస్వైక్య వైభ
వ తతి, యెల్ల యైశ్వర్య సంపదలు - గూడి,
కూడి హెచ్చించినను గాని కొఱత తోచు!

238. బాహిరంబెల్ల మెఱమెచ్చు పండు - సిసలు
కలిమి - కరిమ్రింగిన వెలగగా నగపడు
ఆకులేని కాడ పొడవెంతైన నేమి?
పాలతో తైలమున కేమి ఫలము దక్కు?

239. అని తనలోన దాను విషయాంతము జర్చకు బెట్టుకొంచు దా
గనుగొని నట్టి వింతల, వికాస, వికార, వికల్పమంతయున్,
ఘనవనరాశి తీరమున గన్పడు చట్టు విధమ్ముగా తలం
చెను కపి - తత్తరమ్ము కలచెన్ - బలిమిన్ బిరిపీకు సేయుచున్

240. స్వామిసతీమణిన్ గనగ జాలకపోయిన రామ భావనా
రామమె నాదు చిత్తమను ప్రాభవమేమగు? కార్యదీక్షయన్
సామము గూలనిచ్చి మనజాలను; సీతను గాంచ లంక సం
క్రామము జేతు; జేతు రఘురాముని చేతము - పూచు చూతమున్

241. తన మదిరేగు చింతనల తత్త్వము నెంచి కపీశ్వరుండు - తా
ననువున కర్జముల్ బొనరు నట్టుల భీవ్యధ కల్గకుండ, ని
ల్పిన దృఢ దీక్ష నట్టిటులు వీసరవోవగ జేయరాదటం
చనుకొని, చాలు నీ గతి పునశ్చరణమ్మని ముందు సాగుచున్

242. చుట్టు ప్రక్కల పులుకున జూచె; జూచె-
భూతధారణి సంమూర్ఛ భోగమందు
నుండ - నొకవైపు, వేరొక దండ - వ్యావ
హారిక వ్యాపృతియు త్రేన్పులై మసంగె!

243. ఎవడొ, అగడీడు గిరగిర నేడికోల
ద్రిప్పుచు నొక విన్యాసంపు తెంపునింపె,
నొక నిశాటి సిగ్గు నవల నునిచి, పైట
దీసి - పిల్లి మొగ్గల వేసి, యేసరేగె!

244. క్షణము – లోపల్కు హెచ్చరికనిడె, దననె
జూచుకొనె – కపి; ద్వంద్వంపు చొప్పు దెలిసె
మాఱురూపు కాదది సుకుమారు రూప
మగుట గమనించి తత్తఱబడియె, వడకె!

245. తలచె నిది – 'ప్రమాదోధీమతామపి' యని
బాలలీలాపరత్వము బదులు గూర్చ
త్వరితగతి పృషదంశక తంత్రమునకు
పరిణమింపజేసె – కాయమ్ము – పట్టునిలిపె

246. అట జనునంతలో ప్రముఖు లప్పటికప్పుడె యేగుదెంచి నా
రట గుమిగూడరాదని బరాబరి సల్పుచు; వారి వెంట – మి
క్కుటముగ వాహనమ్ములును, కొల్వు బలమ్ములు వచ్చె, నంత మ
ర్కటవరు డుక్కలుండగుత, గాలు గదల్చుచు నిల్చె – నక్కుచున్

247. కలగల్పు చూపుల నటనిట
కలయగని, వెఱగున దారికాపరి నేమా
ర్చి, లవ మనుమాన మీయక
మలయుచు బ్రాంగణము దాటె మారుతి, మఱుగై!

248. సైనిక వాహనాది పలు శాలల దాటుచు ముందువెన్క సం
స్థాన విశేష వేపిత విధాన విధాయకుడౌచు, వీక భా
వానుగతిన్ బదమ్ము గుఱివాఱగ నెట్టుచు బోవుచుండ, భూ
జాని మహాగృహోత్తర దిశావసధమ్మును జేరె, కీశుడున్

**త్రిపదలు**

249. చతురస్ర నిర్మిత చతుర చత్వరములు
వితత చతుశ్శాల లమరు
నతి వేలమౌ రాచనగరు;

250. అదె సౌధ సముదాయ మదియేమొ యొకవైపు
సదనముల్; ప్రముఖుల వీడు;
లదె యుపవన వాటి తోడు!



251. అవి యమాత్యవరుల భవనాళి; ముఖ్యమౌ
ప్రవణమ్ము లట జలయంత్ర
ధవళ ధరాలంకృతములు

252. ఇది సందడుల కోఠి, ఇది యందముల పేటి
పది పది యతిథుల వాటి
కుదురైన గీముల – మేటి!

253 ఒకదాని ప్రక్కగా నొకటి శశకము లొ
ద్దికగ గూర్చున్న ముచ్చటలు
ప్రకటమాయె భవన పటలి!

254. వెన్న ముద్దలపైని చిన్న వెల్లుల్లిగా
నెన్నదగు శిరోగృహాళి
చెన్నుగా సంవాసపాళి!

255. సప్త సముద్రము లాప్తతాకృతి ప్రభు
దృష్టికై రత్న సకలము
నాప్తిగా సమకూర్చె – గనగ!

256. భేరీ, పటహ, ఢక్క, బూరగ, పణవాన,
కారజ, శంఖ, మృదంగ
భూరి నినాద నాదములు

257. చందనాగరు ధూప గంధ, దీపంబులు
సిందూర రంగవల్లికల
నంద నందిన కక్ష్య పంక్తి!

258. శార్దూల హర్యక్ష వర్ధిత చర్మ వి
తర్ది కాన్విత రథ పటలి,
హార్ది కానుష్ణ భటాళి!

259. గజ పదాతి తురగ వ్రజములు, గండులు
ప్రజవి వీరుల పరామర్శ,
మజిరపు హ్లాదన స్పర్శ

260. కాంచన మాణిక్య సంచయ సింహాస
నాంచిత సౌందర్య మయము,
ప్రాంచదుపగ్రాహ్యా చయము

261. చిత్ర ప్రగృహ్యావిచిత్రాంక శోభిత
ఛత్ర చామర ధారుల - బడి
పత్ర రథముల సంరూఢి

262. వరసుందరీమణీ పరిపాక పూర్ణమౌ
ఉరువైభవమ్ముల సరవి,
వరవర్ణ కల్హార సరసి

264. ఎచట జూచిన భాగ్య మెచటైన విభవమ్ము
లెచట గాంచినను సంపదలు
ప్రచుర సౌభాగ్యమ్మె కదలు!

265. త్రైలోక్య వైభవ జాలమ్ము - ప్రద్యోది
తాలోచనా లోచనముల
గాలించుచు గదలె - హరియు

266. ఎంత సుందరతర, మెంతెంత వైభోగ
మెంతెంత సంపుష్టి, వస్తువు
లెంతటి యౌన్నత్య ప్రభలు!

267. అంద మారోగ్య మానందమ్ము, సంపద
చిందు యౌవన మదమిందు
దందడించె ననగ నిలిచె

268. ఇంత పూర్ణత్వ మందెంతెంత వెలితి; యీ
ప్రాంతమ్ము - శిగ్రువు - స్ఫురణ,
వింతగా స్వాంతమ్ము నింపె

269. ఇంత రాజస ఠీవి, ఇంత రాచరికమ్ము
నింత యౌసు, మగబీరమ్ము
నెంత కర్మఫలమ్ము - చిందు?



270. వాయుసుతు డా పయిని గాంచె - వరుస - దనుజ
ముఖ్యుల గృహములన్నియు; ముందు మంత్రి
వర్యుడు - ప్రహస్తు సౌధ మాపైన శంక,
వజ్ర దంష్ట్ర, మహోదర భవన సమితి!

272. సరస నున్న - విద్యుజ్జిహ్వ, జంబుమాలి,
రశ్మికేతు, సుమాలి, ఇంద్రజితు, సూర్య
కేతు, వజ్రకాయుల మహాగృహములెల్ల
వెదకి, వెదకుచు - నామీద వెడలె కపియు

273. ముందుకు జనుచున్ దీక్షగ
నెందఱి గృహములొ వెదకె గపీశుడు - మాషం
బందున నీలపు రాయిని
బొందం నిశితముగ నెమకు పూనిక వోలెన్

274. విఘన, ఘన, భీమ, ధూమ్రాక్ష, వికట, బ్రహ్మ
కర్ణ, రోమశ, దంష్ట్ర, వక్ర, శఠ - ముఖ్య
సౌధ మండలి గమనించి; చూచి; చూచి
సీత గానమి నిర్వేద చిత్తుడగుచు;

275. కన్నులు చాలవీ భవన కాంతులు చూడగ గాని - సీత యే
దన్న నిరాశ యొక్క యదుగందున మాత్రమె కాక, వెన్ను నా
డిన్నిలువెల్ల సూదులను డించుచు దోదుగ ముందు త్రోయ - రా
మన్న శుభాభిలాష నిజమౌ బలమిచ్చె, గపీశు దంతటన్

276. కదలెన్ ముందుకు జాగరూకుడయి దృగ్జాలమ్ము సర్వమ్ము సౌ
ధ దశాభాగము నూలుకొల్పి, కెడ- సంతాగార సంవేశినుల్,
బది యార్వేలుగ నున్న కక్ష్యలను సర్వాభ్యంతర ప్రాంతమున్,
గుదురుల్ మీదులు జూచి యాగె, దలపుం గోరిందలూవాడగన్

277. ఒక దైవత్వపు భావనాంశమది మైనూరార్చుచున్నట్లుగ,
న్నొక శీత స్పృహ లో యెదం దడవి పల్కాదించుచున్నట్లుగ,
న్నొక యాశీః ప్రభ జాలువారి, దయ, జేయూపై పిసాళించె నా
నొక పుణ్యావహ మైన ముంగిలియు బుణ్యోల్లాసమై పిల్వగన్

278. నిట్టపు జూపుల - గరువలి
పట్టి నిలిచె, స్వచ్ఛత మరి భద్రత లేవో
తెట్టియగా గనుపించెను
చెట్టుల మాకందము వలె, జిన్నెల తోడన్

279. ఏరికో ప్రియమిడ నెంచు పోలిక దోచ
శుచి దేహుడై వచ్చుచున్న విధము
ముందుకు వచ్చుచు మొగము చేటంతగా
జేసి కొనుచునున్న వాసి విధము
కపిబాంధవుని యీ సకాలాగమన మెంచి
వివశత్వ మొరగట్టువెట్టు విధము
నొక లక్ష్య శుద్ధి, యింకొక భక్తి శ్రద్ధయు
దలదాల్చి, తెలికూర్చి తరలు విధము
నడుగు గదలించి వచ్చుచున్నట్లు దోచ,
నొక మనీషి యాకృతి గాంచి యుత్సహించె-
పురుషులందు పుణ్యపురుషు లరుదటంచు
వానిని - విభీషణుగ నెంచె - వానరుండు!

280. మనసా, శిరసా - భక్తి నొ
క నమస్కారము నిడి - కలకను ప్రక్కకు నె
ట్టి నడచె మారుతి; ముందుకు
జనగా తనముందు నిలిచె సౌధావళియున్

281. ఊహల కందనంతటి సముజ్జ్వల, సాంగ, సమాఖ్య, కీర్తి భా
రాహిత మౌ మహాభవన మా దనుజేశ్వరు సౌధమందు - సం
దేహము లందు ముంచు - పలు దేవిడు, లోవరులు, న్నివేశముల్
గేహము లొప్పు, సౌధముల క్షేత్ర సమూహముగా ననం దగున్

282. పొందికగా నొకం దగరువుం, దపనీయము, బుందరీక మం
దదున గొంత కొంత రజతమ్మును, క్షేత్రజ, కుంకుమంబు లా
సందున నేర్పుమై, చలువ చంద్రిక బిందువులన్ దొరల్చి - ని
ష్యంద సుమిశ్రమమ్మును బొసంగగ జేసుక - యాటలాడి, యా
నందపు టాకృతుల్ నెఱపినట్లుగ దోచును సౌధనిర్మితుల్



283. ఒక శుభమస్తు పవనము, మ
ఱొక రమ్య తరంగ మొక్క టొకటిగ గాథా
ప్రకరణము నెదపుటల పొం
తకు నడుప, సరగున గపి పదమ్ము గదల్చెన్

284. శంఖశాలయు, నాయుధ, చాపశాల
సమవిశాల మనోహర చంద్రశాల
జూచె - మారుతి, లోగన్ను చూచె - నొక్క
పాంచ భౌతిక వైభవ పర్యయమ్ము

285. ఉత్తమ గృహములు, వనములు
నుత్తమ నీవృత్తులు, మణి యుత్తమ రథ్యల్,
పుత్తడి బొమ్మలు వనితలు,
నుత్తమ హృషి, యుత్తమ నిధు లుండెను నిజమై

286. వర, సుపర్వ ప్రకర పరివర్జితములు
నసుర గణ విజృంభిత వాజినార్జితములు
పూర్వ దేవ, దేవజన సంపూజితములు
రాజ రాజార్హ బహు వసురాజితములు

287. ఐన సర్వగుణాధిక్యమైన గృహము
లన్ని చూచి, వనచరుండు హర్షమొదవ
రావణాత్మ బలానుయాత్రావృతమ్ము
సర్వ సర్వతోభద్ర మైశ్వర్య మరసి;

288. చేరెం జేరెను ముందుకేగుచు జగజ్జేగీయ మాన ప్రభా
కారమ్మున్, మణి కాంచనాంతర యలంకారాభిసారమ్మునున్,
తారోల్లాస మనోహరత్వ భృత ముక్తాజాలభారమ్ము, సం
భారాన్వీత వరమ్ము, రావణ మహా భాగ్యాకరాసారమున్!

## పుష్పక విమానాభివీక్షణము

289. కనియెన్ మారుతి పుష్పకమ్ము, బహు విఖ్యాతమ్ము, సౌభాగ్య స
ర్వ నిధానమ్మును, మేలు మేలు గని, జాజ్వల్యాగ్ర్య రత్నాకరం
బు, నసామాన్య విచిత్ర సృష్టి ఘనమున్, పూర్ణ ప్రభాకారమున్,
జనితా వేగ ధరాధరాప్రకర సంజ్ఞాశ్లిష్ట వృక్షాంగినిన్

290. ఒకటే పుష్పకముండెనేని విభునుద్యోగంబునన్, వ్యాహృతిన్
బ్రకటార్భాటము హెచ్చు నంచు మది సంభావించి కాబోలు - దా
సకలాధిక్య విశేష భోగమయ సంస్త్యాయమ్ముగా, నీ విమా
న కృతిం దీర్చెను విశ్వకర్మ, మయు విన్నాణంబు సామాన్యమే!

291. పద్మినీ జాతి స్త్రీ రత్న పాణిపద్మ
ములవి యుల్లోచముల దాక మూలమూల
లందు తరుణులే కంబములగుచు నిలువ,
మంటపము లెల్ల యెద - చలి మంటలయ్యె!

292. భూరి పుష్పక భవన సంభారమెల్ల
మేమె యోపజాలుదు మంచు మేటి యంచ
లా విమానమ్మునకు రెక్కలాన్చి యెత్తి
నిలుప, నెందుకో శేషుడు నిబ్బరించె!

293. సృష్టిలో సకల వసువృష్టి తనయంత
దాను పైకొనె నేమొ, సంతమము కలన
పుష్పకమ్మును; దాననే భువి గిరగిర
తిరుగు; శూన్యమయ్యె నకట ధృత్వమెల్ల!

294. భూమి, బహుళము రెండునున్ బొలుపుమారి
తెలుపు నలుపు పులుముకొని కలతబడుట,
ముదముద మునుగుటెల్ల వైముఖ్య మేమొ-
పోయినది పోయె, మిగిలె నాభోగమెల్ల!



295. పుష్పక విమానమే పేరు - పుష్పవర్ణ
నమ్ము ఉద్యానవన వివరమ్ము లేల?
సరస కల్హార కాసార కరదమేల,
బంగరు గనికి బంగారు బనుచనేల?!

296. మణి వికారములైన సంపన్న విహగ
జంతు జాలమ్ము, చిత్ర భుజంగ, తురగ
రూపచిత్ర చయమ్ము సంరూఢ మయ్యె,
శ్వాస నూదుట మాత్రము స్రష్ట మఱచె!

297. విద్యుల్లీలలు, మన్మధాగ్ని భృత తన్వీరూప శిల్పాకృతుల్
పద్యార్థాదృత రీతివైభవ లసత్పాండిత్య రేఖాకృతిన్
విద్యా కల్పిత చాతురీ మహిమతో విస్ఫార సృష్టింబలె
న్ను ద్యోగించెను పుష్పకమ్మున, సమున్ముద్ర ప్రభాసంబుగన్!

298. ఐశ్వర్యైక నివాససీమయును, సంస్త్యాయమ్ము నౌ పుష్పకం
బాశ్వాసాధిగతంబునై వరలు కావ్య గ్రంథముం బోలె, దా
శశ్వత్సిద్ధ విచిత్ర చిత్ర వితతిన్ శబ్దించి శాసించెడిన్
వైశ్వ ప్రాభవ భోగ భాగ్య విభవ త్ప్రావీణ్య భూరిత్వమున్

299. వజ్ర, వైడూర్య, రూప్య, ప్రవాళ, ముక్త
మణి మయంబై, యలంకృత మంజిమమ్ము
నైన, యాలేఖ్యముల మధ్య నమరి యుండె-
మహిత మంగళ, దేవతా మహిమ, మహము!

300. ఒక సారంగము పద్మ గుచ్ఛమును దా నొయ్యారమొప్పంగ బూ
నికమై హస్తము తోడ నెత్తి నిలువన్, నిష్ఠావిధేయస్పృహ
న్నొక మాతంగము నీరభాండమును దానూనెన్ - జగన్మాతకే
యకలంకాభిషవమ్మొనర్ప, కుశలోద్యత్కాన్తి నిండారగన్!

301. కుంజరద్వయ మింతగా కుతుక మొప్ప
తనను సేవింపరాగ, సంతసము నిండ-
పద్మ పాణియు, పద్మాక్షి, పద్మనిలయ
యైన శ్రీలక్ష్మి; గజలక్ష్మి యయ్యె నచట!!

302. ఇదియె గజేంద్రాలేఖ్యము
విదితము; పుష్పక విమాన విభవ ప్రతతిన్
గొదవేమి పసిడి ముద్దలు
కదలును విహగములయి, మరి కంకణములునై!

303. ఎట్టి మనోవికారములు నెట్టి సుఖామృత వాంఛలేక; తా
గుట్టుగ బెట్టి చిత్కళను; క్రుయ్యని పూన్కిని మౌనముద్రయుం
బట్టి, యఖండ తేజమది పర్వగ భూనభముల్, తపంబు జే
బట్టిన మూర్తి - దాన గనుపట్టు - సతీత్వపు ఛాయ రంజిలన్

304. వాతానుకూలమగు సమ
శీతోష్ణ ప్రత్యయము, విశేషాంగియు, వి
ఖ్యాతాద్భుత గమనాగమ
వీతి క్రమ బద్ధము సహవేద్యంబు మఱిన్,

305. ఆకసపు ద్రోవ గమియించి వీక మిగుల,
వాయు వీధిని తాకక వంతు జేసి,
యా మహా విమానము నిల్చి యమరియుండె-
గాలిలో దేలు శ్వేతాభ్రఖండ మట్లు!

**అల్పాక్కరలు**

306. అవును, పుష్పకము మధ్య నిలువంగ
ఉబ్బడిగి - పయిన - నుడుపతి తా
మబ్బు చాటుకు పోయి మఱుగుపడియె
మబ్బు పూవుల వెల్లి మాగువాఱె!

307. కొమరొప్ప గూర్చున్న గొబ్బెమ్మలై
యమరె నెన్మిది దెసలందు బుర్జు
లమితమౌ చిన్నెల కంతులేదు,
తమి దాని గన మహద్దర్శనమ్ము!



308. సారథి యనుకూల చారిణమ్ము
నీరజ సంస్థాన నిర్మితమ్ము
భూరి విశేషాస్థ పుష్పకమది
యారాధితము, ప్రతిష్ఠార్జితమ్ము!

309. శత శతాలంకార సఖ్యత చే
త తనియనిది, గుణితాలంకృత
ప్రతిమ సమృద్ధి వరలె - హర్ష పుం
ఖితము, పుష్పకము - దృక్ క్షేపణమ్ము!

310. ఋతువులారింటికి వృద్ధి గూర్చి
వ్రతమతికి మనోభిరామ మగుచు
కతల పుట్టిలు నయ్యె - గలిమి ప్రోవు;
జిత మనోజ్ఞమ్ము; విజిత శుభమ్ము!

311. చారు శోభల శోభన చాంద్రియందు
గంధ, నిర్వారి, శోభనగంధ, పరిమ
ళమ్ము లెగయు - మనోహర లక్షణమ్ము
ప్రసరణము జేయుచుండె - బుష్పకము, కరము!

312. కందరాన్వితాచల సదృక్షమగు - పుష్ప
కమ్ము - విస్మయముగదుర - నెమ్మి దిరిగి
తృటిని ప్రస్తుతమ్మున కరుదెంచె - హనుమ;
సీత యేదన్న ప్రశ్న విచ్చేసె మరల!

313. ఉల్లము నందు మించు భయమూదిన వెంటనె గాలిపట్టికిన్
బెల్లుగ బ్రశ్నలున్ సొలసి పేర్కొనె, నీరసభావ మప్పుడే
యుల్లసనంబు గొల్లగొన నుత్సవ మంగళ దృశ్యమెల్ల భే
దిల్లె, దినంబులో గనిన తీయని స్వప్నము వోలె గ్రక్కునన్

314. మనము పూచిన యోచన ననలు తునిమి
బుద్ధి కందించి, ముందుకు బోవ గదలె,
నెదుట నున్నవి - యెదల, పయ్యెదల రొదలు
వదలు - చెదరు, లా మీద పెంపొదవు నిధియు!

## అంతఃపుర సుందరుల ఆలోకనము

315. అంతట, పావమాని భవనాంతరమందున రత్న నిర్మితా
భ్యంతర మందిరమ్ము, శయనాసన కల్పిత దీప్తమానమున్,
'కొంత' పదమ్ము శూన్యమని, 'కో' యని చాటుచు, వైభవోన్నతం
బంతయు దానె యన్న రచనాధిక కల్పన జూపు ధామమున్

316. చొచ్చి, తలపు నిదానించుచుండ, యడుగు
త్వరిత పఱచ, నెల్ల కడల బఱపె జూపు;
నారు నూరైన సీత దా నరయ వలయు
నన్న కరకిరి – పిడికిటి నద్దు చుండ;

317. వస్తువుల ముందువెనుక, కంబముల బ్రక్క,
సారె సారెకు హరి ప్రతీక్షణము జేయు,
ఱెప్ప వేయక శిల్ప పరీక్ష జేయు,
తత్తఱంబున నదియె సీతయను భ్రాంతి!

318. ఆ భవనాంతర రాజిత
శోభా ప్రచురత్వ రాజి జూచె హనుమ – వే
రౌ – భాస్వత్ప్రభల వరలు
వైభవ చిహ్నము – మఱొక్క భవనమునందున్

319. రావణు నంతఃపురమది,
సేవిత వనితా సహస్ర సేమంతికయై
భావాభావ ప్రకటిత
ప్రావృణ్ణీరధర పంక్తి భంగిని నిలిచెన్

**హరిగతి**

320. మరకత మాణిక్య సమాలంకృత మనోజ్ఞక మానిత భవనమునున్
సురగణ వరసంపాదిత గేహ విశ్రుతిజిత చారురవణ నిధువనమున్

321. కాంచన నిర్మిత మణిమయ పర్యంకము, జక్కని పొంకమునున్
చంచత్ ప్రాభవ బృందిష్ట పద విశదితము, నభిగమ వరదాంకమునున్



322. కృమిజాగరుధూపిత భాస్వంతము, కేలిక శుభ తేజస్వంతమునున్
ప్రమదామణి గణ సేవిత విశ్రావ సమాకృతినిన్, శుభవంతమునున్

323. పరమాస్తరణా స్తీర్ణ మపదిశ ప్రస్తుత మేషాజిన వయనమ్మున్
వరమాల్యవిరాజితమున్, హారోజ్జ్వల ప్రద్యోతిత శయనమ్మున్

**మదరేఖ**

324. చూచెం జూచెను కీశుం
డా చేర్వన్ గల భూరి
ప్రాచుర్య ప్రసరాకా
రాచార్యున్, సువిచార్యున్

325. వానిని గని భీతుండై,
మేనదరగ – సంభ్రమమున – మేరకు బర్వెన్
మానిత కపివరు డటుపై
వానిని గన, వేరు వేది పయి, నిలబడియెన్

326. పద పదార్థ పరీక్ష సంభావ్యమైన
శయ్య జూచె హనుమ, కనె శయ్యపైని
భీకరాకారు, సమవర్తి వీకవాని;
సద్దు సేయక దా వినె – సద్దులెల్ల!

327. అతడే – ఆ తల్పముపై
నతడే జీమూత సముడు, నతడే యతి లో
హిత వర్ణాక్షుడు, వర్ణ ర
జత వసనుండును, ప్రదీప్త సంపద్వరుడున్!

328. సంజె నెత్తురు మెఱపుల సముదయమ్ము
గూడి గుత్తమై కులుకు మొగులు – బలువిడి
చిన్నె నెరవిడి వడి విరజిమ్ముచాడు,
కామరూపి, సురూప విక్రాంతి వాడు!

329. భుజగ పూత్కార సన్నిభ భూరి నిశ్వ
సన శిఖౌఘమ్ము నెగజిమ్ము చల్లజంపు
వాడు – నిద్రించుచుండె; తల్పమ్ము పైన,
ఒక్క గంధగజము వోలె యుండెవాడు!

330. కూడి దున్నపోతుల గుమి కొండవోలె,
గొరమ నేరేడు కాయల గుట్ర వితము,
పొంత కుంకుడు గింజల ప్రోవు మాడ్కి,
నమవసనిసి బిరుసు నుండె నాశరుండు!

331. చందనాగరు లిప్త తేజస్వివాడు–
ప్రణుత వింశతి బాహు విస్ఫారు డతడు,
ప్రథిత విశ్వవసు బ్రహ్మ పౌత్రు డతడు,
సుక్రతు వినీత కైకసిసూను డతడు!

332. కాంచె – మారుతి – రాక్షసాగ్రవరు దేహ
కాంతులు చెదరి, దరి – దీప కాంతి దరిసి,
తిరిగి వక్రీభవించుచు దిత్యనాథు
భూషణాభల కింతవైభోగ మిచ్చె!

333. అట్టి దశకంఠు బుజముల నంటి యంటి,
వాని యూరువు దలగడపగిది నెఱిగి,
సుప్త చేతనావస్థలో దృప్తు లైన
స్త్రీల నరసి, క్రియగొనె కీశేశుడపుడు!

334. తన శోధనమున బావని
మునుముందుకు సాగుచుండ మురువుల ప్రోవుల్
గనె, ముప్పిరియౌ నబ్రము
మునుకొని వెనువెంట నడచి మురమురలాడన్



**ద్విపదలు**

335. మల్లెలున్, బంతి, చేమంతులున్, మొల్ల
లల్ల మాలల కొల్లలై యుల్లసిల్లి!
పేరురమ్ముల పైన పిల్ల తెమ్మెరలు
జేరి సయ్యాట హెచ్చించి మేల్ సలుప,
పూల మాలలు తెగి పుట్ట చెండులుగ
పాలపూసలు వీడి పలపల కాగ,
కప్పురపు రజము, కస్తూరి జలము
కొప్పులన్ రెప్పలన్ కుంచియల్ వైచి,
లలన లాశలకు, కలలకును సగము
కలిమిగ పూతల గల్పించి కొలువ,
మణిమయంబైనట్టి మండనంబులవి
ప్రణయ కేళిని చెదరంగ గాబోలు,
స్థానముల్ దప్పి, నిశ్చలతను వీడి
చానల మేనుల చనవుగా నిల్వ,
మేలి వసనములు మేరలు మీఱ
కేలు కేలు గలసి కేళిక సలుప,

336. ఒకరి మోచేయిపై యొకరి కరముగ
నొకరి ముంజేయియే యొకరి తలగడ,
ఒక సిగజుట్టయే యొకరి కసేయ
మొకరి వీపది యయ్యె నొకరి గభోళి,
ఒకతె చెలి యొడిని; ఒక తన్వి వక్ష
మొకతె తల్గడగాగ, నొకతె పిరుదుల
నొకభామ తలపెట్ట; నొక కాంత పాద
మొక రామ తలయంపి కుత్సహించంగ,
ఒకరికి తెలియని యుపలంభమందు

నొకరుగా హాయియై యురలబడంగ,
స్పర్శకు సంతృప్తి పరవశత్వ మిడ
స్పర్శమే కౌగిలి సన్మానమొసగ,
సురదను తనుకాంతి శుభ్రత లొదవి
సురభిగంధమ్ముల చొరవ హెచ్చంగ,
ఏ యవయవము లవెవరివో, మఱియు
నే యలంకారమ్మ దెవరిదోయయ్యె,
కాని విధమున సంగ్రాహముల్ గలిపి
మేనుల కలగల్పు మిడుకి గర్వించె,
బంగారు దీపాల బహువన్నె లెల్ల
రంగరించుక నిక్కు రమణుల జూచె,
తేటి దారము కూర్పుదీర్చియుం గూర్చి
నట్టి పూదండయే యన బోల్కి చెల్లు!

337. పటములే పుటములై పరిగొను వేళ
కటినేమొ మఱచి వకవకల బడిరి,
కొమ్మలందరు చెట్టు కొమ్మలవోలె
బొమ్మల కొల్వులో బొమ్మలై రచట,
వీడు పాటుగ దోచె, విక్షిప్తమయ్యె
మూడారు గోలీలు మున్మిడినట్లు,
రాయంచ గుంపు లారామ బృందమ్ము
చేయలతిని నిలిచిన మేలురాసి,
యననౌను, కాకున్న యగు – మడిచుట్టు
గనిమలో పడిలేచు గడ్డిపూలనగ!

338. క్షీరాబ్ధి మథన విక్షిప్త సుధాఫేన
ఛాదిత రసకణ చయమువోలె
వికసిత శింశుపావృక్ష దరహసిత
సుమగుళుచ్ఛముల ప్రాచుర్యమువలె



పదగుంఫన మ్మనువర్తనమ్మును దప్ప
కుదురు వడని యచ్చుకూర్పు లట్లు
నడిరేయి నగమము విడి రాలి విగతమై
గాలికి చెదరిన పూలవోలె
నెల్ల లమరని పొలిమేర కల్లులట్లు,
పడి మొలచు పిచ్చి మొక్కల దడియవోలె,
తెగిన వాద్య విశేషంపు తీగెలట్లు
పెరటిలో లేచు పుట్టగోగు రకమట్లు;

339. రాలిన శాతపత్రక శల్కరాజిగ,
రెమ్ముగా నిల్చు నైరేండ్లవోలె,
సగము విరిసినట్టి శంపాలతల వోలె,
వీడిన పగడాల పేరుపగిది,
నెలదేటులును పిల్చు నెలదోట పూవులో
రేకులో, రేకలో, రేవలా – యన,
రాత్రిరాలిన యట్టి రాజఫలములట్లు,
తొలి సంధ్యలో రాలు తుంగములన,
నారబోసిన పింజల బారులట్లు
రంగుల వలలోని పలు విహంగములన,
చెఱుకుగడ లటు నిటు విరజిమ్మి నట్లు,
తరుణులే బహు రూపులై విరిసి రచట!

340. సకల మచ్చట వ్యస్తమౌ సరణి, భామి
నీ మణుల, చెదరిన మణి నికరమెల్ల,
నంతిపురమున, పానశాలాంతరంబు
నందు, శయన మందిరముల యందు – జూచి,

341. చూచి, చూచుచుండి, తిరిగి చూచి, మఱియు
నిచ్చటచ్చట బడియున్న మచ్చెకంటి
గమిని, నత్తమిలిన మత్త కాశినులను
జూచి, యొక యెగ్గతమునందు చూచె – నామె!

342. ఆమె నిదురించుచున్నది, ఐనగాని–
మోముపై ప్రసన్నతయు, సమ్మోద ధృతియు
నేత్ర పద్మమ్ములోనుండి నిగిడి పొంగు
ధీర గాంభీర్య తత్త్వ సందేశ వితతి–

343. కపి వృషాకపి మారుతి గట్టివై చె–
నెదియొ పావన భావన మెడద దవిలి
కేలు దోయి డగ్గరిచె, సంకేతమేదొ
'సీత' పదముతో స్పర్శన శీతమిచ్చె!

344. రూప లావణ్య శేవధి; లోకనార్థి,
చూపు నిలబెట్టు తారుణ్య శోభనాంగి,
చారురూపిణి – గాంచి, యీ చంద్ర వదన
యే జనకజ యనుకొని, సౌహిత్య మెసగ,

345. వాలము చుంబించె, భుజా
స్ఫాలన మొనరించె, నాడె, పాడెను, తిరిగెన్,
నేలంబడె, కంబముపై
వాలె, నెగిరి గంతువేసె – వానర చేష్టన్!

346. ఊహల సీతా దర్శన
దోహల మెద బొంగజేసె, ద్యోతిత లలనా
మోహన వదనాభ గనుచు–
'నోహో హోయరె' యనుకొని, యుత్కలుడంతన్,

347. క్షణమొక యర్ధభాగమున సంతసమంతయు జారిపోవ, తత్
క్షణమొక శుభ్రయోచనము చల్లగ సోకగ, కార్యకల్పనా
చణుడగు నాంజనేయుడట – సంశయమందున జిక్కె – నీమె – స
ద్గుణిమణి సీతయౌనె, జనకుం బ్రియపుత్రిక – మేన – మేలి భూ
షణములు దాల్చునే, యసురు సఖ్యము, నెయ్యము సమ్మతించునే,
ప్రణహిత లోభమోహయయి పానము సేయునె, యారగించి, తో
షణమున నిద్రపోవునె – విచార వివేకము కోలుపోయి, స్వ
ర్మణికుల చంద్రు, బ్రాణసఖు, మానిత రాఘవు మోసగించునే!



348. అనుకొని మనసు న్నిలకడ
నునుచు కొనుచు దన తొరతొర యుజ్జల సరణిన్
హనుమార్యుడు పదరుకొనుచు
తన భావనమున్ మరల్చె దాశరథి దెసన్!

349. భావన రామనామమయ భావ విరాజితమైన వెంటనే
యా వరమంగళాసతి ధరాత్మజ రూపము దృష్టమయ్యె – "నా
యా వివరంబులెల్ల నిజమైనవి కావు, మదీయ మాత సీ
తా వరజాత యీ విధిని ధర్మము దప్పదు, తప్ప దోజమున్,

350. "అగునీ యిందునిభాస్య వేఱు సతి – భాగ్యాలంకృతుల్ జూడగా
నగునేమో దశకంధరున్ గృహిణి – యంచాలోచనల్ రేగు – ద
ప్పుగ భావించితి దల్లి – నేరమిది – సైపున్ గాదె రామప్రభుం
డగవున్ బూనిన యారివేరమున నిట్లయ్యెంగదా బుద్ధియున్

351. అని చింతించుచు, దాను చూచిన దశాస్యార్ధాంగి మండోదరిన్
వనితా రత్నము జూచి, చూచుచు, దదౌజ్జ్వల్యోన్నతిన్ మెచ్చి – వం
దన సంశబ్దన మిచ్చి తా గదలె, శుద్ధాంతస్థలిన్ వీడె – త
క్కిన శాలల్ గన, సీత జాడ గన, నక్షీణ ప్రయత్నంబునన్

352. సారెకు సారెకున్ వివిధ శాలల జూచును, చూచిచూచి యే
వారను సీత గానమిని వంతకు లోగును, నంతలోననే
వేరొక దారిబట్టును, సవేశములోని నివేశ పంక్తి, కం
జారము లెల్లెడల్ వెదికి, జానికి గానమి జిన్న పోవుచున్

353. ఆవల నీవలన్ తిరిగి యారసె మారుతి బాకశాలలో
బ్రోవులు ప్రోవులై సకల భోగ్య విశేషము, లెల్లవస్తువుల్
ఈవల నావలన్ దెరల; నిందుముఖీగణ మెల్ల గాఢ ని
ద్రావశలై ప్రసుప్త ఖరదండలతా తతి వోలె నుండగన్

354. ఇన్ని శాలలు కడిగి గాలించి వైచి
చూపు దీపాల తోడున సుద్దిచేసి
నిలిచిననుకూడ జానకిని కనరాని
స్థితిని – దలచి తలంచి – వేచె, గపివరుడు

355. ధర్మసందేహ మొకటి విత్తయిన పిదప,
మొక్కగా లేచి, మానుగా ముందు నిలిచె–
హనుమ మదినూపె, నంత నయవిదు నెంతొ
భయహృదయు జేసె, దృటిని దీవసము సాగె

356. దృష్టి కాంతల విషయ వర్తినియె? కాదు,
కాని, యంతఃపురములోన, కడకు పాన
శాల లందును, మఱి పాకశాలలందు
నకట కట! యసంఖ్యాకము నరసినాను.

357. ఇందువదనల, నీరజాతేక్షణలను,
కొమ్మలను, కృశమధ్యల, కోమలులను,
నాచి, నాతుక, నెలతుక, కూచి, గుముల,
నగ్నల, మణి లగ్నల, నర్ధనగ్న జనుల

358. నకట! యెంత ధర్మహాని కల్గించితి
దోష వర్తనమ్ము దూగినానె
ఎంతనేర, మిద్ది యెంత పాపము కటా,
ఒక్క పనికి విధికి జిక్కినాను

359. ఒక క్షణమనంతరము దా
సకలుడు, నిశ్చితమతి, దృఢ సంగత పరిపో
షకుడా మారుతి యా తల
పుకు వెంటనె చుక్కవెట్టె – పునరన్వీక్షన్

360. ఇందఱు వనితల – నెంతయు
సందడులను, భంగిమముల, శయితల, నెల్లన్
వందలు వేలుగ నిర్ల
జ్జం దగని వితము దొరలెడు శ్రమణల గనినన్



361. నా యన్వేషణమది – సీ
తాయోష కొఱకు – మఱి యిది – తప్పెటులగు – ధా
త్రేయీసుత – మహిళామణి
యే యౌటను మహిళలందె యింతగ జూడన్!

362. తప్పిపోయిన స్త్రీని వాతాయు నికర
మందు వెదుకగాలేము – స్త్రీ లందె వెదుక
వలయు – నిది ధర్మహానియె – వలదు చింత
నేను కర్తవ్య నిష్ఠపై నిలిచి యుంటి

363. అందురు శుభాశుభావస్థలందు – మనసె
ఇంద్రియ ప్రవర్తనమునకు హేతు వనుచు,
కాని, యెట్టి చాంచల్య వికార సరణి
లేక, నా మది స్థిరముగా నిలిచె నిజమ

364. అనుకొని కర్తవ్య స్పృహ
హనుమ – కదలె, ముందుకు జనె – నన్వేషణమం
దున; వెదకె – లతాగృహములు,
ఘన చిత్రగృహమ్ములు, నుపకారిక పంక్తుల్

**ద్విపద**

365. అన్ని యాకృతులలో నస్పష్ట భావ
సన్నాహమొప్ప విశ్వంభరా తనయ
ఆకృతి భ్రాంతితో నాంజనేయుండు
తా కయిమోడ్చుచున్, కనుల కద్దుకొనె;
అంతలోననె వాస్తవానుభవమున
జింతించు, నటనట – సీత లేదనుచు
చన్నీళ్ళు మొగముపై చల్లినట్లుగను
నున్న చోటేదియో యుదటునన్ దెలిసె;
మనసు పరిపరి గమనికల నడచె
వనిత సీతను గూర్చి పదములే కదలె;

ఎదమీది బొమ్మలై యేపారి నిల్చె
పది పదారుగ, నసంభవములు కూడి
ఆ యెద డక్కపై నభిహతి కాగ
రేయు భయమ్ము పరీక్షల బెట్టె;

366. సీత లేదని జెప్ప శ్రీరాము నునికి
మాత లేదన్న లక్ష్మణుని సంగతియు
పెనముపై పడి మాడు విత్తనం బగును
వినలేని కనలేని పిమ్మటే మిగులు
వారికేమయిన నుత్పాతమై పోదె?
ప్రేరేచు గాదె సుగ్రీవాదుల నట,
కననేమి మిగులును? కట కటా! అపుడు
ఘన మయోధ్య ప్రథిత గతమౌనుకాదె?

367. ఇన్ని ఘోరము లవి యేల? ఇచ్చటనె
నన్ను నేనుగ దండనము జేసికొన్న
నన్ని సమస్య లయ్యవి పరిష్కార
మెన్నుకొను ననుచు యెదలోన తలచి;

368. తెలిసి తెలియనట్లు తెలివి యొక్కింత
వెలిసి వెలియని సంప్రీతి యొక్కింత
నిలిచి నిలువనీయని మనికి యనగ
కలతపడెహరి, తికమకయు గొనెను.

369. కూడి కూడని యూహలొక్కుమ్మడి మది
వేడిగాలిని రేప, వేగమ్ము సడలె
నరమోద్పు కనులతో హాయి నింపుకొనె
వరరామ నామము పలికి పలికెను
ధరణిజ దలచి సత్ఫలమును గోరె,
హరిలోకవరుడు మహాహుండగుట!



370. అనుభూతి స్పర్శనమెదొ
తన దేహమ్ము దడవంగ, తత్రత్యము - బా
వని తెలిసికొనె, దెలిసికొనె
తన కర్తవ్యమ్ము గూడ తటుకున; నటుపై-

**వనమంజరులు**

371. మరలగలే నిటనుండి ధరాజను - మాత జూడక, యిచ్చటే
తెరువున నుండెనొ యేవిధినుండెనొ తేలకుండునె? శ్రేష్ఠవా
నరులు, ప్రభుండును దెల్పిరి, మా రఘునాయకున్ సతి - లంకలో
నరయము పొమ్మని - జూచెద, జూచి మహావిశేషము గూర్చెదన్.

372. నిజమగు తూరుపుగాలియె యౌ - ధరణీ సుతన్ గనుగొన్నచో
నిజమగు వార్తగ నయ్యది యాదరణీయ మౌను జగమ్మునన్,
ప్రజలకు మేలు ఘటిల్లును, రావణు బాపమంతయు బండి, నా
దు - జనువు ధన్యత గాంచును, సేవకు - తూకురాయిగ నిల్చెదన్.

373. ప్రణతి ప్రణతి - శ్రీరామ సలక్ష్మణాయ
శరణు శరణు శ్రీజనకాత్మజా నమోస్తు
నతులు రుద్రేంద్ర యజిన జనాంత - మీకు
ప్రణుతి సూర్య సింధుజ మరుద్గణము లార!

**వనమంజరి**

374. అనిమది భావన జేయుచు పావని యాత్మతత్త్వమునందు నా
జనినిని నిల్పి, తలంపులయందు - ప్రసక్తినింపి, సద్ధైర్యుడై,
పనిగొని ముందుకు గాంచ మహత్తర భాగ్యధామవిలాసమై
వనము - యశోకము - చూపుల కందె నవారిత ప్రభ నొప్పుచున్.

## అశోకవన ప్రవేశము

375. ఈ వనమొక్కటి మిగిలెను
నే వెదుకగ; జూచియున్న నెలవుల నాకా
పావని జాడ యలభ్య
మ్మా వని గాలించెదనని యూహ్పిత ఫణితిన్

376. మతిమంతుండగు నాంజనేయుడటుపై మార్గమ్ము భావించుచున్
గతి నిర్ణేతగ ముందుకేగుతతి, సత్కార్యాప్తికై - యొక్క మా
అతి భక్తిన్, ధృతి, సర్వదేవగణ, భూతాధీశ, భూతాది వ
ర్ణిత మాహాత్మ్యులకెల్ల మ్రొక్కె; నతుడై యద్రిప్రోన్నతాకాంక్షతోన్

377. తొలుత మహేంద్ర శృంగికడ - దోడుగ నిల్చి శుభప్రదమ్మునౌ
ఫలితము పొందగా తగు ప్రభావము గూర్చుడటంచు, మిమ్ము - నే
దలచి నుతించినాడ - నది తక్క, మరేదియు గోర, దేవులా
ర! లలిబ్రహృష్టజేయుడు నిరంతర సౌహృదశాంతి దాతలై!

378. అని యుత్సాహము, నుత్సుకమ్ములను నిండౌరీతి బూరించి - పా
వని దీర్ఘంబుగ లోని యోచనల త్రోవంద్రొక్కి, శాంతంబు న
గ్నినిగా నిల్పినెడంద, వందన శతానేకంబులర్పించె, పా
వన భావంబున దేవులెల్లరకు సద్వ్యాహార పారీణతన్.

379. తమ్ముడు నీకెలంకు సతతంబు ముదంబున నిల్వ, ప్రేమభా
వమ్మున గంపక్రింది కృకవాకువు జాగ్రతజేయు రీతి నా
తమ్మున కీవు మేలగు సదమ్మును గూర్తువు, రామ! నాకు నీ
సమ్మత మందొకే యొకటి శాతము నిమ్ము, నమస్సు నిచ్చెదన్

380. పావన రామ నామమును స్వాంతము నందిడి సాగుచుంటి - నో
పావని! నీ సతీత్వశుభభావన రక్షణమమ్మ నాకు, నా
'పావని' నామధేయమది పావడమౌ గతి, బ్రశ్రయానుకం
పావని జేరనిమ్ము ప్రణిపత్తిని గూర్చెద నో ధరాసుతా!

381. నిభృత భక్తి నర్పింతు ననేక వంద
నమ్ములు శతశతమ్ము - పినాకపాణి,
పాకశాసన, యమ, గంధవాహ, చంద్ర,
దినమణి మరుద్గణాశ్వినీ దేవులార!

382. అనుచు నమస్కారమ్ముల
ననెను హనుమ - దేవగణ మహాశక్తులకుం;
దన నుతులిచ్చెను - సుగ్రీ
వునికిన్, మరి జాంబవంతు వృత్పన్నతకున్.



383. త్వరితంబగు నడుగులతో
మఱి యూరట నింపుకున్న మదితో, వాతా
వరణపు పిలుపుల నందుచు
హరి ముందుకు కదలె; నెదుట నరసెను బ్రహరిన్

384. ప్రాకారంబది చిత్ర రత్న ఖచితంబై పుష్యరాగాంచిత
శ్రీకారంబుల వన్నెచిన్నెల జగజ్జేగీయ మానంబుగా
నాకల్పద్యుతి పుంజముల్ దెసల డాయంజేసి మేటిల్లె, న
స్తోక ప్రాభవమా యశోక వనముం దోడ్తోడ రక్షించుచున్.

385. తెలిసీ తెలియని తనుపున,
పొలుపున - సాలమ్ము దాటి, పులుగరి వోలెన్
మలయిక మొదలిడె - మారుతి
కలకలముల గలగలుపుల - గలతెఅగెఱుగన్.

386. బంగరు కాంతులీను తరుపంక్తులు, విచ్చిన పూలవెల్లు, సం
సంగత కూజితమ్ములు, వశంవద సూక్తుల కమ్మ తెమ్మెరల్,
మంగళ ఝుంకృతుల్, ననల మంత్రము తెచ్చెడు సౌరభమ్ము, సా
ష్టాంగ నమశ్శతంబు లిడు శాఖల తూగులు స్వాగతించగన్

387. మోపిన పాదమయ్యది ప్రమోదపు కంపము బంచ, వేడ్కమై
కోపుల నందజేసె తరుకోటి - సదాగతి సూను కింపుగన్,
వేపిత పత్ర వాగ్దలపు వీచిని; సేసలపూలుజల్లె; సే
వా పరతన్ సమాగమపు భావ మనోజ్ఞత నించి పంచుచున్

388. తమ సర్వస్వము గోలుపోయి నటులా ధాత్రీరుహమ్ముల్ కపిన్
దమ సామ్రాజ్యము లోని కింక యవినిర్ధార్య ప్రభన్ రమ్ము, ర
మ్ము - మహామాత్ర! యటంచు బిల్వ - హరిసామూహ్య ప్రగాఢ ప్రచా
రము సౌహార్దము బంచ, లోని కరిగెన్ భ్రాజిష్ణువై, జిష్ణువై

389. స్ఫటిక సోపాన సంయుక్త వాపికాళి,
వాటి నిండుగ కలువలు పద్మవితతి,
నూతిగట్టుల కావల నూలుకొనిన
రజత కాంచన వేదికా రాజి జూచె

390. రంగురంగుల పక్షులు, రకరకముల
జంతు జాలమ్ము – హనుమ విష్కంభ వేగ
గమన సరణికి వేవేగ కదలి పరుగు
వెట్ట నిశ్చేష్టతన్ జిక్కె జుట్టుబులుగు!

391. అది మయూరమో, యొక మయూరాసనమ్మో
తెలియగాలేని రచనమ్ము చెలగ, వాయు
సుతుని చేష్టదక్కగ, నొక్కచూపు మిగిలె;
నంత పురివిప్పె నెమలి స్మయమ్ము జార!

392. కనుల పండువు గాగ కాంచన మణిదీప్తి
గిరి శిఖరమ్ములు కెరలి నిలువ,
కమనీయ వృక్ష శృంగార విన్యాసముల్
నగశోభ హెచ్చించి నభము నిలుప,
సెలయేటి గలగల సేమంపు చీరింపు
తరువుల తలయూపు సరళి గలయ,
రమణీయ మాణిక్య రత్న ఖచితమైన
సుందరదరులు విస్ఫురణ మెలయ,
ఒక సువార్త నందించగా నుదుల కొనెడు
యువతి వలె యేటి యెదమీది కొరిగె కొమ్మ,
కొమ్మ యొయ్యారముల నెల్ల కుతుకమెసగ
దా గ్రహించె నిర్ఝరము – తాత్పర్య గరిమ!

393. నీరంబుల స్పర్శను కడు
గారాముల స్పర్శనమున గాఢ ప్రణతిన్
వేరీతుల గొంత తడవు
కేరింపుల తోడ గడపి కీశుడు లేచెన్

394. ఆ ప్రభాదివ్యకాయు డమిత శక్తి
రెక్క లెడలిన విహగమై యొక్కెడ, నెడ
గడ్డ కరిగి, యెగిరి యశోకమును జేరె
నరుసపు మునుక మిగిలించు మురిపె మెగయ!



395. చెట్టుపై నుండి కలయ జూచె కపివరుడు –
క్షితిని పసుపు కుంకుమల పూజించి, మించు
వన్నెలను పోత పాత్రల పంచిపంచి
ప్రకృతి నించె నెవడో, పెనుపరి యనుకొనె!

396. జనితోత్సాహ భరిత చే
తనము కపివరు తన జనకు దరగల దేల్చన్,
నినుపారు బెడగు నినుపుల
దనరెడు వనము వనమెల్ల తమితీఱ గనెన్

397. ఎంత యపూర్వ విలోకన,
మెంతటి యాహ్లాదసౌఖ్య, మెంతటి తూలిం,
పంతటి కంతగ తనకున్
సంతస మందిన దని, వనచరు డనుకొనగన్

398. శోచీరాశులు తరుశా
ఖా చంక్రమణం బొనర్చి – గాదిలికొడుకున్
గాచుకొని నిలిచె; కపికిం
దోచెను తలపుల నడుమ నతులిత వివక్షల్

399. అదియె వరజీవనాశయ మిదియె వనము
ననపు నెరపు వాతావరణమ్ము – మఱియు
నామె కేళీవనప్రియ, యలరుబోణి
యుండనోపు నిచటె, సీత – యుదిల గొనుచు!

400. అని భావించుచు, యుక్తి యుక్త మిదియే యౌనన్న తియ్యంపు యూ
హనె దన్నింపుక శింశుపాతరువె సీతాస్కారమున్ గూర్చునం
చనువౌ పట్టున గూరుచుండె కపి – మర్యాదాధ్వనీనుండుగన్,
ఘన కార్యార్థులు లక్ష్యశుద్ధి మఱువంగా లేరు లోకంబునన్

401. గిరుల, తరుల, నదుల, నదిదరుల నరసి
వెఱగున మురిసి, పరుగుల మెఱసి, యెదద
నరుసము విరియ, సుకుమార సరణి వాల
మమర – గూర్చుండె, కపియొక ప్రాదిని దరిని

402. తేటగీతుల దేలించు తేటిదండు
లాశ లూది హృదిని నింప, నాత్మ బంధు
సంతతి వలె విహగము లుత్సవము సేయ
వంగి నీరంద బోయి పావని యులుకనె!

403. మానసగతి మార్గమహిమ – మంతిరించె
నిలిపెనన్నట్లు – శ్రీరాము నెఱపు – నీట
దోచె, కరముల ముకుళింపుతో, మఱి, యర
మోడ్పుకనుల హరినుతించె, మోదమందె!

404. క్షణము – ప్రస్తుతము గమనించ హనుమాను
కచట నీరు నీరుగ దోచె, నటు నిటు తల
ద్రిప్పి జూచిన శ్రీరాము తెఱవు తొలగ
పరమ సుందర దరహాస పర్వ మమరె

405. నెమ్మదిగ మఱియొక మారు నీట జూచె,
హనుమ; దోసిలి నిండ బోనంతలోన,
వెఱపు సూపుచు నొకమాత దరిసెనమ్ము
నలలపై గనె, తత్తర మలది కొనగ

406. చిత్తము దవులు కొని మెలగు
వృత్తాంతము కావున – నిది విస్ఫూర్జితమై
హత్తెను ప్రతిబింబములన్
దత్తరమేల యనుకొనుచు దలచెను కపియున్

407. భావము రామనామమయ భావన యయ్యె – హరీశు కత్తఱిన్
భావన ధారుణీతనయ భావమునందు నిమగ్నమయ్యె, సం
భావిత లక్ష్యలక్షణము – వాతెఱ బాయక పొత్తు గూర్చి, తన్
గావగ – దోసిటన్ జలము గైకొని యాబగ ద్రాగె నంతటన్

408. అదియే సీతారాముల
మృదునామామృత మధురిమ మిశ్రమ మనగా
నుదకపు తీపిని గొనె హరి –
మృదుభావోద్భూతి మదిని మిలమిల లాడన్



409. మేటి కుతూహలమున – నా
మేటరి – ముత్యాలకాంతి మెఱసెడు క్రీడా
వాటిక జేరెను – సుకలా
ధాటీ ప్రౌఢిమ గనె, గనె – ధామపు పంక్తిన్

410. ఒకచోట చక్కని మొకముల యెలదోట,
మణిగణ నిర్మిత మంటపములు,
నొక ప్రక్క రంభా, క్రముక, రసాల వనము,
నేలా లవంగ తాంబూల లతలు,
నొకవైపు సురపొన్న, వకుళోపవనమును,
జంభీర జంబువుల్ శాల్మవితతి,
యొకపట్టు త్రిశిఖ, కింశుక, మహాద్రుమవాటి
రక్తామ్ర, శుభద, కర్కంధు గణము
ప్రకృతి సరస వికాస సరసత – సకల
శోభనావహమయి – వనసురభి గొసర,
గాలి కదలికలకు చిరుగంట పాట
చెలగు, నా యశోక వనము జేరె హనుమ

411. ఈ వనవాటీ సుభవం
బే వరదు మహాప్రసాద మే మహనీయం
డావిష్కరించినట్టి క
ళావేది – యనుకొని నిల్చె లావరి; యటుపై;

412. పొవడలు, హేమపుష్ప, దళపుష్ప, శివద్రుమ కేశరమ్ములున్
కవటుల చిత్రభంగిమల గాంచిన పావని – యంతలోనె, వై
భవమున కాటపట్టయిన పద్మ సరోవర మొందుజూచి, భ
వ్యవసుమతీ తనూజ వనవాటిక శోభలెఱుంగుగాన, జే
రువ గన వచ్చునంచు నట రూపగు శింశుప నెక్కె; నాపయిన్;

413. కలయ జూచెను మారుతి నలుదెసలను
సుందరతర శోభలతో యశోకవనము
నిండుగా నుండి యేదియో నిండుకొనగ
భాస్కరోదయమును వేచు పద్మమయ్యె!

414. ఒకచో లేలేత చివురు
లొకట ముకురములు కలయ, మఱొక చోట నెఱిన్
వికసిత ముఖ సుమ సంభృత
సకలత్వము గప్పుకొనెను - శాఖ - సురుచియై!

415. శ్వసనకుమారు దృక్కు పరిసర్పము నాపెను, వెంటవెంటనే
పసితనమేచి భూఘనము పైబడి - హ్లాద రసోపదానమున్
విసరిన యట్లుకాగ, నొక స్వేచ్ఛకు, గూర్పుకు సొంపు నింపుచున్
వెసనొక దూకు దూకెను సవేశము నందలి యాటగుట్టపై

416. వనము వనమంత వెలుగు సంబరపు పట్టు
చీరె దాల్చి పేరంట్రము జేర సిద్ధ
మైన దనినట్లు సుస్పష్టమయ్యె నపుడు,
కొండగోగులెల్ల - మెఱుగుగొండ్లి సలుప!

417. కొమ్మలెల్ల ప్రమానును గ్రమ్మి, కోటికోటి
పూలగుత్తుల సవరించి పొదలు కొనగ,
కింశుకము సుమనస్సుతో గేరుచుండె,
జేరి పావని పావన సేవజేయ!

418. తారహారకాభ్రపథ విస్తారమనిన,
సుందర సుమనోహర పుష్ప సురభి యనిన,
పూలపల్లకి యనినచో పొసగు నిజము;
చైత్రరథ మని యనినచో సత్యమగును!

419. ఒక కేళాకుళి, రాయంచల
సుకలాలాపముల తోడ శోభాకృతియై
సకలాలంకృత మణి వే
దికల కుపస్పర్శమిడి దిదృక్ష నిగిడ్చెన్

420. ఆ కేళాకుళి యెంత సుందరమొ యంతంతైన సౌందర్య శు
భ్రాకారమ్మున వెల్గు - రమ్య జలయంత్రం బొండు కాంచంగ శ్రీ
కాకుత్థాన్వయవార్ధిచంద్రు శుభకాంక్షాసామ్యమై తోచె, నెం
తో - కౌతూహల ముప్పతిల్లె గపికిన్ - తుంతుర్పముల్ రేగగన్



421. సంబరమది యట్టిట్టయి
యంబరమును దాక కీశమటుపై, జల యం
త్రంబు నడుమ తుందున కం
దంబన దూకె- నొక బాలు - దారి - విచేష్టన్

422. శ్రీరామచంద్రు స్నిగ్ధ
స్మేరాననభాసన మది శీకర రూపం
బూరీకరించె ననుకొని
మారుతి మై పులక దడిసె మసలుచు నచటన్

423. జలపక్షి సమూహపు కల
కలముల - తన కవితనమును కలగలుపుచు, దా
నలరుచు - సరసిన్ - బ్రియముగ
కలవడి మాట నలరించె కపివరుడంతన్

424. ఆనందము తొణకు కనుల
బూనిక గుప్పించి యెగసె - పూటము సర్వం
బానగ నిలిచి - కపి - తరు వి
తానము జేరె నదియె - తన - తానకమనగన్

425. ముందు జలాశయము రజతపత్రపు
మిసలు కనుల మిరుమిట్లు కొలుప
ప్రక్కన కృతకాద్రి - పంకిణిపోలికి
నాసిక కానంద నంద మీయ
వెనుక దూరాన గంభీర పాథోరాశి
ఘోష - యంతర్ఘోష గుర్తుసేయ
గంధ సంవాసితాంగణముల పులినముల్
సాదరాహ్వానంపు సత్క్రియలిడ
చూపరుల - చితి, చిత్తు - శుశ్రూష నొఱవ
జేయ, నారామ సుందరి చెల్వులెసగి,
చెంత - మెత్తని పులి యొచు చెంగలించె
నని హనుమ - దృశ్య సాదృశ్యమమర జేసె!

426. సర్వాంతర్యామియె యన
బర్వంబిడుచున్న కపిని, వాని హవణికన్
నిర్వర్ణ విచేష్టల గని
నిర్వేద ప్రశ్న మునిగె – నిఖిలస్పృహయున్

427. చూడంజూడగ చూతమొక్కటి – కపిన్ – శుభ్ర ప్రభల్ పంచు నె
వ్వాడీతండను ప్రశ్నకుత్తరము విశ్వాసించుకోలేక 'స్వా
మీ, డాకన్ వనసీమ వచ్చితిరి, సామీప్యమ్ముగా వచ్చి మా
తోడైనారు యెఱుంగ దెల్పుడిక సత్యోక్తిన్ శుభప్రోక్తమున్'

428. తన వినయమ్మె యాకుల గదల్చగ, బల్కియు బల్కలేని – రీ
తిని, యటులా – మధూలి – కపిదిక్కుకు నూగగ, దానివైపుకే
తనదు విధేయతన్ జరిపి, దంతశరమ్ము – ఫలమ్ము లెల్ల లీ
ల, నయపు గంటలై కదల, లాస్యము జేసెను – జోస్యమా యనన్!

429. చూతము ప్రక్కగా నిలిచి చోద్యపు బాసలు విన్న పొన్న – త
చ్చాతురి కుబ్బిపోయి విరిజల్లియ లెత్తెను; వైనమేమియో
చూతమటన్న ఆత్రమున జుక్రిక సిద్ధము కాగ, బ్రక్క – కా
పోతము – సంకథల్ తెలిసి, పోడిమి పాటల ముచ్చటించగన్

430. మీఱెఱింగిన యంతగ మేము సైత
మెఱుగగాలేమొ? వాస్తవమెల్ల జెప్ప
వలెననిన యీతనికి మాకు వలను కలదు,
కలదు బాంధవ్య శక్తి, రాగలుగు ప్రథిత!

431. అను – రాగమ్ములు గొంతునింపుకొన, భావార్థంబుగా పైకి పం
చెను పల్కుల్ – జత – 'రామ – రామ' యనుచున్
జిల్కల్ – కపీశుండునున్
దన చేతస్తురగ మ్మదల్చెను, మహేంద్రాద్రిం బయిన్నేర్చి యీ
వనమం దీవిధి దోదు గూడెనని సంభావించె గీరమ్ములన్



432. కందర్పస్యందనములు;
విందుల బలుకుల పతాక – వే నిలుపుచు నా
నందము నిడు కాపోతము –
ముందఱ గని – పికములు స్వరములు నిగుడించెన్

433. 'స్వామీ – మీ పొందికలో
యేమో యాందోళనము, మరే యోచనయో–
కోమలత నొక వికలతయున్
సామంబున గఱకుదనము సాగగనేలా?

434. ఎక్కడి వాడవో ఘనకపీ! నవమార్గము బట్టి లంకిణిన్
ద్రొక్కి పురంబుజొచ్చుటొక తోరపు కర్జముకాగ, దానిపై
చక్కని రాజమార్గముల, శాలల, పుష్పక, మందిరమ్ములన్
జుక్కల వన్నెలన్ గని, యశోకము జేరుట యే విశేషమో!

435. కాదు, యే విశేషమొ కాదు కాదు, తమ – సు
ధీ విశేషమె! కాక యీద్వీప విధి వి
శేషమో స్వామి! వహ్ని సశేష కణము
తీరు గాన్పించుచుంటివి – దివ్యకళల!

436. తామేవేవియొ, యేమి యేమియొ సమాదర్శమ్ము, లీరీతిగా
సామంజస్యవిశేష మొప్ప తరువుల్, శాకుంత సంతానముల్
సామాన్యోత్సవ సంగతుల్ పలికి, హర్షామోద సంభారముల్
సీమల్ బర్వుచునుండ, పావన వచశ్శ్రీ సౌఖ్య మాలించుచున్;

437. మైత్రీ పురస్కృతి నిడు – ప
తత్రి హృదయ భాషలెఱిగి, తరువుల యాంత
ర్యత్రిపుటలరసి; యింక ధ
రిత్రీ పుత్రిక తలపు లరిగొను నెడందన్

438. భక్తి దైవాఱ, నుచ్ఛ్వాస శక్తి యందు
యత్న సాఫల్య కౌతూహలాశయమ్ము
నింపి, యెగిరి, యెక్కెను పావని – తరువొకటి
సుమభరిత పత్ర సాంద్ర మశోకమదియె!

439. అన్ని ఋతువులలోన రమ్యతను పంచు
సుమఫల భరిత పాదప శోభ నించు
వనము, భాస్కరోదయ రుచి భాస్వరంబు
వన మశోకంబు దడవె కర్వలి కొడుకట!

## హనుమ సీతా సందర్శనము

440. కలయం జూచె సమీరనందను డశోక ప్రాంతమందెల్లెడన్
కొలనుల్, గుట్టలు, జెట్టులున్, నవనవోద్గూర్ణ ప్రభాసంజ్ఞలై
వెలుగున్ నింపుచు నిల్చి యుండెనట సద్వీక్షాప్తి నందించుచున్
గలరూపమ్మున దృష్టపంక్తి గనె సంకల్పార్థమున్, సత్యమున్

441. అదియే చైత్యప్రాసా
ద దిష్ట ముద్యానవన వదనమున తిలకం
బదియే యనదగు, ననదగు
నదియె శిరోవల్లియని – వనార్జునమునకున్

442. వనము భాగ్య సౌభాగ్య శోభన శుభంబు
లష్టవిధనాయికారీతి నతిశయిల్ల,
బరగు భావ విభావానుభావ రుచులు
ప్రోదిగొని చైత్యమై నిల్చె; పొసగి పోల్చె!

443. వర్ణనలెందు కదియె – యు
త్తీర్ణంబయ్యె సకల ప్రతిఫలనముల, సం
పూర్ణ ప్రాభవ సంజ్ఞన్
గర్ణీరథము బొమలోలగమ్మున ననగన్

444. ఆ చైత్య ప్రాసాదము
వాచకమయ్యెను కలుములు వడపోతలకున్
సాచిత్యమున నొక – వసతి
సూచీముఖమన నివిచె – వసు నిధానముగన్



445. ఆ వసతి మండపము తన కక్షి గోచ
రమ్ము గాగ మారుతి అతి శ్రద్ధ గనె – ని
శితముగ పరికించెను; పరీక్షించి చూచె;
దృష్టి – గుండెనాడికొక సందేశమిచ్చె!

446. ఆ రమణీయ మండపము నందొక భామిని – ఏకవేణి – దీ
క్షారతి మున్గినట్లు మరగాళ్ళ పయిం దలజేర్చి, చిత్కళా
సారమె యొంటి బట్టయన, చారిమ మొప్పగ గూరుచుండె, శా
స్త్రారణి ద్రచ్చ వచ్చు నిగమార్థము చందము నాత్మ పొంగగన్

447. కమనీయస్థలి, నంతకన్న నవరేఖామాధ్యమం బొప్పగా
నమరం జేయుచు నిల్ప బెట్టిన లవిత్రాకార విస్ఫూర్తి – నా
యమ కాన్పించెను – పావమాని కల హృద్యంబైన శిష్టోపదే
శము మధ్యన్ దలయెత్తినట్టి యొక ప్రశ్నావ్యంజనంబో యనన్!

448. చలి వేకువలో చెదరి, పొ
దలు – వరికంకు తలపయి కతవిడుచుటీవిన్
నిలు – మంచు బొట్టనగ సతి
కలతెఱ గొప్పెను – కపీశు కన్నుల కంతన్

449. దీనయు, నుపవాసకృశాంగియైన అబల;
దీర్ఘనిశ్వసనములె – వ్యథిత మనమున
కింత చిఱుతిండినందించి ఈ విధమ్ము
నిలిపె నేమొ – అవ్యక్త వాక్కలనమట్లు!

### ద్విపద

450. శుక్ల పక్షారంభ సోమరేఖవలె
శుక్లచ్ఛవి ముఖమంజులములో నిలిచె
ధూమ జాలములోని ద్యువువోలె నుండె
రామ – తానేక వస్త్రయనియె తోచు;
పద్మ రహితమును, పంకసహితము
సద్మ నైస్వ్యగ్రస్త సరసిసన్నిభము;

అంగారక ద్యుచ రాపీడిత యయి
అంగద తప్తయైనట్టి రోహిణియె;
తమ సమూహము నుండి తప్పిపోయి – శ్వగ
ణము బారిపడిన చీనము వోలె – నుండె,
భీత నయని, హేమ, విరితీవబోణి,
నాతి, చిక్కుల జిక్కెనా – యేకవేణి!

451. జలదచ్ఛిన్నాంత శ్యా
మల వనరాజ స్ఫురిత విమల భూమివలెన్–
గలరూపు కలదు కనుముం
దిలాతనయయే యనుకొని యిట్టిట్టులయెన్

ద్విపద

452. తలపులు సాగించె – దఱులమోరమెక
మలనాడు కీనాశు దభ్రపథమున
నపహరించుక పోయినట్టి స్త్రీమూర్తి
కపటి బారినపడి క్రాలు శీలవతి
ఈమెయే యయి యుండు, నీమెయే సీత,
ఈమె మా మాత మహీజయే యనుచు
పరికించగా నెదవసివాళ్లు వాడె
వరకపికి, మరల పరిపరి నరసె

453. భయకంపితయౌ యొక బిల
శయ వధువు వలె పలు నిశ్వసనముల, భగ్నం
బయినట్టి యాశగతి, వల
తయె యెదనింపుకొనుచు – కలతల తలకట్టై

454. ఒక వితర్క సంస్కృత్యర్థయుక్తి వోలె,
క్షీణ సంపద వహి; భ్రష్టసిద్ధి మాడ్కి,
ప్రకట కలుషిత బుద్ధినాన్ – బ్రమద యుండె,
విహత సమవధాన సరణి వీక్ష్యమయ్యె



455. బాష్పపరిపూర్ణలోచన ద్వయము జూడ,
నప్రసన్న వదన మండలాకృతి గన,
తా నలంకృత రహిత ప్రత్యక్షమయ్యె
మనన రాహిత్య జనిత విస్మరణ మట్లు!

456. వ్యాకరణ శుద్ధ సంస్కార వర్ణ రహిత
మగుట నర్థాంతర ప్రత్యయమ్ము గూర్చు
వాక్కు భాతి, భాతి తరిగి ప్రకటనంబు
నిడుకొనెను భంగిమమ్ము – మన్నింపులేక!

457. అవునవు నీమెయె యగును పృ
థివీ తనయ, రామవిభుడు తెల్పిన వేవే
రవణములో, నవియే యీ
ధవళాక్షి కడ గలవు విశదములౌ రీతిన్

458. ఏ పచ్చని వస్త్రమున క
లాపము లునిచి యవనీధరమున విసిరెనో
ఆ పచ్చని చీర చెఱగు
దాపునగల తరువు పైన దరిసెన మిచ్చున్

459. ధూళి ధూసరితమగు హేతువున, తన్వి
సిత సుచేలము ముందున్న చెన్ను దరిగె
గాని, కాంతివంతంబుగా గానబడును–
కనక వర్ణాంగి యీమె రాఘవుని పత్ని!

460. బింబ ప్రతి బింబ సమా
నం బీ సీతా దశరథ నందనుల స్వరూ
పంబుల్ – నిజ, మొక విశ్వా
సంబున జీవించుచున్న సంయోగవిదుల్!

461. సీతా సుమిత్రపుత్రు స
మేత శ్రీరాము దలపు మేలు ఘటిల్లన్
వాతాత్మజు డప్పట్టున
నేతాదృశ భావజాల మేర్పడ జేసెన్

462. తుల్య శీల వయోవృత్త మాల్య వితతి
మఱియు తుల్యాభిజన సులక్ష్మ ప్రతతియు
గలుగు వైదేహి కా రామ ఘనుడె తగును.
తగును శ్రీరాము కీమెయే ధర్మపత్ని!

463. ధీమంతుండగు రామచంద్రు గుణసందేశార్థ సంభూత సూ
నామోదమ్ము నెఱింగియుంట, మఱి ధ్యేయజ్ఞాన పారీణుడా
రామభ్రాత సుమిత్ర పట్టి గుణ మర్థం బౌటచే నోర్చె నీ
రామస్వామిని యింత యాపద, ధురన్, నిందుకుండంబలెన్

464. అదియే కారణ మీ సతి
హృదయము నిలుపుకొనె నక్షరిని సైతము దా
ద్రిదివోద్భవగ సుడివడక;
సదాతన స్పృహకు వేరు సంగడి కలదే!

465. నిజమా రాముని గాంచినన్ దెలియు మౌనిస్తుత్య నీ సీత గో
రి, జనస్థానములో చతర్దశ సహస్రేంద్రారి సంఘాతముం
బ్రజవి శ్రేష్ఠుడు కూల్చెగాదె, శరతీవ్ర క్రూరశస్త్రాస్త్ర ధా
టి, జిత ప్రజ్ఞకు మూర్తియై – పెరిమ మేటిల్లంగ జాటింపుచున్

466. పరిమార్చెం గృత భీమ విక్రముడు – బీభత్సున్, విరాధాస్రవున్;
ఖరునిం ద్రుంచెను, దూషణుం దునిమె, దుష్కర్మం త్రిశీర్షాసురు
న్నుఱిమెన్ రాఘవు; డీమె కారణము నేనున్ జూచి తీ లంక; యీ
వర భర్తృవ్రత హేతువై యమరె ప్రోద్దాముండు సుగ్రీవుడున్.

467. ధారుణి కన్యక గూఱిచి
ధారుణినే కాదు – దశరథసుతుడు – జగమున్
ఘోరముగా దలక్రిందుల
జీరాడించినను యుక్త చేష్టగ జెల్లున్



**ఇంద్రవ్రజము**

468. త్రైలోక్య భోగంబు? ధరాజయా? యే
త్రైలోక్య రాజ్యంబు ధరాజకే మై
పోలున్? పదార్వంతు పొసంగగా లే
వీ – లంబు– యాథార్థ్యమౌ ఇతఃపరంబున్

**ఉపేంద్రవ్రజము**

469. ప్రతీత పంక్తి ధ్వజ రాడ్వరుండౌ,
యతి క్షముం, దుక్కరి, ఆర్య శీలుం
డతండు, పూజ్యుండు; స్నుషౌను – సీతా
పతివ్రతాదేవియె వాని కింకన్

**ఉపజాతి**

470. శ్రీమంతుడున్, ధర్మ విశిష్టు, దంజ
స్సమేతుడా రామవిచక్షణోధన్,
శ్రీమైథిలీ సాధ్వి, హరిప్రియార్యన్,
సమర్థ నైర్మల్య విశాల శీలన్;

471. ఈ వహి జూడగా వలసె, యీ దురదృష్టము నాది, సీత నీ
పావని, యీ మహాసతి, ధ్రువన్ – దనుజ ప్రమదాళి మధ్య భీ
తావహ దుస్థితిన్; జెలవు డా రఘురాముని పైని ప్రేమయే
యీ వసుధాంగజన్ నిలిపె, నింతటి బాధల నూరడించుచున్

472. అరయ ద్వదీయ బంధు వొక రైనను దగ్గఱలేరు, వైభవ
స్ఫురణ మదెంతమాత్రమును పొందుకురాదు, సుఖార్హయైన – నా
దరము వహించు వారెవరు దాపునలేమి – మనోవ్యథార్హగా
దరణికులాబ్ధిచంద్రు పయి ధ్యానము నిల్పుచు – నిల్చె, నీ గతిన్

473. ఇంతటి సీతాసతి, భా
స్వంత కులాంగన, నపహృత సాధ్వి విడచి, తా
నంతటి సీతాపతియే
చింతించుట విధి విలాస చేష్టయు గాదే!

474. పొలతుక వెంటలేక సుఖముల్ విడి; కానన సీమలోన - యీ
కలతల దారులందు తిరుగన్ వలెనే - రఘువంశసింహ; మీ
కలకువ నోర్చు శక్తి జనకాత్మజ పట్టిన ధర్మ దీక్షయున్,
వెలుగులతేని కందువల వేడుక నిబ్బరమన్న - నిక్కమౌ

475. కష్టము లొకందువెంట నొకటిగ వచ్చి
తనను పీడించుచున్న దుహిన నిఘాత
మోర్చి నిలిచిన కమలిని వోలె నుండె;
సీత వర్ణన మెపుడు సశేష మగును!

476. యోచన మున్నులందు సమయోచిత భావతతి ప్రధానముల్
దోచగ బావమాని యొక తూగున, తీరున నిశ్చయాత్ముడై
యోచన నిల్పె - నీ సుదతి యోగవివేక విచార సారసం
వాచక శిష్టుడా జనక వల్లభు పుత్రిక - తథ్యమే యగున్

477. అవును కాబోలు; కాబోలు నవుననుకొని
మనము తాను ద్వైదీభావమగ్న మయ్యె,
గుండె నీట నిండిన క్రొత్త కుండయయ్యె;
వాఙ్మయము మూగవోయిన భ్రాంతి నింపె!

478. కనులు నులుముకొనుచు మరొకపరి - పులుకు
పులుకున గనె - వనచరుడనిలతనుజుడు,
వసతి మండపము పయిని వంగియున్న
శాఖక్రింద యిందునిభాస్య స్పష్టమయ్యె!

479. ఎవరి యనుశాసనంబున నేమొ కాని
ఆ యబలచుట్టు నొక వృత్త మావరించె;
పరిధి మరి యేదొకాదు - క్షపాచర వని
తా వృతము, నైజదుర్మద తమ్మటమ్ము!



**మత్తకోకిల**

480. ఘోరరూపులు, క్రోధవర్తులు, క్రూరమూర్తులు, ధూర్తులున్,
భారదేహులు, రూక్షనేత్రులు, పాప చింతన తత్పరుల్,
భైరవోద్ధత కావ్య నిర్మిత పార్ష్ణిపాత్ర వికారులున్.
దారుణోర్జిత దుష్టభావిత తామసేప్సి వివర్తునుల్

481. రాక్షసీగణ పరిభృత - రమణి గాంచి,
కాంచె - హనుమంతు డచ్చోట - కడుపున తృణ
దుహము దాచుకొన్న కదలి, దువ్వి నడువు
బుట్టువుల నడిమి - రురువు; పుడమి నుడువు!

482. మోర ముందుకు సాచి, సముఖమున గల
సుదతి జూచె బ్రకంపన సూను, దంత
నెడదలో గాలి - పొంగించె నెల్ల వపువు;
మేను మేనెల్ల నరుసపు మేర నెతిగె!

483. చింతా క్రాంతతత మొగమం
దంతంతగ తిప్పవేసి నట్లా తేజ
స్వంతిని కళ తోచె గపికి,
జెంతన్ గనిపించె భాగ్య శీర్షమనంగన్

484. కోరిక వేరుగా; దిటవు కూకటి వేరుగ; సంప్రతిష్ఠ సం
ధ్యారుచి వెల్గునీడలను దాగుడు మూతల నాడు కొమ్మగాన్
సారవివేక సంపదయె స్కంధముగాగ; మహాశయమ్మె యు
ర్వీరుహమో యనంగ గనుపించెను తన్వి హరీశు కత్తతిన్

485. ఆరయ నక్షరాభ్యసన మందున ముందుగ బాలుడొక్క డోం
కారము దిద్ది కూర్చిన ప్రకారము తోచెను పావమానికిన్,
శ్రీరమణీయ కావ్యమున జిందిన చిక్కని విప్రలంభ శృం
గార పదార్థమో యనగ గానగ నయ్యెను నీరజాక్షియున్

486. తపమో, ధ్యానమో, యోగ యోచనయొ, యాత్మాయత్త సంక్షోభమో,
విపరీత క్రుథయో, ప్రతీక్షణమొ, సంవీక్షా సమాసార్థమో,
యపదానమ్మును గూర్చి చింతనయొ తానైనట్లు – జూపట్టె, దా
నపహర్త న్నిరసించు భంగిమ; నిజమ్మాయమ్మ, మా యమ్మయే!

487. ఈ సుదతి కావలయు సీత; ఈ విశాల
నయనయే కావలయు మాత; జయము, నయము–
వెదుకబోయిన తీవెగా పొదలియాడె
ననుకొనుచు, గాలిలో దేలె హనుమ మనము!

488. అంతటి కీర్తి భాస్వర మహస్కర వంశము మెట్టి, ధర్మ శీ
లాంతర వృత్తి నన్య మహిళా నభిగమ్య విధానగామియై
మంతునకెక్కినట్టి మహిమాన్విత కోసల రాజపుత్రి క
త్యంతము గూర్చు కోడలయినట్టి మహాసతి – యీమెయే యగున్!

489. నిరతిశయాత్మ శక్తి, ద్విగుణీకృత సంగర కౌశలాప్తియున్
వరజనమోదదత్త పరిపాలన కీర్తియు, ధర్మమూర్తియౌ,
పరమ వినీతిసార గుణవంద్యుడు, పంక్తిరథావనీంద్రుకున్
మురిపెపు గోడ లీమె యగు, ముగ్ధశుభంకర మూర్తి జూడగన్

490. లక్ష్మణ మూర్తి యంతటి విలక్షణ ధీరుడు, భ్రాతృసేవలో
సూక్ష్మ విశేష దర్శిత విశుద్ధ యశస్కరుకున్, వధూనికా
లక్ష్మణ మీమెదేయగు, సలక్షణ లక్షిత సద్గుణాళికిన్
లక్ష్మము లీమె మోము పయి లాస్యము జేయుచునుండె జూడగన్

491. ధర్మజ్ఞుండు, కృతజ్ఞుడు
నిర్మత్సుం డనువరియు, వినీతుడు, నాలం
కర్మీణుడు, విదితాత్ముడు,
నిర్మలు డా రాము స్వామినియు నీ సతియే



492. అగును, నిశ్చయంబుగ యీమె యగును – సీత
యెట్టి దుర్దశ వాటిల్లె నీ సతి కిట
పుష్పితాశోకము లిట చూపు లెఱిగినవి,
శోక పుష్పిత నీ మనసు చదివినది

493. కనక వర్ణాంగి, రామసాకల్యరాగ,
నిత్య సుస్మిత భాషిణి, నీరజాక్షి,
యనుభవింప దగని యనర్థాళిలమ్ము
నిట్లు సహియించు చుండె నిదేమి కలత?

494. ఆయీ భావములెల్ల మానసమునం దామోద సంగీతమున్
మ్రోయంజేయ సమీరసూతి – యపుడా ప్రోకన్ విడెన్ – హ్లాదన
మ్మే యుచ్ఛ్వాసముగాగ, లంఘనములే మేటిల్ల, సంరంభియై,
డాయన్ బోయె లతాంగి యుండిన ప్రతిష్ఠానమ్ము, నా మీదటన్

495. ఇరుగుడు చెట్టుపై నెక్కి కూర్చుండెను
సామీప్య దేశమ్ము జక్క గనగ
దూరమ్ముగ తనకు దోతెంచిన తరుణి
దలిరుల తొలగించిన తనియ జూచె
యుక్తి యుక్తమ్ములై యులిసిన హేతువు
లా కొమరాలె సీతమ్మ యనియె
హనుమంతు మనమంత యందగించె, పులుక
నిల్పోపనీక పన్నికల దడవె
రూపభావ స్వభావ స్వరూపములవి
మఱియు నాకార భంగిమ మంజిమమ్ము;
మండనములు, నిశ్చయము – సమంజసమనె;
సీత యీమెయే, యీమెయే సీతయనియె.

496. క్షణము – తన జపస్సిద్ధి వర్షమ్ము తనువు
నెల్ల సూక్ష్మత ననిపించి యుల్లసింప
జేయ; నా ప్రభాభావుండు – జేయబూనె,
జూడ జక్కని చేష్టల, జోద్యమెనయ!

497. ఎగిరి గంతులు వేసి హర్షించె హనుమ,
తోకఝాడించి దూకు పైదూకె హనుమ,
పిల్లిమొగ్గలు వేసి తృప్తిపడె హనుమ,
నేలపై దొర్లి చెట్టెక్కి నిలిచె హనుమ!

498. నిజము నా భాగ్య సస్యమ్ము నెఱయపండె,
నిక్క మీవేళ ధన్యత్వ నిగళమందె,
సత్యమేదియొ తాత్పర్య సాక్ష్యమిచ్చె,
ననుకొనెను హరి, సరిలేని హర్షమొందె!

499. రామస్వామియె ఆనతీయ; మరి సుత్రామాదులున్ గోరగా;
మా మా వానర వీరులెల్ల శుభమే మన్నించ; సుగ్రీవుడున్
స్థామస్థేమము లెన్ని యెన్నగను, విశ్వశ్రేయమే లక్ష్యమై,
క్షేమంబే జతరాన్ – మరేమగు, నగున్ సీతాభివీక్షాప్తియే!

500. అని, మఱియొకపరి మురియుచు,
ననుమడు పరిపరి విధముల నరగలి గొనుచున్
గొను నరమరికల – నరముడి–
తనమది నరయిక సలిపెను, తనువడు నిరతిన్

501. ఈ నెఱి, లోని యోచన లవెల్లను పత్రహరిత్తుగాగ, మే
నూనిన చర్యలెల్ల తగు నూహలలో సదయౌను నిక్కమం
చా నడుపున్ దలంచి, కలయంగన మర్కటమూర్తి కాసురీ
స్త్రైణము మధ్య బెగ్గడిలు చారుహరేణువు తోచె జూడ్కికిన్

502. దండుగ చీమలెన్నొ తన దాపుకు జేరగ, మధ్య శర్కరా
ఖండము నిల్చియున్న గతి గాంచెను వానరమూర్తి రాక్షసీ
తండక మధ్యమందు కల తల్లిని, కప్పల దొర్వులో తిరం
బుండిన తామరాకు, నెగడొందిన చక్కని నీటిబొట్టునున్



503. వనదేవతకు గడ మిగి
లిన నెలపాలుకు – గుదురు; గెలివిని తెలుపుచున్
వనచరు డత్తఱి సీతను
దన పొరిచూపు చిరునామ దనరగ జేసెన్

504. సీతా సాక్షాత్కారము
వాతాత్మజు దేహమునకు పసిమిదనమ్మున్,
చేతంబునకు పసదనపు
బూతల బూసెన్, బునీత బోధన మిచ్చెన్!

505. పరరాత్రమ్ము గతించు సూచనలు సర్వవ్యాప్తమై, సవ్వడుల్
త్వర మీఱన్ బరతెంచసాగె, నిక రాత్ర్యారాధనా ప్రక్రియల్
మరలించన్ గదునుత్సహించి – పురమున్ మాహేశ్వరారాధనా
స్వరరాగ ప్రసరమ్ము నందుకొనగా; వాతాత్మజుం డత్తఱిన్

506. తూర్పు దిక్కునుగని – ద్యుమణి తేజమునకు
కరమైన యంజలి కంజమిచ్చి,
యామ్య ముద్వీక్షించి యమ యాన యమముకు
భావాధరోక్త సంభావనమిడి,
పశ్చిమాశ నరసి – వాయుశైత్యమునకు
హృద్వీజనముల విహృతిని గూర్చి,
ఉత్తరదిశ గాంచి యోగ్య శ్రవస్సుకు
మానసానంద సమ్మానమొసగి,
సర్వదేవ నమస్కార శతము సలిపి,
శ్రీరఘుస్వామి దన హృది సీమ నిలిపి,
నెలత సీత దన కనుల నెలవు కొలిపి,
మురిసె గూఢరచిత సత్త్వమూర్తి యగుచు!

507. ధ్యేయైక తత్పరత నా
వాయుతనుజుడు సవికాస పరివిగ్నముతో
నాయెడ వేచెను రామ
శ్రేయము గాంక్షించుచు తరుశీర్ష సముండై

508. ఆలోచనాప్లుతుడగుచు
నా లీలం ధరణిజాత నరయుచు దత్ స్థా
నాలేఖ్యము హృది నిలుపుచు
కాలాక్రమణ మొనరించె గపివరుడంతన్

**అశోకవనము - రావణాగమనము - అతివాదము**

509. అదియే యరదము - పరిజన
మదియే, కోలాహలమ్ము నదియే, యడుగో
పదరుచు, యరదము డిగ్గుచు,
బదింబదిగ వచ్చుచుండె - పదనిదె యనగన్!

510. కైలాసనాధుడే కరుణించి దిగివచ్చి
యితని ఫాలము నదిష్ఠించె నేమొ
స్వర్గాధినాధు వజ్రాయుధము తొరగి
యితని కుడిభుజమై యెనసె నేమొ
మేరు వీ స్థానమే మేలు మేలనుకొని
యితని యురమ్మునే యెంచె నేమొ
గానామృతము పంచగా రుద్రవీణయె
యితని నాభికి జేరి యిమిడె నేమొ
యనిన విధము - శైవమ్ము, నత్యధిక సత్త్వ
సంస్థితియు, దీమసము, లావు, సంప్రదాన
సంజ్ఞలు - సమృద్ధిగ కొలువు సలిపె నితని
దేహవేదిక పైన సందేహమేల!

511. అతడే భ్రాసిత కీర్తి ధామనిలయుం డాభీల విద్వేష సం
తతి సంహారవిహారలోలుడు, లసత్రపఖ్యాత దిగ్జేత, భూ
త తరస్విగణ పర్వరీణ ధృత హృత్సారాప్లవుండున్, శుభా
న్విత లంకాపుర వైభవోన్నతికి స్వర్ణీభూత సంధాతయున్



512. వచ్చెడు వాడు వాడె, వరవర్ణిని కైకసిసూను డా మహా
సచ్చరితార్జవాలయకు చాయగదా! యిది యేమివింత? యా
లచ్చిని యేపరించు చెడు లచ్చన మెచ్చుటనుండి తెచ్చి తా
నచ్చుకొనెన్ దవాయి? యవునౌ నిది జన్మకు కాలదోషమే!

513. ఎంతటి కెంత వాడు దనుజేశ్వరు డీశ్వర భక్త పుంగవుం
డంతకు మించి మించు నొక యాశ్రవుడంట మహేశు; కట్టి వా
డింతగ జారి జారి, బలి యింట బడెం గద, యొక్క భావ దు
శ్చింతకు లొంగిలొంగి, యఱచేతను నిప్పుక బట్టె - సైచునే!

514. తను చిత్తంబులు తప్పుదారి బడగా, దౌరాత్మ్యమే వచ్చు చుం
డినరీతిన్ చెయి కాలు తూగులవి యాడించంగ, నామధ్యలో
ననువౌ మార్గము బట్టు నక్కఱను దా నాంతర్యమ్ముగా జెప్పు బు
ద్ధి నిదానమ్మును వోలె - టీవి యఱ, దోతెంచెన్ సుపర్వారియున్.

515. పరివారమ్మది వెంటవెంట నడువన్, ద్వారమ్ము దాటెన్ - క్షపా
చర వీరుం, డదె యీ దిశన్ దిరిగె, భ్రాజ్యాకాంక్ష లేవేవియో
సరణిన్, చారము నెట్టుచున్న వన; నిష్క్రాంతాధిపత్యమ్మె - చె
చ్చెర నేతెంచుచు నుండె, మండపము డాసెన్, డాసె నావేగమున్!

516. తమ రాజున్ గని యాసురీగణము చెంతంబొంత లేకుండ, వే
గము, నావేగము దోడురాగ, దొలగంగాజొచ్చి రామీద, న
య్యమరారాతి ధరాత్మజన్ దరిసె, వాక్యాహారమున్ గూర్చగా
సమకట్టెన్, పరిశీలనాక్రమముగా, సామీప్య మీక్షించుచున్.

517. కళలెల్ల యొకచోట కలికిగా మారెబో
కలికి యొప్పుల కుప్పగా గళగొనె,
శోభనోద్యమము విశ్రుతమయ్యెనో యేమొ
శ్రుతము తా విస్తార శోభలెగసె,
సౌందర్యమే నిర్వచన సృష్టి దనరెబో
వచనమే సౌందర్యపదము మలచె,

సౌభాగ్యమేర్చి ప్రసన్నతన్ విచ్చెబో
యాప్రసన్నతయె భాగ్యముగ నమరె,
నవనవోన్మేష తారుణ్యనంద మెల్ల
మూర్తిమంతమై భామినీ మూర్తి కొక్క
నూత్న తోరణమ్మగుచు వినోదమిచ్చె,
నహహా! యనిపించె దైత్యున కామె గనగ!

518. శృంగము శృంగమ్ము పరి
ష్వంగము జేయు సమయమిది, పరివర్తన మా
కంగేలి జేరు ఘటన – దు
స్సంగతి మతి దప్పిన గతిసంకరమిదియే!

519. అంతట రావణుండు తరుణార్కనిభానన గాంచి, చెప్ప లే
నంత వికార భావము సహాయముగా నరుదెంచి నిల్వగా,
కంతు విరాళినే వడియగట్టిన నేర్పును, కూర్పు, నిగ్గునుం
జెంతకు జేర్చుచున్, బలుకు జేలము జెక్కుచు, నిక్కు జూపుచున్.

520. తాపసి వోలె నున్న నెలతన్ సతి గాంచి దశాస్యుడింక – తా
నోపగలేని యిచ్చకపు టుబ్బయు తత్తఱగొల్ప – బింకముం
జూపియు జూపకుండగ, నశోకము నిల్వున గాంచి, యంతలో
జూపు మరల్చి సీత గనుచుం బ్రణయాపచయమ్ము బూనుచున్.

521. చూడుము జానకీ – ప్రణయసుందరి! యెందులకీ భయమ్ము? నే
వేడుక మీఱవచ్చితిని – వేమఱు చిల్కిన ప్రేమ సారముల్
నేడును కూడ దెచ్చితిని – నీ వచనామృత నంద వాటికిన్,
గూడిక జేసి సౌమనస కుందము నందుము, యందజేయుమీ!

522. తూకము దూచి చూపెదను తొయ్యలి, కావలెనన్న ! నాదు ప్రే
మైక విశేష ముత్యమొక యంచున నుంచి మఱొక్క తక్కెడన్,
బ్రాకట రాజ్యభోగ ఘనవైభవ సంపదలెల్ల నిల్పినన్,
వీక తలిర్చ ప్రేమ యొక వీసమె యైనను పైకి లేవదే!



523. సరసాల జవరాలి మురిపాల మాలవై
గళసీమ నేలగ కదలిరావె,
సరదాల కొమరాలి విరజాజి ప్రోవువై
నవకాల పాన్పు పరువగ రాదె,
కృమిజాల, కుముదాల, మృగమద గంధమై
పరివాస వాసము నెఱపరాదె,
ప్రణయాల కలహాల పరిహాస హారమై
మధుకీల హృదయమై మరగరాదె,
స్వరసభావ మనువు పద సంచలించి,
నన్ను సైతము నసియాడ పన్నజేయ
రమ్ము కృశమధ్య! చక్కెర బొమ్మ – రమ్ము,
వలచి వలపించి భోగించు వరము నిమ్ము!

524. ఏలా యాలోచనలో
లోలాక్షీ! యింతటి ప్రియలోలుండీ, దై
త్యాలంకర్మీణుడు, నీ
మ్రోలన్నిలిచెను, కనుము, సుముఖి – కృపజేయన్.

525. అంతరింద్రియ మది యెల్ల యలసి సొలసె,
సంతమము నిండి నీనామ జపము మునిగె,
వేపమ్రాను నైనను యూపు పిల్లగాలి,
కొండయైన లోవేడికి గుములు గాదె!

526. ఇందువదన! నీకేల యీ యేకవేణి!
యేల యుపవాస దీక్ష ? వేవేల తలపు
లేల? సుఖము నా మాటగా వాలె – నీదు
మ్రోల! కొనుము పదార్థ సమ్మోదమెల్ల!

527. ఏల కోమలాంగి, కటికనేల? యేల–
మలిన వస్త్ర ధారణము? కమలిన సౌకు
మార్య శోభలేల? నెలత – కార్యమెఱిగి
లెమ్ము, నిష్కారణపు శిక్ష లెస్స గాదు,

528. అందము నందజేయుము వరాంగి! సమాదరచిత్త వృత్తి నీ
యందుము నంద సిద్ధమయి – యర్థము, మానము, ప్రాణమెల్ల నీ
ముందుకు దించి యుంచితి, విమోహిని మాత్రమెగాదు నేను, మే
ల్పొంది పలాశి ధర్మముల యుక్తముగా పొదలించు వాడనే!

529. రాక్షసజాతికి – నో కమ
లాక్షి – పరస్త్రీ యపేక్ష, యపహరణమ్మున్
లక్షణముల్, ధర్మములౌ,
వీక్షించుము సౌమనస్య వృత్తము వరలన్,

530. శుక్ర శిష్య సంతతి కొక్క శోభ గూర్చి,
త్రిభువనముల భుజబలాంతరీప ముంచి,
దిక్పతుల నాదు కనుసన్న ద్రిప్పి త్రిప్పి,
యసురధర్మ నిర్వహణమ్ము నాచరింతు!

531. అట్టి వాడను, లేదు – దీటైన వాడు
నాకు; నా పరాక్రమము, విన్నాణమెల్ల
జగము లెఱిగి యెఱిగి గదా – సగము యొఱిగి
మొఱిగి – సరినిల్చి, ననుగొల్చి, మోకఱిల్లె!

532. భువన మోహన మోహన భవన మీవు,
భువన శాసక శాసనప్రోక్త నేను,
నేర్పు నెరపిన ప్రేమాభినేత్రి వీవు
నేర్పు కొక కూర్పు నేర్పిన నేత నేను!

533. నిన్నే రాణిని జేతు, నిత్తు నిఖిలానేయమ్ము లౌ భాగ్యముల్,
చెన్ను ల్నీకడ నిల్పి శాసనమునే చేయింతు, నీ సౌమ్యతా
సన్నాహమ్మును కోరి యేమయిన దాసక్రియం బూనెదన్,
నన్నే నీకు సమర్పణమ్ము నిడి ప్రాణత్యాగమే జేతునే!



534. హాయిగ నాదు మాటవిను మబ్జముఖీ! నను సమ్మతించి – నీ
ప్రాయము, దోయమున్, గుణము, భాగ్యము, వైభవ కీర్తి శోభలం
దాయపు పట్టుకెల్ల నొక హార్దము, జొక్కను గూర్చు కొమ్ము, నా
కాయము, కాయికమ్ము, నధికారము – నీవిగ జేసి కొమ్మికన్

535. సఖివై రావణునంత వానికిక యష్టైశ్వర్య సంప్రాప్తిచే –
సుఖ సంతోష మహద్విశేష విభవాస్తోక ప్రభాదీప్తిచే,
నఖిల స్తుత్యము గాగ, పుట్టుకకు ధన్యత్వంబు నందించుమీ,
లిఖితంబౌ మన ప్రేమ కావ్యము, సుహృల్లీలా మహాకల్పమై

536. అంతిపురంబులోగల ప్రియాంగన లందఱి చేత నీకు చె
ప్పింతును – నీవె రాణివని, వీరును, వారును – పేరుపేరునన్
జెంతకు వచ్చి నీదు పద సేవకు బారులు తీరి నిల్తు, రా
వంతయు శంకలేక జగమంతయు నేలుము – యేలు మీతనిన్!

537. నా నారీ జనమెల్ల నిన్ను కొలువన్, నా సార్వభౌమాధి ప
త్యానేక ప్రతిమమ్ము – నీదు నధికారామోద ముద్రం గనన్,
మౌన ప్రార్థన నీకడన్ నిలుచు; నీ మన్నింపుకై వేడుచున్
స్థానీయుల్ నిను చక్రవర్తినిగ నాశంసించి పూజింతురే!

538. శూన్యము, పూర్ణత్వము – న
న్యోన్యము పూరకము లంద్రు – యువతీమణిరో,
నా న్యక్షము గోల్పోవుచు
ధన్యుడనగుదును – పరీప్షి దక్కించుమికన్!

539. ఇచ్చకు వచ్చినట్టులమరేంద్రుని, దిక్పతులంత వారినిన్,
గచ్చును దీర్చుకో దలచి కాఱియవెట్టినవాడ, వారికిన్
యొచ్చము నచ్చు కట్టితిని; యుర్వి సమస్తము నీ కతంబుగా
నచ్చపుజేవ గెల్చి జనకాధిపు కిత్తును, నాదు సత్తుగన్

540. అందను కాత్మవృత్తి – పరమాదరణీయ మటన్న భావనా
స్పందన ముల్లసిల్లు గతి – బాహ్యము జేసిన దైత్యనాథు డే
స్పందన మందగించక వివర్ణము జెందిన సీతమోము నం
దందని ఛాయ గాంచెను, నిజాశయ మెంతయు శూన్యమయ్యెడిన్

541. వ్యాహృతి గొంగళీపురుగునై తనదేహము పైన బ్రాకిన
ట్లాహత ఘాతమొక్కటి తటాలున మోమును తాకినట్లు, దు
స్సాహస మెల్ల రూపుగొని చందునిగా తనముందు నిల్చెనా,
గాహళమెంచి సీత కలకంబడి విహ్వల యయ్యె నెక్కటిన్

542. ధీరగుణానురక్తి, తగు స్థేమ మెడందకు దల్లివేరుగా
దీరిచి, ధారణీ తనయ - దేవుని, శ్రీరఘురామ దేవునిన్
గోరి నుతించి, రావణుని కుత్సిత వైఖరి గూర్చి యోచనల్
బేరిచె నిట్లు - లోన వినిపించు వివేకము బ్రోది చేయుచున్.

543. ఒక చెఱపట్టి యాట తన కొప్పు నటంచు - దురాత్మకుండు - దా
బ్రకటము జేసె; వెన్నునకు బ్రాకిన మోహ వికార కామముల్
సకలము రాక్షసేశుని వశంవదు జేసెను దుష్టచేష్టకు
న్నికృతిని బెంచుచున్ - జిగురు నిక్కిన మొగ్గను మ్రానుజేసెగా!

544. ఇతడొక దుష్టుడున్ మఱియు హీనుడు, ధూర్తుడు, పల్కు తీరు - చా
లితని స్వభావమున్ దెలుప, యెంతటి ధార్ష్ట్యము, ధర్షణంబు లీ
స్థితికి బ్రయోక్త జేసె, శివదీక్ష కనర్థము సంతరించె; నా
కతిపథ మౌనె యీ యసురు, నల్పుని జూచుట, మాటలాడుటల్!

545. అని యెన్నో రీతుల భా
వన జేయుచు ధరణిజాత - ప్రస్తుత ధర్మం
బనులక్షించుచు, దనలో
మొనసిన లోకార్థలక్ష్యము గణేయముగన్,

546. ఎంచుచు, నెద పలక పయిన్-
మించిన భక్తిని రమణుని మేలగురూపం
బంచిత విశ్వాసము - లిఖి
యించె నిలా తనయ యెలిమి నెచ్చిఱ; నటుపై;

547. మదిలో దనుజుని రూపం
బది యెది యెదియో - యదియిది యై నిలవగ - దా
నది కనుటా - కను టేలని
పదింబదిగ యోచన సలుపంగ దొడంగెన్



548. బయలు లోపల ఘర్షణమలము కొన,
యలసి నిట్టూర్చి, యొదల నలతి యెత్తి,
చురుకు జూపుల జూచియు జూడనట్లు
విసరు, కసరు, విసుగునెల్ల విసరి, విసరె!

549. ఇది గమనించి చెప్పె దనుజేశ్వరు డింకొక మాఱు ఆమెకున్
'ముదితరొ! నాదు తత్త్వము సమూలముగా నిట నిల్పినాడ, న
భ్యుదయము గోరి కోరి యొక యూతము గూర్చితి, నీకు సమ్మతం
బిదియను నొక్కమాట కొఱకీగతి దోసిలి బట్టి నిల్చితిన్

550. ఎదుట నుంచిన సిద్ధాన్న మిదియె గొనుము,
నెగులు మానుము - నాపైని నెపము మోపి,
బ్రతుకు నొక జాజి మాలగ బన్ను పఱచి
కొమ్ము, కొమ్ము - నా ప్రేమమ్ము - సమ్మతించి!

551. అతివ! నీ రాఘవు డనువా డల్పజీవి,
సుదతి, గతిలేని వాడేమి సుకము నిచ్చు,
తరుణి! బ్రతుకు నావను ముంచు తరగ - వాడు
వాని ధ్యాసను మాని నావైపు గనుము

**సీతాసతి స్పష్టీకృత హితోక్తి**

552. రావణు పొల్లు మాటల పరంపర నోపని సీత - భావ సం
భావన లెన్నొ వెల్వడెడు భంగి నొకానొక గడ్డిపోచ - శి
క్షావిధి సూచనన్ దనుజు సమ్ముఖ మందున వేసి యిట్లనెన్
'సేవతి గ్రుచ్చి గ్రుచ్చి వటసిద్రము వంచుట సాధ్యమౌనురా-

553. రావణ! చాలు చాలును, విరాళపు వెట్టయె యుగ్గ బెట్టె - ని
న్నీవిధి! వంశనాశ మితరేతర రాక్షస నాశనమ్మునున్
సేవక బంధు మిత్ర జన చింతల నాపుము, నీదు మౌఢ్యమే
జూవర మౌను; తేనియను స్రుక్కిన యీగవు, కర్మమింతియే!

554. నేనును, నాదు భర్త – మహనీయ యహఃపతి, కాంతివోలె, గు
ర్వానుమతానుభావ విధి యాపిత శిక్షణభంగి, నాణెమం
దానిన బొమ్మయున్ బొరుసు నన్న విధంబు, పరస్పరంబుగా
యానిక గల్గు వారల, మహమ్మును వీడుము, చూడు మా కథన్!

555. అగ్నిని మూటగట్టి భయమందక యుంటివి, లంకభాగ్యమే
భగ్నము జేయ దుందుడుకు పాటున నింతలు సేయు చుంటి; వా
యగ్నియె నీకు మృత్యు నిలయంబగు రాక్షసరాజ; మూర్ఖతా
మగ్నము నైన బుద్ధికొక మాటయు, మంచియు బ్రీతినిచ్చునే!

556. చాలుంజాలును నీ ప్రలోభమిక; యాజ్ఞాదౌష్ట్యముం జాలు, క
ల్లోలంబుల్ మతి కల్లబొల్లి పలుకుల్ – లౌల్యత్వ, ధూర్తత్వ, వా
చాలత్వంబునె ప్రోవు వెట్టు, శుభనిష్పత్తిన్ వినిర్మించు, కా
మాలాపాంకము గట్టిపెట్టుమిక, నీయాద్యంతముల్ మోసమే!

557. రావణ మహాసురుండు శూర వరుడంచు
నలువు నలువైన వాడని నాలుగైదు
పదుల రాక్షసీ గణమెల్ల పలుకవింటి,
నిలుపు నెలువెల్లను నలుపు – నిజము నీవు!

558. తుదను వెన్ను బుట్టిన చొప్పతుంప వీవు,
మంచి మాట లేల విను – కామాతురుండు,
పాపమది త్వరలోననే పండనుండె;
భావి మాచేతి యుసిరిక పగిది కాదె!

559. అజసుతు సూనుడున్ మతి మహామహులెల్లరు వార్ధిదాటి – నీ
నిజము నెఱింగి, యాపయిని నీదు మహాభుజ శౌర్యవార్నిధిన్
సుజన శుభంకరంబుగ, విశుద్ధిగ నింకగ జేతురోయి, దై
త్య జనుల కీవు కీడు నిడుటన్నది చక్కగ వ్రాసి యుండెలే!

560. నీ నారీ జన మున్నా
రానందము నేలువారు, నలరువిలుతు దా
హానలముం బొనుగు పఱచు
జ్ఞానము గలవారు, వారి గను మది చాలున్!



561. నా నాథుని వేడుకొనుము
శ్రీనాథుని నీకు నీవు చింతించినచో
నీనాశము మఱియున్, లం
కా నాశము దప్పు, దప్పు గయ్యము లెల్లన్

562. కాదని మూర్ఖించిన నీ
దౌ దంభము డిందు, జీవితాశ గలిగినన్
వాదించక, భేదించక,
పాదములంబడుము రామ భక్తుడవగుచున్

563. కానిచో జీవనాథ్యాయ గతియె మారు,
కార్య సాఫల్య మా స్వామి కరము కలదు,
కీలెఱిగి వాతబెట్టు నకృత్యములకు,
జగము లాశ్చర్య తరణి మునుగు నిజమ్ము!

564. వాయి తెఱచిన వచ్చె దుర్భాషణంబు,
భాషణమున వెల్వడె నహంభావమెల్ల,
భావసంబంధ బంధము పాప ఫలము,
ఫలము తుది జేర్చు భవము – సంభవము, నిజము!

565. మనసున నీచభావనలు, మాటల దంభము, బుద్ధిలోన దం
ధనము విమోహకావర మధర్మపు గుట్టను, నిన్ను జూచియున్
ఘనుడు రఘూద్వహాజ్ఞ గొనగామి, నినున్ బరిమార్చలేక నుం
టిని, విధి కాచుచుండె చెనటీ – యిపుడీ విధి నిన్ను రావణా!

566. ఇది తాత్కాలిక మోరి – పో
లదిండి! కాలమది కాచి లంకెపలుపు దా
విదులుచు, రాముని రాకతొ
వదలును నీమాయ, కుమతి, బైజము ముగియున్!

567. జన్మ జన్మల కర్మమ్ము చర్మ దృష్టి
దాట నీయక నిన్నిట్లు దందడించె;
బ్రహ్మ దృష్టి కలుగదు పో, రాక్షసేశ
దృక్కు కద్దు కొనుము – గుణదృష్టినైన!

568. అనుమాటల్ వినినంత రావణుడు, "సీతా! యేమి వాచాలతల్
పెనవేయంగల శక్తి నీది? నను, నా వీరత్వ, శూరత్వ శా
సన నిర్దేశము ధిక్కరించితివి, యాజ్ఞన్ బ్రక్కగానెట్టి - ప్రా
ర్థనపై చూపుల గొడ్డలెత్తితివి, మర్యాదన్నదే లేదటే!

569. అని హెచ్చరికయొ, యావే
దనయొ తెలియని యొక దిగులు, తనమాటల వ
ర్తనమున వెలువడ, నిముషం
బున - దనుజుని కహము వెన్నుముడి ముడిగొనియెన్

570. సామము, దానమున్, నయవిచారము లెల్లను సాగి సాగి, యా
రామను కొంచెమేని తన ప్రార్థన వంకకు లాగలేమి, ను
ద్దామ సమర్థతా గుణము, దర్పము - జిన్నవోవగా,
దామస ఘంట మ్రోగె మది దైత్యున; కంతట రోషమేర్చగన్.

571. కాలునేలకు తాటించె, కాఱుకొన్న
యోచనల పఱపది తన కుదుకు వెట్ట,
రావణుం డస్తిమితుడయి - రమణిగాంచె,
గళము గదిమె; పలుకు నిప్పుకలను రాల్చ!

572. చెనకితివీవు సీత - నను సింగము వంటి మహాధినాథునిన్,
మనసును ముల్లుకోల నవమానము గ్రుచ్చితి - వోర్మి నార్పి, తీ
అని కసి తేపుచుంటి వవురా! మగవా డిటు లౌనుగాదె - ప్రే
మను స్తిమిత ప్రధానముగ మన్నన జేయుచు నిగ్రహించినన్!

573. కీడున్ మేలును జెప్పి చూచితిని, సంకీర్తించితిన్ బ్రేమమున్,
నీ డాకాలికి, గోటికిన్ సమము కానేకారు నాభార్య లం
చీడానుంబలె నీదు యందమును ప్రత్యేకించి వర్ణించి, నీ
వాడన్నేనని మొత్తుకొంటి, దయ రవ్వంతైన రాలేదుగా!

574. ఇట నా ప్రార్థనలెల్ల వ్యర్థమయి పోయెన్ దన్వీ! యీ పైన నా
కటువున్ జూచెద, వీ వథోగతిని నీకై నీవు వాంఛించ - నా
కిటులాలోచనలేల? నీ నిరసనల్, నీ క్రోధమున్, రోషమున్,
జటుల స్పర్థము వమ్ము జేసెదను - నా సంవిత్తు జూపించెదన్



575. రావంబిచ్చియు దట్టు కొంటి; శివు ఘోరాఘోర రూపమ్ములన్-
వేవేరీతుల గొల్చి కొల్చి, హృదయావిష్కారమున్ జేసితిన్,
దేవానీకము బంచభూతముల విద్వేషించి నిర్జించితిన్,
నీవు స్నీపతి యేమి చేయగలరే - నీరేజపత్రేక్షణా!

576. మూర్తీభవించి సంపూర్ణమయిన శక్తి
నీకీయగ దలచు నేర్పు దెలిపి,
రాజస రసికతా రాసిక్య రవణముల్
నీవి కావించు వినియమ మిచ్చి,
సర్వ సౌభాగ్య ప్రసరిత వైభోగమ్ము
నీ కమర్చెదు రూఢిని వివరించి,
రక్షణీయంబైన రాక్షస ధర్మమ్ము
నీ పరంబగు త్రోవ నిర్ణయించి
ఇంట దీపపు వెల్గు నిండించ వేడు
కొంటి; కాని; నీవేమొ నా కూర్మి, నూర్మి
నింతగ నుపేక్ష జేసితి వింక చాలు,
నీ లఘిమ మోర్చగా లేను నీరజాక్షి!

577. ఒక మహాద్రికి పిడుగువై యురవణించి
యొక మహాకావ్య గీతికి వికృతి నించి,
పుంజు బీరమ్ము నెక్కాడి పుఱుకరించి,
ముళ్ళపొద చిక్కితివిగాదె ముద్దులాడి!

578. మండెడు నగ్గిపై తగని మాటల నేతిని క్రుమ్మరించి, యు
ద్దండ మహాసురాధిపుని తాల్మి బరీక్షకు బెట్టితీవు - నిన్
గండడగింతు, నీ కిడిన కాలము నందిక రెండు చందులే
యుండిన దాపయిం దెలియు; నూర్జిత నిర్ణయ పాలనంబగున్!

579. ఇక నీ యెత్తిన యెత్తు లొత్తిగిలవే - యింతీ - యటం చా - సురా
రి, కురంగాక్షి ధరాత్మ సంభవ పయిన్ రేకెత్తు రోషమ్మునన్,
వికృతాకారులు రాక్షసీగణమునున్ బ్రేరేచి, యాక్షేపముల్,
వికటా వాచ్యములన్ విదుర్చె, నటుపై - స్వీయేష్ట సంసృష్టినిన్

580. ప్రళయ కాలానల జ్వాల ప్రజ్వరిల్లె
ననగ, ననియె – కైకసి సూనుడంత – గడువు
తీరులోన నా శయ్యపై చేరకున్న
కూచి! మా కటంబకులు నిన్ గోసికోసి –

581. మంచి పిండి వంటగ జేసి, మాకు పొద్దు
టోగిరమ్ముగ వడ్డింతు రో నెలతుక!
నీ హఠము చాలు, సన్యాసినీ – సహనము
న కొక హద్దు కలదు, కలదొక – కడవల!

582. విపరీత ప్రతిభాషలాడితివి తన్వీ! నాకు నీ ధర్మ ప
న్న పరామర్శము నేర్పగా దలచితే! నా పౌరుష ప్రేరితా
తప తీక్ష్ణమ్మును జూతువింక నని యా దైత్యారి – యస్వస్థతన్
గుపితుండై పరిభూత భావమున సంక్షోభించు చిత్తంబునన్

583. మఱియొక మాఱు తానకృశమధ్యల సూటిగ వీక్ష జేయుచున్
గఱకును త్రుళ్ళు నిప్పుకలు కార్చొను చూపుల వాకొనెన్ 'గనుం
డఱగొఱ జూపుచున్న వనితాగ్రణి యీ ననబోడి కింక మీ
రఱిముఱి యెచ్చరించు డసురార్భటి దిక్కుల బిక్కటిల్లగాన్"

584. అన కనుకొలకులలో రా
లిన కణ కణ యగ్గిపూలు లీనంబయ్యెన్–
తన మై పూతల రంజన
మున, నెఱ్ఱని కుసుమ హారముల జిగి లోనన్!

585. ఇంచుక తల యెత్తగ బ్రయత్నించె – సీత,
అశ్రు యవని కాభ్యంతరమందగపడె–
లీల కుంకుమ రజము విలీనమైన
ఫేనిలపుగింజ గుట్ట తానైనవాడు!

586. చూచియు జూడనట్లు కనుచూపుల బర్పుచు జూచె సీత – యా
పాచిత తాల్పు రావణుని పాతభవంతిని చూచినట్లు; వృ
క్షాచిత కృష్ణవస్త్ర చయ కశ్మల కాండము జూచినట్లుగన్,
వాచిక మధ్యమందు నపవాచక వక్రత గాంచినట్లుగాన్!



587. ద్రుమాకులకు పైన దట్టమై ప్రాకినట్టి
కప్పుటిరుల కాటుక పిట్టలప్పళించ,
నడుమ నుండుండి మెఱయు పర్ణంపు మెఱపు
లనగ నసురు కనీనికల్ – కనెను సీత!

588. ఇటు లిరువది బుజమ్ముల భటుడు రెచ్చి
గర్జనముల దర్జనముల గదనుద్రొక్క
నటు – రసాసతీ తనుభవోత్యాగమందు
నొక్క – వైరస్య భావన మూరు తతిని.

589. సన్నివేశమ్మునం దంత సంతరించె–
నొక్క గంభీర సమవస్థ యొక్క స్థాయి;
గాలి కదలిక స్తంభించు కరణి దోచె;
మరు నిముసమందు కదలిక మరల బడియె!

## ధాన్యమాలిని సుప్రలాపము

590. అప్పటి కప్పుడే యచటి కల్లన వచ్చెను తేని ప్రశ్రయం
బొప్పిన ధాన్యమాలిని; యయోగము బూనుచు వచ్చి – భర్తకుం
జెప్ప దొడంగె – బ్రాణసఖ! సీత యిదెందుకు స్వామి – నీకు మే
లొప్పగ నేను లేనె, మనసుండిన దానను, ప్రేమ బంచగన్!

591. అనుభవించు వయసు నిట్లు వ్యర్థపఱచు
నొక్క యవివేకి యీమె, నీకున్న భోగ
భాగ్య చయ మనుభోగించు భాగ్య మీమె
మొగమున లిఖించగాలేదు మొదటివేల్పు!

592. తను మోహించని వనితను
తను మోహించినను తృప్తి దక్కునె స్వామీ!
నిను మోహించిన దానను
నను విని, నన్ననుసరించ నయముల దేల్తున్!

593. మన భాగ్యంబు ఫలించునట్లు సుఖ సంపర్కమ్ము నందింతు నో
ఘన దైత్యాధిప రమ్ము రమ్మికను; చక్కంగూర్తు రాగమ్ము నం
చను - ప్రోయాలగు ధాన్యమాలినికి - యొయ్యన్మీఱ వింతైన న
వ్వును పై వెట్టుచు సాగిపోయె, తనదౌ వ్యూహమ్ముతో, యాతువున్!

594. మిక్కుటంబగు దుర్ధర్ష మెక్కువెట్టి,
టక్కు టక టొంటు లెంతెంతొ యుక్కబెట్టి,
టెక్కు నిక్కుల ములుగఱ్ఱ విక్కుచుండ;
డెక్కగీరి వెనుతిరిగె - రక్కసుండు!

595. నేర్పు కొఱమాలి కొఱవోయె, నీతి రాలె,
పొడవు పొడ వడంగె, నొడిక మొదుపు దప్పె,
కలల పురులెల్ల యుడివోవు, కలత మిగులు,
నెత్తిపై పొద్దు పొడిచె, వీనికి - నిజమ్ము!

596. అని యుర్వీసుత మానసాంబుధికి బాయల్ గట్టు యాలోచనా
ధుని కా - విశ్రుతు, ప్రాణనాయకుని, సాధు స్థూల లక్షున్, యశో
ధను ఖేయమ్ముగ నిల్పి; గుండె దిటవున్ స్థైర్యమ్మునున్ - రెండు తీ
రని యామమ్ములుగా నమర్చుకొనియెన్ బ్రాప్యంబు నూహించుచున్.

## రక్కసి దండు పెఱగాయసుద్దులు

597. పొడము వికారముల్, మఱి, ప్రభుం డిడిపోయిన యాజ్ఞలెల్ల - ద
మ్మడరుచ రాక్షసీ గణ మయాచిత బోధన, సావధానముల్
పుడికెడు బూన్కితో ననిరి - పోటరి రావణు వీరకృత్యముల్
సడి కడ లెల్ల వ్యూహ పరిసంఖ్యల, నెల్ల మెఱుంగు రంగులన్

598. ఎడమిడి నీకు మేలి యెడమిచ్చెను మా ప్రభువంచు, నేర్పు మం
చిడ యిడి చెప్పిరా విభుని యింటికిజేరుము, మన్కి నిల్పు కొ
మ్మడకువ జెందు మంచు, తలయూపును సైతము లేక సీత తా
నెడ బొలివోని నిబ్బరము, నెత్తన గోలల సూపులేయుచున్.



599. విడుమరలేని నచ్చికము వేలుపుగొంగని గొల్చు వీరినిన్
మడియగ జేయలేకను సమస్యల నోర్చుట రామునాజ్ఞ నా
కెడమెడమౌట గాదె యని యెక్కటి యున్కిని, బ్రస్తుత స్థితిన్
దడుముచు గూరుచుండె నట, దా రఘురాముని ప్రేమమూర్తినిన్

600. భావన రామనామ పరిపాలన మందుననే విధేయతో
చ్ఛావచమై తనర్చ; బెలుచన్ మది శాంతి దలిర్ప; దీవ్ర శో
కావిల వృత్తి కింక సమయంబు విదుర్చె - ధరాతనూజ- స
ద్భావము కొల్వుదీర్చ మది, దైవము కార్య ముఖంబు నేర్వగన్

601. దైత్యవరిష్ఠు నాజ్ఞలను తప్పక పాలన జేయు రాక్షసీ
భృత్య సమూహముల్ పరుషభాషణ పంక్తుల గూర్చి కూర్చి, తా
మత్యధికాభివర్ణనములం దసురాధిపు డంబు నింపి - త
త్ప్రత్యయితున్ వరించుమని తద్దయు వేమఱు నూఱిపోయుచున్

602. ముప్పది యైదు కోట్ల సురమోహరమున్ విదిలించి గెల్చె; దా
నొప్పున వారి నాయకుని యుప్పరమంటు విచారధారలో
జప్పున ముంచె - మా దనుజ శాసకదక్షుడు; వాని కీడు యే
యప్పయు, నీదు యప్ప యనువౌనె తలోదరి! పట్టు వీడుమా!

603. బ్రహ్మ మానసపుత్రుడై ప్రథితిగన్న
యా పులస్త్య తేజస్వంతు నంత వాని
కీ వర బలుదు పౌత్రుడో - యింతి - వినుము
ప్రజవి - రావణుండొక మహర్జాతకుండు!

604. రాజులకు రాజు - మారాజు - రావణుండు,
పంచభూతమ్ములను ముట్టడించి, కట్టి,
కట్టడముజేసె తనముందు - జెట్టిగాదె?
బుద్ధి నిల్పుము, సుఖము సమృద్ధికొనుము!

605. అనుచు వివిధ రీతుల చెప్పి వినిచి రకట-
ఏకజట, హరిజట, వికటేమి - వినత
ప్రఘన, చండోదరి మఱియు ప్రముఖ రాక్ష
సీ గణము సామదానాది జిత్తులెత్తి!

606. కొందఱు దైత్య భామినులు కోటికి మించు విశేషసంపదల్
పొందుమటన్న యాశలను ప్రోవులు వెట్టగ సీత ముందునన్;
గొందఱు రక్కసీంద్రు తమ కోణతనమ్మున మెచ్చుకోలు క
న్నుందొవ దన్ప జేసి విభు నూల్కొను మంచును హెచ్చరించగన్

607. కొందఱు క్రూరత జేకొని
సుందరి జానకి దరికొని సుఱసుఱ చూపుల్
క్రందు కొనగ – దుర్భాషల
విందిడి పై పైకి దుముకి పీడించ జనన్,

608. వరధను రావణాసురుని ప్రస్తుతులందున ముంచి తేల్చుచున్,
ధరణిజ ముందు నిల్చినను, దల్లడ మందని యామెగాంచి, యా
యరిగణరాక్షసుల్ సహన మన్నది చాలును, దండనమ్ము కే
సరియగు నీమె యంచు, దమ జాతర జూపగ బోవు నంతలోన్

## త్రిజట స్వప్న వృత్తాంతము

609. పగ, విద్వేషము వెళ్ళగ్రక్కి, యసుర ప్రాబల్యదాక్ష్యమ్ము, జ
డ్డిగముల్ సూపుచు, వేయి కఱ్ఱలుగ వాటిన్ సీతపై మోదగా,
దగునే మీకిది పాడిగా దవనిజాతన్ వీడి పొండంచు, గు
ఱ్ఱుగ వారింగని వాకొనెన్ ద్రిజట, యక్రూరాసితాదేశమై.

610. ఏమని చెప్పుదాన పరమేశు వరంబుల గర్వియయ్యె, ను
ద్దామత ధర్మవర్తనము దప్పెను క్రుద్ధుడు తా విధీరితం
బేమియు నేర్వలేక యిటు లీసతి సీత, సతీలలామనే –
కామమయ ప్రవృత్తి తొనుకన్ జెఱపట్టె, ఫలంబు జూడుడీ

611. సంకులమైన జ్యాని తనుసత్రము నందున తిష్ఠ వేసినన్,
లంకకు పెద్ద దిక్కునని లక్ష్యము సేతురు నాదుమాట, యీ
లంకయు, లంకలోని ప్రజలందఱి సౌఖ్యము గోరుదాన; యే
సంకట మోర్చలేనిక, ప్రసన్నముగా విని యాదరింపుడీ!



612. కనులారంగను గంటి నొక్క కల – లంకా నాశమున్; రామ భా
గ్య నిరూఢత్వము గడ్డకెక్కెనట – దృశ్యాలేఖ్యమై నిల్చుచున్;
దన తమ్ముండగు లక్ష్మణున్ గలసి శాంతాకారుడై రాముడ
ల్లన యేతెంచుచు నున్న వాడదియె శుక్లాచ్ఛాదనాలంకృతిన్

613. వేయి రాయంచ లింపుగ మోయుచున్న
యొక్క తెలిమబ్బు గుమి యన జక్కనైన
జీవ దంతంపు పల్లకీ చెక్కులందు
తన తెలి నగవు జెక్కుచు దరలివచ్చె

614. లంకపై విహరించి, మొల్ల మగువేడ్క
లుల్లసిల్ల – శాంత పయోధి యొడలి పైన
నచ్చపుం గిరితి నలది యాదరించి,
లంకలో దిగినారు, యుల్లాస మలర!

615. అప్పటి కప్పుడా జనకునాత్మజ స్వచ్ఛ దుకూల ధారియై,
విప్పిన పూల పొట్లమయి, విశ్రుతుడా రఘురాము తోడ సొం
పొప్పెడు నీటికుప్ప దరినున్న సితాద్రి పయిన్ విహార మం
దొప్పుల నారబోసె, మది యుబ్బట లూగ శుభావహంబుగన్

616. నాలుగు దంతముల్ నెఱిన నాటిన, మేరువు మించు నాగమున్
బోలిన నాగముంబయిని, పోణిమి మై, జగతీడ్యమైన మే
ఘాలయ గోపురంబు గతి – గంజ దళాయత నేత్రు లిర్వురున్
లీలగ వచ్చినారు – తరళేక్షణ జానకి దాపుకు రామలక్ష్మణుల్

617. కన్నుల – బందు వెన్నెలలు కాంతిల జానకి – భర్తృ సన్నిధిన్
మన్నన మెట్ల నెక్కె, ప్రియమై రఘురాముడు కేలుబూని య
భ్యున్నత ధర్మ సౌభగమనుద్యుతిను న్నమితంబు జేసె – దా
నున్న మదావళమ్ము పయికోజను దెచ్చుచు, నవ్వులిచ్చుచున్

618. ఉల్లసనంబు లొత్తువడ, నూకువ నిల్పి ధరాతనూజ, తా
నల్లన సూర్య చంద్రుల నొయారముగా నదె, యంద బోవుచున్,
వల్లభురాము మోము పయి వారలె నిల్వగ సత్కరింపుమై
సల్లలితంబుగా ద్యుమణి, జంద్రుని, జేతుల నప్పళించగాన్

619. ప్రక్రమ క్రమ ప్రకరణ ప్రక్రియగొనె,
మన క్రతుధ్వంసి ప్రకృతి క్రమణమున కొక
మలుపు సూపుచు నాటాడు మగువ – సీత
సరణి జూచితి – విశదిత స్వప్నమందు!

620. రామస్వామియు ధారణీ సుత, సుమిత్రాసూను డావేళకున్
సామంజస్యము, నౌచితీ గతియు బ్రచ్ఛాదించిరప్పట్టునన్,
ప్రామాణ్య ప్రసర ప్రవీణకృత జీవద్భాషలో శ్లేషయై
యోమన్, లంకకు రాదొడంగి, రది నేనుత్సాహినై చూచితిన్

621. స్వప్నావస్థకు జుక్కబెట్టి, యిక విశ్రామమ్ము యత్నించినన్,
స్వప్న శ్రేణి మరల్చలేక వరసోపానమ్ము లెక్కించితిన్
స్వప్నాసాద్య శుభంకరాశ్రవము దృశ్యాదృశ్య సంబంధి గా
స్వప్నేంద్రాయుధమై రహిన్ విరిసె నాస్వాంతాంతరిక్షమ్ముపై

622. అటుపై కాంచితి నొక్కమారు రఘువంశాంభోధి చంద్రుండు, ప్రా
కట వైభోగము లుల్లసిల్లు శుభ సంజ్ఞల్ సూపు చున్నట్లు – తా
నటుగా వచ్చెను – పాండురర్షముల విన్యాసమ్ము చెన్నొందు చౌ
క్కటపుం దేరున; సోదరుండు, సతి రాగా – దోడుగా – లంకకున్

623. ఆ వెనువెంట వేఱొక మహాద్భుత చిత్రముగూడ కాంచితిన్
లావు దనర్చు నెన్మిది లలామము లోలిని బూన్చినట్టి శో
భావహ చంకరమ్ము పయి నాలును, దమ్ముడు దోడురాగ నా
కేవలుడైన రాము డరిగెన్ మన లంకకు దివ్య కాంతితోన్

624. అంత, నలంక్రియా విలసనానుగమంబు బొనర్చు పుష్ప కా
భ్యంతర మందిరమ్మునకు నధ్వగసన్నిభు డా రఘూత్తముం
డంతటి కంత తేజము పరావృత మౌగతి బోత పోయుచు,
న్నింతిని గూడి తేరుపయి యేగె – మహత్తర ముత్తరాశకున్



625. ఓహెూహెూయనిపించు తేజమును, సద్యోగంబె యుద్యోగమై
సౌహార్ద స్పృహ బ్రోది సేయగల విశ్వస్తుత్య సత్త్వమ్ము, ను
త్సాహాంకమ్ము రఘూద్వహున్ వదన సంస్థానమ్ముపై దోచె, నా
మాహాత్మ్యమ్మదియేమి చెప్పుదు జగన్మాన్యుండు సామాన్యుడే!

626. రామచంద్రుని గంటి, విక్రాంతి గంటి
భావి భాగ్యము గంటి, సంభావ్య మంటి,
నింటి కేగెద నంచు మిన్నింటి దొరయు –
నసురకృత్య మహ్వానించి మసల, గంటి!

627. నూనెలో మున్గి తేలిన వాని, నెఱ్ఱ
సేల దాల్చి గన్నేరు పూమాల లుంచి,
నూనె ద్రావుచు మత్తుడై హీన గతిని
నేలపై దొర్లు రావణు – నేను గంటి!

628. తెఱపిలేక మరుక్షణ మఱుతగంటి,
నదిగొ రావణు పతనమ్ము; కదలు – రాక
పోక సందడి మధ్యగా పుష్పకమ్ము
జారె – తలపుల దండడి సంభ్రమించ;

629. కంటి కృష్ణాంబరుని, కనుగొంటి నతని –
ముండితుండయి, యఱ్ఱాక నుండియుండి,
ముదితచే నీడ్వబడుచున్న మొదలి జేజె;
దిత్య నాథు నికృష్ట వృత్తి ఫల మదియె!

630. ధూసరాధిరోహుడయిన దోసకారి –
దక్షిణాశకు వేవేగ దరలు చుండ
మార్గమధ్యంబున సడలి, మలకబడియె,
బడెను, తలక్రిందులుగా నేల బడియె తులువ!

631. తత్తరము, భయ భ్రాంతుల దడియ బడియె
శీఘ్రమే లేచి దీనుడై చిన్నబోయె,
నంతలో మద వ్యాకులుండయ్యె, లేచి,
దుస్సహంబైన దుర్వాక్య ధూళి విసరె

632. నగ్నుడై ప్రలాపముల, నున్మత్తుడయ్యె,
నొక గణాచార్య నృత్తమ్ము నుపచరించె,
తందనమ్మాడి, యంతలో దగులుకొనియె–
నరక సన్నిభమైనట్టి యిరుల ఊబి!

633. కలగలుపు చిత్తరువువోలె గానుపించె
ఘోర దుస్సహదుర్గంధ పూరితంబు
నైన మల పంక కూపమ్ము, దానిలోన
బడియె, దిగబడె, మునిగె, రావణుడు, ఖలుడు!

634. టేకు దుంగ కేర్పడిన ముడి నెటునుండి
యెంతగా రాచి అంపాన నిమిడిక నిడి
తృప్తి బడిన, నడిమి పొడ దీసివేయ
దరము గాదన్న వాస్తవ – మిరవుకొనియె!

635. మాయలోనుండి వచ్చిన మాయదారి
మాయలో మున్గి, తేలుచు, మధ్యమధ్య
మత్తు మదుగుల చిదుగుల – మఱల మఱల
నాడి, మత్తిలి నట్లయ్యె – నసురు జూడ!

636. భీకరమ్ము, బీభత్సమ్ము, భీమమైన
భామ – రక్తవాసిని – కాళి, పంకలిప్త,
యుఱిది రావణు కంఠాని కురి బిగించి
జము దెసకు నీడ్చు కొని పోవు జడ్డ గంటి!

637. కునుకు పట్టని ఱెప్పలు కుదుల, వాటి
పైన యనుమాన భారము; లోన – వాస్త
వమ్ములో చలియించు – దృశ్యమ్ము దడవె;
తాత యరచేతి చఱపది, యేతు సూపె!

638. మన దశగ్రీవుడు కిటిపై మఱియు నింద్ర
జిత్తు మకరమ్ము మీద, దాసేరుకమ్ము
పైన మన కుంభకర్ణుండు – పయనమైరి
యామి వైపుకు గదలి రభ్యక్త గతిని!



639. రాక్షస సమూహము మఱియు రాక్షసేంద్రు
సుతులు బోడులై, నూనె పూసుకొని యుండి
రెఱ్ఱగన్నేరు మాలల, నెఱ్ఱ వలువ
లెన్నొ దాలిచి పదచాళి నున్న వారు!

640. సన్నివేశమ్ము, సందర్భ సరణి జూడ
నుంకు – కప్పల తక్కెడ కుద్దియగును
రక్కసుల తిరుగుడులు, జైతక్కలెల్ల
గంటి, కలబందమీది యీగపులులట్లు!

641. స్ఫీతోత్సాహము తోడ నా పయిని వీక్షించంగ నాకా యెడన్
శ్వేతచ్ఛత్రము, శ్వేతవస్త్ర చయమున్, స్మేరానన ప్రోదియున్,
శ్వేతక్షేపము, శుక్ల పుష్ప సరముల్, చిత్సౌఖ్య సంశ్లిష్టమై
ఖ్యాతిన్ మీఱిన రూపు తెల్లమయె –సత్యస్ఫూర్తి నిండారగన్

642. అతడు విభీషణుండు – విహితాంజలియున్, సుజనాశ్రయుం డలం
కృతుడు – త్రిరేఖ దుందుభుల గీతిక లేర్చెడు నృత్త నాట్యముల్
వితత ఫలోదయాప్తి, నలి వెల్లిని దేల్చగ – నల్వురైన వ్యా
పృతులనుకూలురై నడువ, ప్రీతిని భద్రగజమ్ము పై జనెన్

643. గంజాయి చేనిలో కలిసి పెరిగినను
విలువగా నిల్చిన తులసి వోలె
మినుముల ప్రోవు మధ్యన కలగలసినన్
గెడగెంటి నిలు కందిగింజ పగిది
దండుగమారి వదంతులకు నడిమి
తానై నిలుచు కింవదంతి వోలె
కుకవి పద్యంబులో కూడక పొరపడి
జేరిన యొక్క యోంకారమట్లు
పటిక పలుకుల కలిసిన పటిక బెల్ల
మట్లు, ప్రారబ్ధ ఫలమున నసురుడయ్యె,
తన కులంబులో తానుగా దప్పబుట్టె,
శ్లేష సంభాషణుండు – విభీషణుండు!

644. ఆ పై గంటిని, కంటి – ఘోరము మహొగ్ర్యంబైన – లంకాపురీ
యాపాతమ్మును – గోపురంబులును, శిల్పాన్వీత నిర్మాణముల్,
మాతంగంబులు, ఘోటకంబులును, గుమ్మంబుల్ పథశ్రేణు లెం
తో తీవ్రంబుగ సాగరంబునను తోడ్తోగూలుటన్ గాంచితిన్

645. శ్రీ సమృద్ధము, సుజన భూషితము, వీర
యోధ విలసితము, కమనీయోజ్వల కథ
వంటి దర్శనీయ నగర ప్రాభవమ్ము–
పోయి పోయి వార్ధి మునిగిపోయె నకట!

646. సుందరమైన లంక, వరశోభితమైనది లంక, రావణా
నందిత నంద లంక, మన నాయకు లందఱిచేత రక్షణం
బొందు మహాపురమ్ము – నెఱి, పొడిమి లెల్లను నగ్ని కాహుతిన్
జెందగ జేయుచుండె నొక క్ష్వింకము; కాంచితి నట్టి రట్టడిన్.

647. చిత్రమె చిత్రమైనదది, చెల్వము లన్నియు బూది పాలయెన్,
చైత్రరథమ్ము బోలిన విశాల వనంబుల మాతరిశ్వ – స
న్మిత్రుడు తీవరించి కడిమిన్ సరిపుచ్చెను, రామచంద్రు దు
ర్మిత్రుడు రావణాసురు బ్రమేయము సూచన లెల్ల జూచితిన్

648. వరుసగ జూచితే నసురభామలు – కైపున దప్ప ద్రావియున్,
బరుసపు మాటలం బలికి, ప్రల్లదముల్ వచియించి మించి, భీ
కరమగు నృత్త గీతికల గానము, నాట్యము లాడియాడి, యే
సరణియు సారముం గనని చాలున వర్తిలుచుండ వింతగన్!

649. ఏ పోగాలమొ దాపురించనిది యీ యీ రీతి నవ్యస్తపుం
గోప ద్వేష యపాకృతానుచరితాక్రోశంబు లేలా? మహా
పాపాత్ముల్ యమరాట్టు కౌగిలిని నాహ్వానించుచున్నారు – తా
మే – పోకన్ గ్రథియించి రాసుర బలమ్మే మేటిలన్, మేద్పడన్!



### త్రిజట అమృషోక్తులు

650. ఉన్నటులుండి యా త్రిజట – యూర్పుల యూపున లేచె రోషయై,
కన్నుల నిప్పుకల్ దొరల – గర్బురు కాంతల బ్రక్కనెట్టి – తా
నెన్ని వచించె నిట్లు 'విను – డింతుల యందున మేలుబంతి, రా
మన్నకు కూర్చు నెచ్చెలి, సమాగత నిర్మల కీర్తి చంద్రికన్–

651. మన్నన జేయుటే తగిన మార్గము, సద్గుణధాము దాత దా
పన్న శరణ్యుడంద్రు, మన వర్తన సైపకబోడు – రాముడా
యన్నయు నీమెయున్ సుముఖులౌ గతి గోరుట మేలు, రండు, పే
రన్నున జెప్పగా సమభిహారము తప్పదు; సీత వేడుడీ!

652. విధి బలీయము; తథ్యము – విధికృతమ్ము,
కల నిజ మగునొ కాదొ, ఏకారణంబొ–
యొక్క యవకాశమన్నది యిక్కడుండె;
ననుడు నుతులు, నతులు, స్తుతు లవనిసుతకు!

653. సీత అతిలోక పూజ్యప్రపూత – మాత,
సీత అతిలోక సద్గుణోపేత – మాత,
సీత అతిపథానుగమ వినీత – మాత,
సీత అతి పథానుగ్రహాన్వీత – మాత!

654. ఈ యమ జూడుడోయి దనుజేందు నిభాస్యగణంబ! ధర్మ సా
రాయతనమ్ము కాదొకొ? మహార్య పరిస్థితి భూరిభారమే
ఆయతమై త్వదీయ ముఖమందలి చాయను నొక్క చెన్నునున్
బాయగ జేసెగాని – సతి భాతిని, రీతిని, నీతి – దాకెనే!

655. మన యదృష్టము దృష్టమై మైథిలి యయి,
మన వనమునకు జేరె సమర్థురాలు,
మన నమస్కార శతము ప్రమదము దెచ్చు,
మన వియుక్తి తెఱంగగు మగువలార!

656. తొలగి పోదము రండిక వలదు – జాగు,
స్థితి – యనావృష్టి; పైరుకు సేయవలయు
సేవయేమియు లేదు; నిశ్చింత రండు,
చెమ్మ లురలెడు నారు – యీ యమ్మబలము!

657. అన వనవాసానువ్రత,
జనకాధీశాభిజాత, జగతీ జాతన్,
జననుత గుణ సముపేతను,
వినతిని, సీత విడి, చనిరి – ఫేరవ వనితల్

**సీత వ్యాకులత : తదనంతర శుభ శకునములు**

**మత్తకోకిల**

658. రాక్షసీగణ దూషణంబుల రంగమే కనుపించగా
రాక్షసేంద్రుని వాక్య ధూళి – ధరాజ దుఃఖిత మానసా
ధ్యక్షమై వడి గాననయ్యె సురారి భీకర రూపమే!
రక్షణంబిక యేది నాకని, లావు దుఃఖము నిండగాన్

659. తల్లి ముందర వెక్కుల దల్లడిల్లు
బిడ్డ పోలిక, నెదుటి యభిచరుల కపు
డేదియో తన దుఃఖమ్ము నింత యింత
పంచు బేల పగిది సీత – పలవరించె!

660. తనకు దానుగా చెప్పుకోమనెను మనసు,
గుండె బరువింత తగ్గించుకోమనె, హృది,
నిర్జన వనాంతర విసృష్ట నిసువువోలె–
నేలపట్టి శోకించె కల్లోల గతిని!

661. తలపులు కోసలాధిపు సుతన్ బేనవేయ నుతించె "దైవ దు
ర్విలసితమమ్మ దీని నెదిరించుట శక్యమె కానిదత్త! యీ
తులువల ద్రుంచ – మీదు ధృతిధూర్వహతాగుణశాలురౌ – కుమా
రుల నిట కంపి కావుమ – యరుల్ నను జంపక మున్నె యమ్మరో!



662. నను మీ కన్నకొమరి క
న్నను మిన్నగజూచి, సాకిన సతీ – మీక
న్నను నా కన్నఱ గన గ
ల్గిన వారెవరమ్మ – కాచు – క్రియ గొనుమింకన్!

663. వచ్చీ పోయెడి యతిథిగ
వచ్చెనె నా కత్తయింటి స్వస్తితులున్,
మెచ్చులు? కాదను నమ్మక
మిచ్చి మనుపు మమ్మ, ప్రాజ్ఞ! యీ తరుణమునన్!

664. ఏమయ్యా – మఱదీ, స్థిత ప్రతిభ యోగీశుంబలెన్నుంటివే
ఏమీ మౌనము? జ్యేష్ఠుకుం దగిన వా డీతండొకం డన్నదే
నీమంబంచు దలంచితే? తగదె యన్వీక్షాధ్వ చాతుర్యముల్,
క్షేమశ్రేయము గూర్చ? నా కలతలన్ జీల్పంగ యోచింపుమీ!

665. శ్రీయుత మూర్తి! యీ చెఱను, జీకటి బాపగ రమ్ము స్వామి! ప్రా
జ్ఞాయతి మేర మీఱిన మహాశయ! రాఘవ! కీర్తిమంత ! ప
ద్మాయత నేత్ర! యుక్తమగు యత్నము నీవుగ జేయగావలెన్,
నాయెద చిట్లిపోయినది, నమ్మకమన్నది బీటవారెడిన్!

666. స్వామీ – నా యీ బాధా
ధూమము గనలేవె? కరుణతో రావే! బా
హామదవృత్తుల– మీ ప్రో
ద్దామ బలంబది తొలుక, మదమడచి త్రోచన్!

667. ఏకపత్నీత్వమది వ్యర్థ శాకమౌనె?
ధర్మవర్తనమ్మది పరితాప హేతు
వౌనె? నీవేడ నుంటివో – ప్రమాను మాకు
బట్టి యుంటివో? తెలియదు ప్రాణనాథ!

668. భావము రామ నామమయ భావన చేయుచు నాత్మహత్యతో
బోవుదు, నుండనేల – యొక పుల్లుడి చందము? కాలకూటమున్
ద్రావి, కరాసి గ్రుమ్ముకొని ప్రాణము తీసికొనంగ బూనినన్
లేవవి – యందు బాటున, ఫలించు విధానము పాశబంధమే!

669. అని దృఢ చిత్తము తోడ - న
వనిజ తనదు దీర్ఘ కేశ పాశంబునె, దా
మనిగా పనిగొని కంఠం
బున కురి బిగియించుకొనెదు పూనిక నిలువన్,

670. వామలోచన మదిరెను, వామ భుజము,
వామ ఊరువు నదిరెను - రామవిభుడె
తన యెదుట నిల్చినట్లయ్యె - దత్తఱిల్లె,
తెలిసి తెలియని వివశత తిమ్మపడియె!

671. కన రజోధ్వస్త వస్త్రమ్ము తని సడలెను,
సుంత, రవ్వంత జారెను; సుందరాంగి
కమ్మ తెమ్మెర తాకిన రెమ్మయయ్యె-
ఇన్ని రాయిడిల నడుమ నింతమార్పు!

672. కొన్ని శుభ సూచనలిటుల గోచరించ
నవియు - బుట్టనిండిన పూలె యవగ - సీత
మనము చినుకు పైబడిన విత్తనమె యయ్యె,
గాలి లీలగా సన్నని యీలవేసె!

673. శోకమది సన్నగిల్లెను, వీకనిండె,
గుండెలో నొక్క పొదలిక కులుకు గులికె,
తన శరీరమ్ములో క్రొత్త త్రాణ జేరె
నన్న బలము కలిగెను - రామన్న సతికి!

674. వచ్చును మంచిరోజు, సమవాయమునౌ కల - వాస్తవమ్ము కా
వచ్చును, మంచియే జరుగవచ్చును, ధీరుడు రామమూర్తి రా
వచ్చును, స్వస్తి వార్త వినవచ్చునటంచు దలంచ నెవ్వరో
వచ్చినయట్లు - తోచె నట, పంటవలంతికొమార్తె కంతటన్



**వాస్తవ స్పష్టత - హనుమ మృదువచనములు - మాటల కలబోత**

675. క్రాంతి దర్శి, కపివరుదు, కార్యదర్శి
వినెను - సీతావిలాపమ్ము; వినెను - త్రిజట
కలయు, వృత్తాంతమదియు, రాక్షసుల తర్జ
న శతము వినెను; జనక నందనను గనెను!

676. శుక్లపక్ష శశాంక శోభ లీనెడు ముఖ
కల్హార సీమను గనెను హనుమ,
రామ కార్యోచిత క్రమ వర్తనం బేది
యని దీర్ఘ దృష్టి యోచనలు సేసె
ధర్మార్థ హితము, సత్యమ్మునౌ భాషణన్
మాత యనుమతి సమాశ్రయింతు
ననుకొని, కొమ్మలందున దాగి, గొంతెత్తి,
దశరథక్షితినాధు యశము బల్కె,
తన వచస్సుల తేనెలూర ననె - 'రవి కు
లాధిపుడు, సత్యసంధుడా, యయ్య యాన-
భార్య వెన్నంట, సౌమిత్రి పజ్జజేర,
నటవి జేరెను - రాక్షస పటలి నణచ'

677. అటుపయి, భూమి పుత్రియు - శుభాసితగాథ కుపాహృతాత్మయై
యటునిటు చూచుచుండ - విహితాంజలియై, జనకాత్మజాత కు
న్నటుపయి సాగి నట్టి కథ నంతయు జెప్ప, కృతార్థతన్ గొనన్
బటుతర భక్తి యుక్తుడయి వాకొన సాగెను - పావమానియున్

678. సీతాపహరణమ్ము; శ్రితవత్సలత్వమ్ము
కతన సుగ్రీవు రక్షణము వినిచి,
విపులా తనూజ యన్వేషణ, మృగచర
వీరుల యత్నంపు వివరమిచ్చి,
సంపాతి చేసిన సంకేతముం బూని
యేతెంచినట్టి యా హేతువిచ్చి,

బుద్ధి సుష్ఠుత్వము పొరసియున్న దటంచు
తననె యీవైపు పంపిన గతినిడి,
సకల మెఱిగించిన వరకీశమును గాంచె
సీత; యనుమాన, సందేహ, చింతలెల్ల-
రావణుని మాయ చుట్టు సరసర దిరిగె,
దాని గమనించి యనె - బవమానసుతుడు

679. మేని శుభాంక సమితి వినిపించెద-
రామచంద్రుడనగ ప్రాగ్రసరుడు;
వేదవేదాంగ సద్విదుడు, తరణి సమ
తేజస్వి, విక్రమ ధీరవరుడు,
సుర గురువు పురుడు, శుభ్ర సత్య మధుర
వాక్పతి; రూప సౌభాగ్యవంతు,
డాత్మీయ రక్షకుం, డఖిల జన హితుండు,
శ్రీరాము డమ్మరో - శీల ధనుడు;
రామభద్రుండు - నీవాడు - శ్యామ వర్ణు
డమ్మ, సమ విభక్తములు సర్వావయవము
లమ్మ; శాస్త్రోక్త శుభలక్షణాన్వితమ్ము
దేహ సౌభాగ్యమమ్మ - సందేహమేల!

680. ఆతడొక మహాబాహువో యవనిజాత,
విపుల భుజుడు; కంబు గ్రీవ విస్మరుండు
గూఢ జత్రువు, తామ్రాక్ష కోమలుండు,
దుందుభి ధ్వానగళుడు, సంతోషదాత!

681. హోమ కాంతి ద్యుతియుతుడు హొంతకారి-
లక్ష్మణుడు, సోదరుడు - శుభ లక్షణుండు,
భ్రాతృభక్తికి రూపంబు వరల జేసె
వాని సాటికి వాడైన వాడు నిజము!



682. నమ్మిన బంటునమ్మ, రఘునాయకు దూతగ వచ్చినాడ, నన్
నమ్ముము తల్లి! ధాత్రిసుత! నాథుడు తా గుశలంబు నుండె నా
తమ్ముని గూడి, ధైర్యమును దండిగ గుండెల నింపి బంపె - మీ
యమ్మను జూచిరమ్మని; మహాశయ సాధన గోరి వచ్చితిన్!

683. సుగ్రీవుండను రాజు మా ప్రభువు, దక్షుండమ్మ! యిక్ష్వాకు వం
శాగ్రీయుండగు రామచంద్రునికి, కీశాధ్యక్షుకున్ గష్ట మ
త్యుగ్రంబై కడలొత్తె నొక్కపరి, యుద్యోగంబుగామారె దత్
జాగ్రత్ప్రజ్ఞ తలంపు, నిర్ణయము నా సామర్థ్యమన్నారటన్.

684. అను భావంబుల విన్న సీతకు భవిష్యంబింక బొల్పారు నం
చనిపించెన్, శుభయోగ ప్రస్తవము బ్రహ్మానంద మందించె, మో
మును పైకెత్తుచు శింశుపాతరువుపై ముయ్యాకులన్, గొమ్మలన్
గనె దీప్తాంశసమున్, మహామహుని, సత్కార్యాధికారిన్, గపిన్.

685. ఫుల్లాశోకోత్కర శో
భోల్లసితు, మహావినీతు, నుత్తము, ప్రియ వా
క్యోల్లేఖా వాదిని, గపి
వల్లభు గాంచెను - ధరణిజ, భవికము కలనన్.

686. వరసతి సీతగూర్చి మునివంద్యుడు, రాఘవు డేమి జెప్పె, నా
పరమ పవిత్రమూర్తి వరవర్ణిని నామె యథాతథంబు గా
కరమరుదైన రీతి నిట గంటి నటంచు - కపీశు డెంతయున్
మురియుచు, మౌన సంగమున మున్గెను, మున్గెను సంబరమ్మునన్

687. క్షణములు కొన్ని పోవగ బ్రకంపన సూనుడు - మోర, మోము - వీ
క్షణముల కామ్యతా ఘనత గ్రాల, నెదో సుఖ పారవశ్య - ర
క్షణమున మానసం బుఱిది కందువ చోటికి జేర, రామ - శి
క్షణము దలంచి సీతగనె; గాంతయు బావని జూచె దృష్టిగన్

688. అమృతాసేచనమైన యట్లు కపిలోకాత్మీయుడున్, సీత - తా
మమలానందము నందినారు, కపి తా మౌలిస్వజాపత్తికిన్
గుమిలెన్, నవ్వులజూపె, తగ్గె, నట దూకుల్ దూకె; సీతమ్మ చి
త్రము చిత్రంబుగ జూచె, లీలగనె - నధ్యాయమ్ములో గాథగన్

689. అరయగ సాధితార్థులయి రమ్మయు, మర్కట మూర్తియుం - బర
స్వరము గతంబునన్ గనలిపండిన సంఘటనాదుల, ధర్మచర్యలన్-
బొరలుగ విప్పుకొంచు, కలబోతల పల్కుల నూఅడిల్లుచున్,
నిరతిని గొంచు, నంతటనె నిశ్వసనమ్ములు వట్టి పోవుచున్

690. బాష్ప గద్గద కంఠులై - పారదర్శ
కమ్ము, వాస్తవ స్ఫటికమ్ము గనిరి, కనిరి
మేలు విశ్వాస తరగల మెఱపులెల్ల
నిలువు నిలువెల్ల నిండిన నిగ్గులయ్యె!

691. గతమున జరిగినట్టి సంఘటనలన్ని
రసనల బొదలి, పొదవెట్టె ససిని, బలిసి;
యంత హనుమంతు డొక పులకింత మునిగె;
దటిసి, నర్తించి, వర్తించి, మఱచె నొడలు!

692. నర్తన లౌల్యము దొరలగ
వర్తనమున రాఘవేశు ప్రార్థన - బదసం
కీర్తన మిళితము జేసి, ము
హూర్త శుభము వరల నిట్లనూనము ననియెన్.

693. ఎవ్వ డయోధ్యకే వరమొ, యెవ్వడు స్థైర్య లతాలవాలమో,
యెవ్వడు విశ్వయోగమున కెత్తిన కీర్తి పతాకమౌను, యిం
కెవ్వడు జ్యోతి ధర్మమున; కెవ్వడు నీతిని మ్రోయు మువ్వ - యా
దివ్వెల దివ్వె, మా సుగుణ దీప్తుల ప్రోవు, రఘూద్వహుండెగా!

694. రాముడాలాపన, రాముడే పల్లవి,
యనుపల్లవి, చరణ మత డనంగ,
ఫణితిలో, గళములో, భావమ్ములోన శ్రీ
రామ రాగాబ్ధిజా రసము గ్రాల,
నణువు ప్రత్యణువు తన్మయత చెమర్చి కన్
దమ్ములంచుల కంపి తమక పడగ,



తన యుసుఱులుసులు తన స్వామి కోసమే,
కదళిగా మార్చు సంగతిని దెలుప,
చతురు దధు లొక్కమారుగ నతి చతురత
బుక్కిలించ గలుగు సత్తి - చక్కనైన
మోర - యెత్తి చూపుచు నుండు మోద ముద్ర
తనర, జానకి కగుపించె - వనచరుండు!

695. సందియము నెదతీసి నిశ్వసన మిడగ
విస్మయము యెద నిండె నా వింత వలన,
కాయమా - యది - యొక మహాకాయ మహహ,
కీశమా - కాదు - నిక్కమనాశు డితడు!

696. ఎంతటి పెత్తనంబు వహియించెను వానర వీరుడెక్కటిన్-
సుంతయు ముక్కవోని తన సుందర దేహపునిగ్గు నిక్కుపై,
యెంతటి రూపదర్శన, మిదెంతటి యద్భుత భాగధేయ మెం
తెంతలు నోము నోచి రితనిన్ గన, దల్లియు, దండ్రియున్నెటిన్!

697. అని యిటు సీత యచ్చెరువునం దభిమానము రంగరించి, భా
వనలను మెత్తుచుండ, నటు వానర ధూర్జటి - సీత వీక్ష్యమా
న నయన రేఖలం దొరలు నవ్య కృపారస ధార మున్గి, పొం
గెను - సుమనో ప్రతుష్ట పులకీకృత మూర్తిగ, ధన్యతాస్పృహన్

698. మతి మంతుం డనుమడు - సం
గతి, ధృతి, వినయంబు, మెండు కడుకొను మదితో,
కృత పుణ్యము గీల్కొనగన్
బ్రతిఫలన ఫలము దనరె - విభవ సారమునన్.

699. క్షణముల చిక్కులుం బ్రిదిలి సమ్ముఖమందున రాలగా, సమీ
రణ సుతు డాత్మ విప్పుచు ధరాసుత తోడ వచించె నీ విధిన్,
"ప్రణతులు కొల్లలమ్మ! రఘురామ పరిస్థితి జెప్పువాడ, నో
గుణమణి - జానకీ! కనుము - కొండను గప్పిన మబ్బుగుంపులన్!

700. తల్లీ నిన్నుదలంచి రాఘవుడు – సేతల్, మాట లాలాపనల్,
సల్లాపంబులు, సర్వవర్తనము, నుచ్ఛ్వాసంబులున్ – నీవెగా
బెల్లైవేదన గ్రుంగియుండె, త్రిజగ ద్విశ్వేశుడౌ స్వామి – యా
వాల్లభ్యమ్మున కెన్నియెన్ని యిడుమల్ వాటిల్లెనో యమ్మరో!

701. కల్లోలాశ్రు పయోధి నీదు; రసరాగారాధనే యాశగా,
ఫుల్లాబ్జాక్షి మహీజ యేదియను, సంభూతార్తి వర్ణించి, వ
ర్థిల్లం జేయు, క్షణంబులో బ్రతిత డాదిత్య ప్రభాభాసురుం
డిల్లాలేదని మమ్ము జూచు, యడుగు న్నెనెట్లు వర్ణించెదన్.

702. చల్లగాలి తెర నీ స్పర్శమ్ముగా దోప,
హాయిగా యూర్పిడి హర్షమొందు,
నట పక్షి మిథునము నరసి, నీ తలపులో
మునుగు, హసించు సమ్ముదమునొందు,
జుక్కపూవుల గాంచి, సుదతి హాసమ్మని
మనసార గ్రహియించి మంపునొందు,
సాగిపోయెడు మబ్బు జానకి జేరునే
యని యేమొ చెప్పుచు గొణగుకొనును,
పూల మొక్కల వెదకు నిను బూవుబోణి,
బంభరపు గుమి భ్రమియించు భ్రమరవేణి,
లేడిగుంపు నన్వేషించు లేడిగంటి,
నదుల జలముల నెమకు వనజదళాక్షి!

703. క్రౌంచాగౌకస వీక్షణమ్ము కతనన్ రాముండు నీ జ్ఞాపకం
బంచించున్; దొలుకారు చేరి తన నాహ్వానించి నట్లేమొ సం
ధించు న్దేహ ధనుర్వికాసము; రమాతేజంబు జ్ఞాతవ్యమై
పంచక్లేశపు – సన్న – మోము పయినన్ వ్యాపించు, సాంద్రమ్ముగన్

704. అతి సామాన్యుల మేము తల్లి; యతడా యవ్యక్త చిద్భావ్యుడే!
మతి యెల్లన్ సమకూర్చి చూచుకొనినన్ మావల్ల గాదమ్మ – నీ
పతి తత్త్వమ్మును నేర్వ; భావన మదే వైనమ్మొ యే మాత్రముం
గతి నందించదు; పిచ్చివానివలె దా గన్పించు, నీ వేదనన్.



705. దిక్కుల్ జూచును, చూచు నా కెలనన్ దిర్యక్కులన్, బక్కినిన్,
జిక్కుల్ చిక్కిన మానసమ్ము తన లక్ష్మిన్ గూర్చి చింతించుచున్
రెక్కల్ దాచుక కూరుచుండె – దన దారిన్ దానుగా; మాకు యే
వాక్కుల్ రావిక వాయిదాటి, కనగా స్వామిన్ – రఘూత్తంసునిన్,

706. చంద్రుని జూచు, జూచు, నిలు, జానకి మోమునె జూచినట్లుగన్,
సంద్రముగా మనమ్ము నొక సంభృత సంప్రతిపత్తి జేయు, ని
స్తంద్ర దిదృక్ష – లో వలపు, సమ్మతి నూర్మిక జేయు – నంతలో
మంద్రముగా నెదో గొణగి మాకడ నిల్చును మూగబాసలన్.

707. మతి కందని సంగతివలె,
శృతి పొసగని రాగమట్లు – ఛిదురస్వనముం
బ్రతి పదమును వ్యక్తావ్య
క్త తటిద్వంతమ్ముజేయు, గలతయె – కతయౌ!

708. ఆధిభౌతిక దుఃఖమ్మొ, ఆది దైవి
కమగు యార్తియో – మే మెఱుగంగ గలమె?
యిద్దరికినిద్దరమ్మ – మీరిద్ద రమ్మ
జాతవేదోష్ణముల పోల్కి సరియ మీకు!

709. చెట్టు నీడను కూర్చుండు జిన్న పోయి,
గరిక పూలను కోయును, కరముగొనును,
వాని నొక్కటొక్కటి జేర్చు వరుసలేక,
చిత్ర మది యెల్ల గూడును; 'సీత' యగును!

710. ఫలము భావమనుసరించి పరగు, ననగ
వినమె! కీర్తనీయము తల్లి – వేదవేద్యు
వేదనము గూడ, నీకు నివేదనమ్ము
జేయు పరమ భాగ్యము లభించినది నాకె!

711. దిటమౌ పూనిక మోముపై గవరనన్ దీపింపజేయంగ - ప్ర
స్ఫుట రాగాంచిత మాధురీ నిగమ సుశ్లోకంబు జాల్వార, ప్రా
కట రామాంకిత నామగాథ బదశుక్ల జ్యోత్స్న లింపార, మ
ర్కట ధుర్యుం డనె - సీత తోడ, నిజ కామన పండిన సంబరమ్మునన్

712. పని పొసరించగా నిటుల వచ్చితి - పుణ్యఫలమ్ము పండి, యీ
వనమును జేరగల్గితి, నవారిత దీక్ష యశోకమన్న సా
ధనమున నున్న భూమిజను - తల్లిని, నిన్ను గనంగ జాలితిన్
దినకర వంశ్యు నెమ్మదికి దిమ్మన గూర్చెదు భాగ్యమబ్బెగా!

### శ్రీరామ ముద్రికా నివేదనము - కార్యాకార్యసమీక్ష - చూడామణి ప్రదానము

713. శ్రుతి రమ్యంబుగ నిట్లని,
యతులంబౌ భక్తి నిగుడ, హనుమంతుండున్
పతి యొసగిన యుంగరమును
సతి జానకి కొసగె, జ్ఞానసంగత మేర్చన్.

714. ఇచ్చిన యంగుళీయకము నింత పరీక్షగజూచి, దానినిన్
దెచ్చిన వానరేశు గని, తిన్నని యోచనలెంచి సీత - యే
మిచ్చిన నైన తీరు ఋణమే హరిజేయు సహాయమంచు - దా
మెచ్చుల నచ్చుబోసికొనె, మించు కృతజ్ఞత - లో మనమ్మునన్.

715. ఒక గుణ విభూతి మఱియుం
బ్రకటిత లీలా విభూతి పరిచితి తనరన్,
సకలామోద వ్యాహృతి
వికసనము నెగడు వదనపు వీక్షణ మొలయన్.

716. వానరలోక ధూర్జటియు బళ్ళెర మందున నుంచినట్టి క్రీ
డా నగ మట్లు తోచగ; కటాక్షమునన్ - జనకాత్మజాత య
వ్వానరమూర్తితో నెదియొ వాకొన బోవగ - బంచవక్త్రుడే
మానిత వర్తమానము సమాప్తమొనర్చె, మృదూక్తి దేల్చుచున్,



717. అంత వసుంధరాతనయ యయ్యనిలాత్మజుతో వచించె - నీ
వెంతటి కెంత వీరుడవొ, యెంతటి వేదివొ యర్థమయ్యె- భా
స్వంత కులాధిపుండయిన వానిని - స్వామిని, రామమూర్తినిన్-
జెంతకు జేర్చి, యూఱడిల జేయుము, చేయుము-నాకు ప్రక్రియన్.

718. అనవిని రాముడే తన హృదంతర సీమ గడల్కొనంగ, నా
వనచరమూర్తి సీత కనె "పావని! యంత విరామమేల, ని
న్ననిలు తరంగ మాలికల హర్షపు తర్షము గట్టి, స్వామి రా
ముని సముఖంబునన్ నిలుపు మూర్తము దెల్పుము, ధన్యునయ్యెదన్!

719. దేహ వైభవ సమధిక దోహలమ్ము
తొడర - సత్కార్యమునకు నే దొడరు వాడ,
నిన్ను రామచంద్రుని నీడ నిలుపువాడ,
"నూ" యనుము తల్లి నే నిట్టి యుదియ బట్ట".

720. అను హనుమంతు మాటలకు నా జనకాత్మజ నవ్వి, యేమి నా
కనునయ మీయ నీ విధము వ్యాహృతి గూర్చుచు నుంటివేమి? యో
హనుమ - యదెట్లు సాధ్యమగు - నాకృతి జూడగ నల్పమైన దీ
ఘనవచనంబు లేల - సరి - కాగల కార్యము జేసి పెట్టుమీ".

**తోటకములు**

721. అనినన్ హనుమంతు కయత్నముగా
మనసంతయు దుఃఖితమై సుడియన్
జనకాత్మజ గాంచి, విచారముతో
ననె, "మాత! క్షణంబిది నారయుమీ!"

722. అనుచున్ హనుమంతు డ హార్యముగన్
తన దేహ నిజాకృతి తద్దయు పెం
చెను, శత్రు నిహింసన సిద్ధకృతిన్-
వినుచూలి దిగంతము వీచుగతిన్!

723. అంగుష్ఠమంతటి యాంజనేయుడపుడు
దివ్యప్రభల జిమ్ము దేవశైల,
మమ్మమాటకు చిన్నదైన ముఖమచట
నగ్నిచ్ఛటాదీపితాననమ్ము,
పలుకు నెఱిపలుకు పలువరుస యపుడు
ఘనవజ్ర సదృశ వక్త్రజము, ధ్వజము,
పృషదంశకత్రుటి విస్ఫురిత నఖము
లూర్జితస్తేమ సంయుక్త ఛురులు,
గాగ, భీమమై, యుగ్ర భీకరము కాగ,
భీషణ ప్రతి రూపమై, బెట్టిదమ్ము
మీఱ, నద్భుతాకారమ్ము నందజేసె-
సంతసము, మురువు, మఱి విస్మయము గదుర!

724. అద్భుతాకారము గనుచు ననియె సీత-
అగ్ని సదృశ తేజస్వివయ్య - అనుమయ్య
నీవు, వాయువేగ తరస్వి వీవు - హనుమ,
నీదు శక్తి సామర్థ్యమ్ము నేనెఱుగుదు

725. కాని, నీవేగు తీవ్ర వేగాన నేనె
జారిపోవ - నేమగును? విచార ధార
నీవు మునుగ, సంద్రమ్ములో నేను మునుగు
దాన, వ్రతము, ఫలము చెడు - దాన, నిజము!

726. అని లీలార్థమె - యర్థమిచ్చు గతి డాయంజేరు నా మాటలన్
విని, తాదాత్మ్యము - భావికార్య ఘటనా పిండీకృతాభార సాం
ద్రనతోదీర్ణ దశావిశేష శిఖియై రాజిల్లి వర్ధిల్ల, న
య్యనవస్థాన తనూభవుండు నిలిచెన్ శ్యామంగజా సన్నిధిన్

727. హనుమంతున్ గని భూమి జాత, తన యాంతర్యమ్ము దైవాఱ - ని
ట్లనియెన్ - జాలు, సమీరనందన - మదీయాపేక్ష్యమౌ లక్ష్య - మా
ఘనుడీ లంకకు వచ్చి రాత్రిచర నిర్ఘాతమ్ము గావించుటే-
యనఘా! యేగుము, తోడి తెమ్ము ప్రభు, మాన్యప్రాభవున్, దేవునిన్!



728. ఈ విధి నా నిరాకరణ మెంచిన కోరిక యూఅడించగన్,
బావని కూడ యోచనల భావ్యత నర్థము జేసికొంచు, సు
గ్రీవుని యాజ్ఞనున్ దలచి, కీశుల విక్రమ దర్శనంబు కీ
యీవిధి దోహదం బగునులే! యని సంతసమంది, లోమదిన్-

729. తన నిజాకార మనోజ్ఞతా పరిధికి
దిగుచు, నెమ్మిది యంగము లొగి విధేయ
త నిగుడ బ్రణామ మాచరించె - నవనిజకు,
కొమ్మ వ్రాలిన గన్నేరు గుత్తివోలె!

730. అంతట జానకీసతి, తదర్థము నెంచుచు 'గట్టి త్రాడు న
త్యంత పటిష్ఠమౌ విధిని యల్లుట మంచెకు మంచిగాదె' - యా
వంతయు సందునీయ దగ దంతకవైరుల కంచు నా హనూ
మంతునికిన్ వచించి యొక మాదిరి చూపుల జెప్పె నీవిధిన్

**మంజరీ ద్విపద**

731. రక్కసీడపుడు బలాత్కరించి గొనె;
యరుగువేళ వివశనైతిని నేను,

అసహాయ నైతి, పరాధీన నైతి
నతివిషాదాక్తమై యడరె నెడంద

బలిమిమై పెఱకిన బ్రహ్మవృక్షమ్ము
సొమ్ములు వోయిన సోకుడు మడుగు!

నంకిలి జిక్కితి, నంజన పట్టి
దశరథ నందవర్ధనుడు రావలెను

ప్రతిబల పటలమ్ము భ్రమించవలెను
ఊరీకృతము చర్య, యుక్తియుక్తమ్ము

ననుగొని పోవరమ్మనుమయ్య హనుమ,
లక్ష్మణ సహితుడై రమ్ము రమ్మనుము!

732. అను వైదేహి సమర్థ భాషణము విన్నంతన్ హనూమంతు డా
ఘన సాధ్వీమణి, బూజనీయ - గని, భక్త్యన్వీత చిత్తంబుతో
ననె, 'సీతాసతి, తల్లి! నీకుదగు మాన్యంబైన వాగ్గుంఫనం
బనుసంధించితి వమ్మ! రాఘవ సతీత్వాదర్శ విస్ఫూర్తితోన్

733. మీదు తత్వము, జీవుని వేదనా వ
లయము నొక్కటై నీరంధ్ర లక్ష్మ మిచ్చు!
మా తెలివి కొలదు లవి యే మాత్రమమ్మ-
మీ యిరువురను గూర్చి సమీక్షజేయ?!

734. సరి, యిక వెడలు వాడ - దాశరథి కీయ
నేమయినను నా కీ తఱి నిత్తువమ్మ;
మాట చేరవేయుదు, నొక మంచి జేతు,
మాత గూరిచి చెప్పెద, మనసు నిత్తు!

735. నిండు టెడద లోలోతుల నుండి వచ్చు
ఆంజనేయుని వాక్చయ మందుకొనుచు
నామె - ఆలోచనా లోచనాను గతము-
గతము జరిగిన నొక్క సంఘటన మనియె,

736. కరమగు నమ్మకం బొగిని గల్గుటకై రఘురాముడొక్క హ
ర్షరమను నాకుబంపె, తదనర్ఘ విభూషణమట్లె నేనునున్,
కరమరుదైన సంఘటన - కాకము గూర్చిన దౌ విశేషమున్
పరిణత వృతి వాకొనెద, పావని, యంచు సతీమతల్లియున్,

737. రాఘవున కీ ఘటన జ్ఞప్తి రాకయున్నె
చిత్రకూటముపై సాగె చిత్రమయ్య
యనుచు సీత వివరమిచ్చె; ననుగు సరవి
దనదు చూడామణిని వాయుతనుజు కిచ్చె

738. తన యుల్లాసము పొంగ మారుతి 'యయోధ్యానాథుకీ యానవా
లు నివేదించెదనమ్మ! నమ్మకము, నుల్లోలంబు - సల్లాపమున్-
వినుతున్, దెల్పెద నీదు వాంఛ తన దోర్విస్ఫారకృత్యమ్మదే
నిను తోషింపగ జేయునంచనె, మహానిర్ణేతకున్ మ్రొక్కుచున్.



739. చూడామణి నిడి, గతమును
వేడుకల విశేషమెల్ల వివరించెద, నీ
వీడున యీ సీతాసతి
గోడును, నా మాటల ననుకూలము జేతున్

740. వరమే యియ్యది తల్లి, నే గనిన స్వప్నం బారపండింప, బ్రో
పరియౌ రాముడు వచ్చి యీ యసుర సంవర్తంబు దున్మాడి - వా
నర యూధంబున కొక్క సత్కథను సన్మానమ్మునున్ గూర్చుటే
వరమౌ; కావున పోయివచ్చెదను సద్వ్యాపారమేపారగాన్.

741. అనవిని, భూమి పుత్రి - తన యాత్మ గడుంగడు హర్షమంద, "యో-
చిన అనుమయ్య - ఓగితము జిందెడు నీ వచనంబు లెల్ల - నా
మనసుకు శాంతి గూర్చె, సరి; మంచిదె కాని యభీష్ట సిద్ధికిం
బనిగొన నీవు తక్క, తగువారలు లేరుగదయ్య తెల్పుమీ!

742. మనమున ప్రశ్ననిల్చె - వినుమా! గరుడుండును, నీవు, వాయువున్
ఘనులరు - దుస్తరంబు, బహుకష్టమసాధ్యము నైన కార్యమౌ
వనధిని దాటి రాగలరు; వానర వీరులు సైన్యకోటి - యే
యనువున లంక జేరగలరయ్య, యసాధ్యము కాదె తెల్పుమీ!

743. సామంజస్యము పూచి యేసరిన యీ సందేహమున్ విన్న శ్రీ
రామ ప్రాభవగాయకుండు - నిజధర్మ స్ఫూర్తి వెల్గొంద, శ్రీ
రామ ప్రేమ మహానుభావ రుచి పూర్ణాస్వాది - వైదేహితో,
సామాన్య ప్రతిభాషణంబు వలె దోచన్ జెప్పె - నీ యీ గతిన్.

744. తల్లి - మదిలో మిగిలెను వ్యక్తవ్యమింత,
తెలిపెద వినుమమ్మ ! కపులు - దేవనిభులు,
వీరవిక్రములు, క్రములు - వైరి వీర
మర్దనులు, వారు దుర్దమ కర్దనులును!

745. కుతిలముచే తలంపు లురుకుం గద కాపరిలేని యాల మం
ద తిరుగు వైళ మట్టి కొఱతల్ మతి హీనతగా మదింతురే-
తతగుణ ధుర్య! నీ విటుల తత్తఱపాటున జంకు దెల్పుటా
వితమగు వేదనా హృదయ వేపథువంచు దలంతు నమ్మరో!

746. దాశరథి రాము కీర్తిపతాక యాన
తల్లి! భల్లూక వానర తతిని గలరు,
కలరు – భువిజుట్టి త్రుటిని రా గలుగువారు;
వారు ఘనమనోజవులు, జవాంకధరులు!

747. మాదృశమైన వీరకపి మండలి నెందఱొ, యెందఱెందఱో
సాదనకాండ్రు, పోటరులు, సాహస, విక్రములుండినారు, వా
రాదరణీయులమ్మరొ – యహస్కరసూనుకు, వారు యుద్ధ శా
స్త్రోదిత రీతి శూరపద శోభితులమ్మ! యజేయవీరులున్!

748. కొండల బిండి కొట్టగల క్రోతులు గుంపులు గుంపులై, బలో
ద్దండ తురంగ వాహిని విధంబున లంకను జుట్టుముట్టి – యీ
దండపతీత్వ సంజ్ఞుల, ప్రధాన చమూతతి కర్మదోషముల్
ఖండన జేతురమ్మరొ, ప్రకాశ శుభాంకము లెల్ల ద్రుంచుచున్

749. సత్తు – ముత్తైదువలు శుభాక్షతలు చల్లి
మీకు సాదరాహ్వాన సమీహితమగు
సత్కృతుల – పొందలింతు రాశంస లిచ్చి,
తొనకు – మంగళ జయజయ నినద మపుడు!

750. సఫల తాంబూల మిత్తురు – సాధువృత్తి
నారమగ్గినవారు, దైత్యాళినున్న
సత్వమూర్తులు – నిజమమ్మ – జానకీ ద
శరథరామ దంపతులదే జయము, జయము!

751. అకృతక భక్తి నా దశరథాత్మజు నాత్మ హితమ్ము గోరుచున్,
బ్రకటిత యుక్తి యుక్త శుభభావన గుచ్ఛము లందజేసి, పూ
నికమెయి ధైర్యమూదు – కపి నిర్మల చిత్తము మెచ్చి, పల్కె – జా
నకి – “పవమాన సూన! రఘునందను కిట్లనుమోయి నా కతన్”

752. తండ్రి మహాత్ముడౌ దశరథ క్షితి పాలకు డెప్పుడైన యే
గండ్రల నన్న పాపమున కానడు, భార్య వరమ్ము హేతువై
దీండ్ర నరణ్య వాసమును దీరుచ వల్లెయటంచు వచ్చి నీ
తండ్రి యనుజ్ఞ మెచ్చితివి, ధర్మము నింతికి గూడ కూర్చుమీ!



753. ఎండలకు యెండి, వానల నుండి తడిసి,
కక్కసపు తొచ్చియము రాల్చు రక్కసీంద్ర
కఱత, మొకరితనమ్ము లూకరము లెల్ల
సైచి యుంటిని – నీరాక వేచి, వేచి

754. నా డయోధ్య వీడునెడ మాన్య జనగణము,
నడుమ – నడవుల దిరుగాడు నెడల – చెట్లు,
వేళ్ళు మఱియు గుట్టలు, పుట్ట, లేళ్ళు, రాళ్ల
నెఱుగు – నాదు దుఃఖ, మదరు, లుఱుకుపాటు!

755. బెబ్బులులు కోరలను విచ్చి బెగడు వఱచ–
నన్నిటికి నీవె కలవు ప్రత్యక్ష సాక్షి
నాడు – నీ నీడనై నేను నడచు నాడు;
నేడు – నా బాధ లీ తరునివహ మెఱుగు!

756. బూమికిని ఆకసమునకు పూర్తి యెఱుక–
నాటి నా వగ; మఱియు నీనాటి నాదు
సెఱగు – నికరంపు మానిసి – చెప్ప నగునె?
వానినే విచారించు మో ప్రాణనాథ!

757. ప్రియమనోవల్లభా – భవద్విరహతాప
వహ్ని మలగునెడ నెదియొ స్పర్శనమ్ము
లెదను తాకు, నులికిపడి యెంచ – నీదు
పేర్మి చేయిదపు చవి – నాకు – వెచ్చపెట్టు!

758. వాకొన రానివి మాటలు
నా కొలది బదుకున దుల్లె నరభుజునోట,
న్నేకత ముందుట నీగతి–
యే కతకు మలుపు – తరణికులేశ, తలంచన్?

759. క్రూరుడు రావణుండు బ్రతుకున్ బరిహాసము సేసిసేసి, యీ
తీరుకు బాలు సేసె; నియతిన్ విడె, ధర్మ నిరాకృతిం గొనెన్,
వైరమదేరి మీద నడిపించ దలంచెనొ – యింతచేసె – మీ
నేరుపు, తీరుపే – గతికి నేమము గూర్చును, రామ! రాగదే!

760. మఱియొక చిన్నమాట; హనుమంతుని ద్వారము జెప్పుచుంటి, మీ
నెఱవగు చిత్రరీతి – కరుణించిరి మీరొకనాడు నా మొగం
బఱిముఱి నిండ, స్వేదకణమల్ల మనశ్శిల జక్కజేసి, మీ
కఱదుల జూపి, నాదు తిలకంబుకు జిన్నెలు దిద్దరయ్యెడన్!

761. ఒకనెల మాత్రమే మిగిలె – యున్కి, కనంతర మీ కళత్ర రూ
ప కమలమో నిదాఘకర వంశ సుధాకర – రూపుమాయు, నా
కొకటి మహావకాశమును కోనమెకమ్మిదె తెచ్చియిచ్చె, మీ
రిక సమయోచితంబు మదినెంచుడు, యెంచుడు – నాదు బాసయున్!

762. దినములు లెక్కపెట్టు కొను దీనను, నా యుసుఱుగ్గబట్టి, యీ
దనుజుల మధ్య నుండెదను దాశరథీ – నెల మాత్ర, మంతలో
నను గొనరమ్ము – హర్షణ ఘనంబును జేయుము నా మనంబునున్,
బనివడ మోయ తప్ప దొక బాధ్యత నెత్తిన బెట్టుకొన్నచో!

763. అని నా మాటల జెప్పుమయ్య హనుమంతా! రాఘవ స్వామికిన్,
గనుగొన్నట్టి విశేషముల్, వినిన యాఖ్యానోత్కర ప్రస్తవం
బనుబంధ ప్రచయమ్ములం దెలిపి, లంకాధీశు జెండాడ ర
మ్మనుమీ, నా చెఱ కంతమిమ్మనుము, గార్హస్థ్యోచిత స్ఫూర్తితోన్,

764. అనుమాటల్ వినినంత నుద్దవిడి శ్రద్ధాసక్తి మేల్కొన్నటుల్
హనుమద్దేహ మదెల్ల నొక్క తెలివెల్లై శోభలన్నింపుటల్
గనె – సీతాసతి, హర్షవర్ష మభిషేకం బిచ్చెనా వాని కం
చనిపించెన్, సతి సీత కత్తఱిని, హృద్యంబయ్యె సందర్భమున్!

**హనుమ ప్రయాణము – పునస్సమీక్ష – అశోకవనధ్వంసము**

765. అప్పటి కప్పుడే వనచరాగ్రణి యుప్పరవీది జూచుచున్
దెప్పల దేలియేగ తన తెఱ్ఱును బట్టెను, నిమ్మళంబునొ
చప్పుడు వీడుకోలు నిడి, చాయల తున్కల – గూడగట్టి పై
గప్పెను వాయునందనుకు – క్షాంతిరుహమ్ములు, క్రాంతి గోరుచున్!



766. జయమని పల్కుచున్న తరుసంతతి జూచి, హసించి, యంజనా
ప్రియసుతు డంతలోన నొక విజ్ఞత పిల్వగ గొంచెమాగె, యీ
నియతము గాని రక్కసుల నేరమడంచగ సామ – దాన భే
ద, యతనముల్ ఫలించ విక దండన గూర్చి తలంచగావలెన్

767. అదియును గాక శత్రుబలమయ్యది యెట్టిదొ నేర్వగా వలెన్
విదితము జేసికోవలయు – వీరుల, మాన్యుల లక్షణమ్ములున్;
పదమెట నిల్పగావలెనొ, పట్టుల గుట్టుల రట్టు లన్నిటం
గదియు నుపాయమెంచవలె; గావున లంకను వీడరా దటం
చదను దలంచి యాగెను, మహస్కుడు, పావని దూతనేర్పునన్!

768. ఒక పట్టు పట్టి చూచిన,
సకలము రిపుసత్త్వ మెఱుగ జాలుదు – నని ప్రా
న్మెకపు గఱువ తన కాయము
నొక భీకర రూపము గొన నూకొనె, వింతన్!

769. హనుమనె యాశ్రయించి తమ హాళిని, హార్దము జూపు – యిద్ధ, బు
ద్ధి, నయ, వివేక సారములు, ధీర పరాక్రమ శౌర్య సంపదల్,
ఘనతర ధైర్య శీలములు, కార్య ధురీణత లొక్కసారి – పై
గొనె నతిదేహు, గట్టొరయు కూలము నీరము వోలె – లో, వెలిన్!

770. తన యాకారము నంత యంత గని, యుత్సాహమ్ముతో గీశుడున్,
దనలో దాను తలంచె – 'రావణుని కత్యంతాభిమాన ప్రదే
శ నివేశమ్ము – వనమ్మశోక మది – తత్స్థానమ్ము, వైనమ్మునుం,
బనిగా ధ్వంసము జేసి దదృశము నాపై దాల్తు నిత్యంబుగన్

771. 'పిట్ట కొంచెమైనను కూతవేసెను ఘన
మన్న విధముగా జేసెద – నమతి, జెనకి–
యెంత రెట్టించ వలయునో యంతజేతు;
జేత లటునిటు నప్పుడే చెరుగవచ్చు!

772. సింగపు జూలులో పొలయు చిమ్మటనౌదు, చిరాకు జేతు – న
స్తంగత కీర్తి కర్ముని దశాస్యుని; నెత్తిట నేతిచుక్క కై
పెంగల గంచు పాట్లు పదు పిల్లి పరిస్థితి గూర్తు వానికిన్;
సంగతి దేల్చి పోయెద, నసత్య, మధర్మము – బీకి వైచెదన్

773. అని బీభత్సము జేయగా దొడగె నుద్యానమ్ము నయ్యంజనీ
తన యాఖ్యుండట, మొక్కలన్, దరువులన్ – దాక్షిణ్య రాహిత్య సం
జనిత క్రోధము దేహ మానసము లుచ్ఛ్వాసించి – పొంగించ, జ
య్యన జేతం బెకలించ సాగెనట, బ్రహ్మాండంబు క్రిందైన దా
యని లోకం – బతిలోకమై నిలిచె కాలాక్రంద విభ్రాంతితోన్

774. ఒక చేత వటపమ్ము, నొకచేత నీడిగ
బట్టి, హుమ్మని నేలగొట్టి తొలగు;
నొకచేత బెంగల్లు, నొకచేత ఊదిన్నె
నెత్తి, పైకెత్తి, తాడించికొట్టు;
నొకచేత బొదరిల్లు, నొకచేత మంటపం
బవలీల పెకలించి, యవలద్రోయు;
నొకచేత జలయంత్ర, మొకచేత వంతెన;
బెఱికి బుడుంగున విసరు సరసి;
నొక లవంగలత, నొక మహోచ్ఛవిటపి–
గలుపుమట్టి; శిల్పముల విగ్రహ శతమ్ము–
పట్టి, పొడి చేసి – పచ్చిక బయలు ద్రొక్కు
నాటపట్టయ్యె హనుమ కా వాటి నిజము!

775. చదలేటి నకలును చట్టుబండలు చేసి,
చిత్ర గృహముల విచ్ఛిన్న మనిచె;
క్రీడా గృహము పీకి, కేరింత – బొడిచేసి,
కృత్రిమ చంద్రుని కీలు విరిచె;
రవిరథ ప్రతికృతి ఊలు నుఱుము జేసి,
సౌధ యూధమ్ముల జదును చేసె;



శిల్పకేదార నిశ్శేషమ్ము గావించి,
కేళకూళి గలచి కేరడించె;
కోపగించిన బాలుదు – కూకరించి,
రంగవల్లుల నెఱి – జెదరంగ జేసె;
గవ్వలాటను చిందఱ గచ్చుకొనియె
ననిన విధమయ్యె – వనమున హనుమ పనులు!

776. భీమ విక్రముడయ్యె కపివరుడు నిజ
మపుడె విక్రమ భీముడై యలరె హరియు,
వనము నిర్వృత మొనరించె వనచరుండు,
చరులు నిర్విణ్ణులై పాఱి జారుకొనగ!

777. తన స్వాతంత్ర్యమె యుద్యమించి యనువౌ స్వైరమ్ము బ్రేరేచ, నా
వన సౌందర్యము జీరె, వ్రచ్చె, జెఱచెన్, బాఱించె వెల్తిన్, ప్రభం
జన సూనుండు – సమన్వయార్థమున; రక్షాకాంక్ష – లంకాధి నా
ధుని కర్ణంబుల మ్రోగిమ్రోగె; గృతకృత్యుండయ్యె– సామీరియున్!

778. ఉద్యానమ్మున, దోరణమ్ము కడ, దా నొయ్యార మింపారగన్,
సద్యఃస్ఫూర్తి వివేక సార శుభ లిప్సాసస్యముల్ – మేల్కొనన్,
సద్యోగస్థితి నిల్చియుండె – హరి – శశ్వత్సౌఖ్య మూర్తీభవత్
హృద్యత్ర్వాప్తి – తదేకమై దనర, భావ్యాంశమ్ము నూహించుచున్

779. గడగడ వణుకుచున్ భట గణము – జరిగి
నట్టి వృత్తాంత మెఱిగించి రసుర పతికి,
కతయె మ్రింగుడు వడక – వికారమొదవె,
గంట కొంక తేలు కుట్టిన గతిని తలచె!

780. ఆరవ ప్రాణమై తనరు నా వన మందొక క్రోతి యే విధిన్
జేరెను, చేరెబో యెటుల చెట్ట గలంచెను – ధ్వంస మెంచి, యీ
ఘోరము నాపలేక ప్రతికూలపు వార్తల దెత్తురే యటం
చా రజనీచరాగ్రణి; నిజాజ్ఞ నొసంగె – భయంకరంబుగన్,

781. కొట్టుడు, నెట్టు డా కపిని, గ్రుమ్ముడు, గొంతుకబట్టి కట్టుడీ,
గిట్టిన బట్టు డా హరిని, కింకరులెల్లరు పొందు, పోయి యీ
రట్టడి కట్టు, డా యనయు రాయిడి నాపు, దవశ్య మాపుడీ
రట్టును; వేగ నీడ్చుకొని రండిక వానిని నాదు ముందుకున్.

782. ప్రభు నాజ్ఞాబద్ధులుగా
నభయాభ్యాగమ గమనమె యభ్యుపగమమై-
సభకు జనిరి కింకరులున్,
స్వభావ భావము వినమ్రసారము నొలుకన్

783. విన్నంబోవునె రాజసింహము, జగద్విఖ్యాతుడౌ విశ్రవుం
గన్నా! గోటితొ పోవగా జిదిమి యీ కార్యంబు మూర్కొందు మే
పన్నాగంబులు చెల్లనీయమిక - మీ ప్రాగ్భార సంపన్నమౌ
సన్నాహంబుల నాచరించు విధియే సాధిష్ఠమౌనంచునున్

784. అతి సన్నాహము మేర మీర, బలవద్వ్యాపారమేపార, స
మ్మతి నెమ్మోముల చాయలేర్పఱచ, స్వాత్మ ప్రాభవశ్రీ సమా
గత ధైర్యమ్మది తొందరించి తమ మార్గాయోగ నిర్దేశముం
బ్రతిపాదించగ, గింకరుల్ సొగయ - సంగ్రామార్థులై, స్పర్థతోన్

785. వారల జూచి వాయుజుడవారిత తాండవకేళి లేచి, వి
స్తారము జేసి పుచ్ఛమును, ధాత్రిని గొట్టి, శరీరమున్ మహా
కారము నిండజేసి, కృత గర్జయు వెల్వడగా, బ్రతిధ్వని
స్ఫోరకమై చలించు ధ్వని బోషణ జేయుచు భాషణంబిడెన్,

786. లోకాతీత పరాక్రమ
సాకల్యుడు రాముడుండె సర్వోత్కర్షన్,
వీకున దొర లక్ష్మణుడున్
బ్రాకట జయశీలము గల వాడీ ధరలోన్.

787. రాఘవాభిపాలితుడు మర్కట విభుండు
నుండె - సుగ్రీవ వరుడు సర్వోత్కలుండు;
వాయుసుతుడ, హనుమ పేరువాడనేను,
దాశరథియైన శ్రీరామదాసు నేను!



788. వేయి రావణులైన నా పేరు వినిన
యుద్ధ రంగాన నిల్వ సన్నద్ధులగుట
కల్ల; పేరు సింహస్వప్నమల్ల నగును-
హెచ్చరిక మీకు రక్కసి మ్రుచ్చులార!

789. శతసహస్ర రాక్షస సమాసమ్ము చూచు
చుండగా లంక పీడించి యుండ జుట్టి
మాత సీతకు నేను నమస్కరించి
వచ్చిన పని జేసికొని వెల్వడెదు వాడ!

790. ఎవరడ్డంబయినన్ సరే యనగ, లంకేశాను సైన్యంబు లా
పవమానాంగజు దాక, వారికిక నిల్వన్ దిక్కుమ్రొక్కేది, ఆ
పవమానాంగజు డొక్క పెట్టున భయోత్పాతంబు బుట్టించి, తా
నవసానంబు నొసంగె - కింకరుల కభ్యామర్ద పర్యాప్తిగన్

791. పోయిన వారలెల్ల చనిపోయిన వారలె యన్న వార్తయున్
నాయకు జేర, జేరె గగనమ్మున కాయన కోప తాపముల్;
నే - యమభూమి జేర్చెద వినిర్గత ధూర్త దురంధరత్వమం
చా - యతనమ్ము కై పిలిచె - నంత ప్రహస్త కుమారు, ధీరునిన్

792. అప్పటికప్పుడే యిట - మహాబలదేహుడు, వాయు నందనుం
డుప్పరమంటుచున్న తన యోజము, వీరము, సాహసమ్ములన్
జప్పుడు సేత జూపగను - చైత్యము మీదకు దూకి, యొక్కటొ
ముప్పును ధ్వంసకృత్యమున ముంచెను - చైత్య వినాశకారిగన్.

793. గర్జ - గుహాంతరాళముల ఖంగున మ్రోగిన హస్తి కక్ష్య పుం
గర్జయె కాగ, గాయమది కాలనభంబు సమంబుగాగ, వి
స్ఫూర్జిత దేహతేజమది స్ఫూర్జితమై భువిదుల్ల, చెళ్ళునన్
బర్జని విచ్చినట్లు, హరి - వాతులమై విహరించె, నవ్వనిన్

794. వజ్ర పాణియైన పాకశాసనువోలె
స్తంభ హస్తుడయ్యె శ్వసన సుతుడు;
వీరగామియగుచు వీరంగమును జూపి;
కార్య కారణమ్ము - కథను బలికె!

795. శుక్ర శిష్యులదరి, సోకువీడి, చెదరి,
దిక్కుతోచక, గతి, దృక్కు – మఱచి,
కాలధర్మధాని కౌగిలించుకొనిరి,
కొనిరి పొందదగిన కొలువు, నెలవు!

**జంబుమాలి వధ – రావణహుంకృతి – హనుమచే సైన్య హసనము**

796. ఇదె సంధింపగ వేళయంచనికి బోయెన్ జంబుమాల్యాఖ్యు – డా
పదయే తానయి, క్రిందికిన్ దిగిన సంభారోత్కటౌగ్ర్యమ్మునై,
పదురంజేసిన గార్ధభమ్ము పయినన్, బ్రాబల్య యోగ్యమ్ముగా,
మెదువౌ చెందురు కావి వన్నెలవి సమ్మేళమ్ముగా వెల్గగన్

797. వచ్చిన జంబుమాలి – తన వాడి యవాయిల నాంజనేయునిన్
గ్రుచ్చుచు; రోషముం, బగను గొట్టుచు, నెట్టుచు, గోపతాపముల్
హెచ్చరిలంగజేసి, కసి నెంచుచు సంగర భీమమూర్తియై,
క్రచ్చఱరేగు నెద్దువలె – గాడుపు చూలిని గాసిబెట్టగన్

798. స్వచ్ఛ సంవీక్షణ శాంత తరంగిణి
ఎడద నీర్వామిలో గడలు కొనగ,
రక్తసిక్త శరీర రక్త సంధ్యక శోభ,
యొడలు విరుపు పొంగు నురవణించ;
అభయ హస్తంపు శుభాశీస్సమాసమ్ము,
పిడికిలి పట్టును పిరికొనంగ;
భాషణ భూషణోద్భాసిత వ్యవసిత
వ్యాహృతి వ్యాయత వ్యాఖ్య దెలుప;
నప్రియము ప్రియజనితమై యభిగమించ,
మలక మెఱపులు చెంగున మలసినట్లు,
మై విరవిరవాఱగ జేసె మఱువు లేక,
మర్కట స్వామి దర్శనమహిమ, మహము!



799. ఒక తనుగాలి తెప్ప కుదురొప్పగ చప్పున లేచినట్లుగా
బ్రకట మొనర్చె వానరుడు; వాలము మూలగ జుట్టుకొన్న – మా
రక బలశాలి, నుగ్రు గని, బ్రామ్పడి, యేర్పడి, తెప్పరిల్లె – నా
తికమక జంబుమాలి, తన దీమస మెంచుచు, మించు తీవ్రతన్

800. దయ్యము పట్టినట్లు తనదైన విధంబున జంబుమాలి, యా
కయ్యము గెల్చుకొర్కె– బరిఘల్, శరముల్ – వివిధాస్త్ర శస్త్రముల్
చయ్యన వేసివేసి, తన స్వామి నిదేశము గుర్తుజేసికొం,
చయ్య ప్రహస్తు నాన బరువై తలనిండగ, రెచ్చి పోవగన్

801. ఆ వీరావేశము గని,
నా వీరావేశపు కలనన్ గనుమని – సం
రావము దిక్కుల మ్రోగగ,
నా వాయుసుతుడు విజృంభ మభ్యాసించెన్.

802. ఒకపఱి జంబుమాలి నెవరో యొక లౌల్యుని జూచినట్లు జూ
చి, కపివరేణ్యు డా దుడుకుచిన్నెల శత్రువు నుక్కడించగా,
నొక పరిఘాయుధమ్ము గొని, ఊపున – నోలము నుంకుచెండుగా
బ్రకట మొనర్చి, చేత బరిపంథికి దీవ్ర విఘాత మీయగన్

803. చక్రము లూడిపోయె, బహుసంధులు, నాడులు, గీలు, గట్టులున్
నక్రము గూలిపోయె; పిడి, నాభి, వరూధము రాలిపోయె; బ్రా
ణిక్రము మెల్ల దేలబడి, నేరుపు డీలపడంగ వాని – దే
హక్రమ చక్రపాద మొక యానతి లోబడి, నేలపై బడెన్

804. ధరగూలం దతరోషవేషుడు ప్రహస్తాత్మోద్భవుండత్తఱిన్
వెరగున్, వెంటము వెంటకుం దఱుమగా వేదోదయుండధ్వ సం
చరణాభ్యాసపు సాగుపాట గదలెన్ – స్వాభావ్య భావంబుమై
తరుణాంభోజుదు – లేత నవ్వొలుక సంధానించె దృశ్య స్పృహన్!

805. నిహతుండయ్యెను జంబుమాలి – రుమభూనిక్షిప్త బీజాకృతిన్,
సహసత్వమ్ముల నాంజనేయు దడచెన్ స్వామీ – యటం చా భటుల్
బహుళోద్వేజిత వర్తమాన మిడ, గ్రవ్యాధ్యక్షు డుద్రిక్త ని
ర్వహణోన్నిద్ర నియోగముల్ విసరె – ద్యావాపృథ్వులల్లాడగన్!

806. దైతేయాధిపు దంత మంత్రి సుతులన్, ధైర్యస్థులన్, బ్రత్యవ
స్థాతన్ వానర వీరు బట్టననిచెన్; సర్వంకషుల్ రేగి యా
క్రోతిన్ వార్ధిని ముంచివైతుమని నిర్ఘోషార్భటీవ్రాత వా
చా తంత్రమ్ములు దిక్కులం గదియగా సాగించి రుద్యోగమున్

807. నేరుగ వచ్చి తోరణము నిండుగ కూర్చొనియున్న కీశుపై,
వారు నభోరుహమ్ము పొడ భంగిని మూగిరి; వాయు వయ్యె నీ
మోరమెకమ్ము – సాహసము, మోడిని జూపుచు, జువ్వరేగె; నా
వీరుల తెంపు, బెంపు దెగవేయుచు; బ్రాణము లారవేయుచున్

808. హరి నట వీక దాకిరి శరాలిని; తట్టను కోడిపైన మూ
సి రనగ జెల్లు; నంత శుభశీలుడు కీశవరుండు వారి – మా
సరమున కొక్క కంత నిడి, చయ్యన, చప్పట లేపి, రేగగన్
గరువలిపట్టితో నెదురు గాలికి నీదుట యయ్యె వారికిన్!

809. వికట మదాంధ తత్త్వమున వేలుపు గొంగలు, మంత్రిపుత్ర స
ప్తకమది వజ్రకంఠుపయి వాయుఫలమ్ముగ మూగగా, బలా
హక పటలంబుగా ముసిరె – హరియు, దిట్టతనమ్ము మించ; నొ
క్కకరి నొకండుగా, మఱియు గుంపును గుంపుగ నాటలాడుచున్

810. కాండ సంపుష్టమౌ యనోకహము నెత్తి
హత్తి కొందఱిన్, బాదాల నణచి కొంద
ఱరుల, కొందఱి తన గోళ్ళ రక్కి రక్కి
కొందఱి పిడికిలించియె కూల్చె హనుమ!

811. ఒక్క గుప్పిటతో పిచ్చి మొక్క లెల్ల
పీకి పారవైచు కరణి పీకివైచె
హనుమ, మంత్రి నందనుల సంహారమేర్చె
నాస లడల, దివౌకసు లాశ మిగుల!

812. మాఱుతుల మూక గరువమ్ము మలుగ జేసి,
ముంపు తీసిన మాగాణి మురువు జూపి,
మబ్బు వీడిన ఎండను మల్లడించి,
మంచిగా గూరుచుండెను మారుతి యట!



813. గోడపై కూరుచుండిన కోడిపుంజె,
యొక చిటారు కొమ్మకు నందమొగ్గ మొగ్గ
వలె, నతి ప్రసన్నత నుండె వనచరుండు
'రండి రా పట్టుకొని పొండిరా, దశాస్య
భృత్యులార, గేహేశూర వీరులార'
యనుచు, దొడగొట్టి మరి సవాలనిన యట్లు,
టొంపవలె నిలువెత్తు నై, టొంపు విసరి,
ఠీవి జూపె – భంగిమమున టీవు తోచ!

814. ఒక విధ్వంసము బాదుగొల్పి యదియే యుద్యోగ కర్మంబుగా
సకలారామపు పాదుబీకెనని శస్త్రాజీవులా రాక్షస
ప్రకరాధీశుకు విన్నవించ, దనుజ ప్రాజ్ఞుండు – రోష ప్రతా
ప కకుత్తుల్ చలియించ గన్నుల క్షురప్రవ్రాతముల్ రాల్చుచున్

815. పడవాళ్ళన్ బిలిపించె, దుర్ధర విరూపాక్షాది సేనాపతుల్
బడబాగ్నుల్ వలె వచ్చి నిల్వగ, నిటుల్ వాక్రుచ్చె దైత్యాధి నా
థుడు, "సామాన్యపు మర్కటంబగునె యా దుష్టుండు; కాబో దిదె
క్కడిదో భూతము వోలె వచ్చె నిక యీ కారగ్గి జల్లార్చుడీ!

816. కాబోలు దుష్ట పాకారి యీసు బలియ
తీవ్రతపమొనర్చి తీర్చి కూర్చె;
యక్ష గంధర్వ నాగాదు లోటమి వడ
కక్ష సాధించ నీ కపి ననిపిరి
కాబోలు, దానవగణ శౌర్య జనితాభి
భూతి ప్రయుక్త దుర్వ్యూహపటలి
లంకానగర సుందరాంక విచ్ఛిన్నత
గోరి పౌరుష వృత్తి క్రోతి యగుచు
మన దఱికి వచ్చెనేమొ– కామనల ద్రుంచ,
నతిబలిష్ఠ మౌ భూకేశ మరుగుదెంచె;
బొందు, తీక్ష్ణమౌ ప్రతిరోధమిందు, జాగ
రూకులై విజృంభించుడు – క్రూరులగుచు!

817. బల పరాక్రమవంతులౌ వనచరాధి
పతులు సుగ్రీవుడును జాంబవంతుడు; దణి –
నీలుడు, ద్వివిదు డాది సైనిక వరీయు
లెల్ల వారల నేనుగా నెఱుగువాడ;

818. వార లెవ్వరి కింత నిబ్బరము, తేజ
మును, పరాక్రమ, ముత్సాహమును, తనూ వి
భవము, ధీశక్తి – యెల్ల విప్పారి యొక్క
ని కడ లేవు; వీని తెఱగు; నెరవు – వేరు!

819. వేరని చిత్ర చిత్రముగ వేవురు చెప్పుటెకాదు, వాని యీ
యారడి నాపలేక గద యంతటి వాడు ప్రహస్తసూనుడున్,
వీరులు మంత్రి పుత్రులును వీగిరి, కూలిరి – కీర్తిశేషులై,
మీరుగ సాగి యుద్ధమున మించి, జయమ్మును దెచ్చి నిల్పుడీ!

820. ఆహవము – నురుపిడి వ్యవహార సరణి,
సంగరము – మీకు సమ్మతి చల్ది తినుట,
బవరము – విడెము బిగియింపు పగిది గాదె;
కదనమది – చిడుగుడు, బండ్లకల్లు లాట!

821. కావున, మీరు క్రోతి కొక కంపము నీయగ పొందు, పోయి మీ
భావన, సర్వయత్నములు భండన సాధనమందు నిల్పి, మా
సేవకు, దైత్యలోక జయసిద్ధికి కారకులై రటన్న – సం
భావిత లక్ష్య యోజనకు వాస్తవ రూపము నిండు, పూనికన్

822. అని దీర్ఘంబుగ జెప్పి, యాదరము, నత్యంతాభిమానమ్ము, బం
చెను లంకాధిపు డంత దానవ జన క్షేమంబు డెందంబులం
దనుసంధించుచు – సైన్య నాయకులు – ధైర్య స్థైర్య ఖడ్గమ్ము లే
పున ఘాటించగ, చిత్తమంచు జనిరా పెంపున్, వడిన్, జూపగన్

823. సైన్య జనాభినంద్యమగు సంస్థిత కృత్య మొనర్చబోయి యా
సైన్య వరీయులైదుగురు చండభ తుల్యు కపీశుపైన, ప
ర్జన్య కదంబకమ్ము వలె సందడి మూగిరి; మూగి, వేగ – న
న్యోన్యము నెత్తులిచ్చుకొని – యగ్గలికమ్మున ముట్టడించుచున్



824. తీరుల్ వేఱుగ, వేఱుదారుల సముద్వేల ప్రసవ్యమ్ములన్
బ్రారంభించిరి ముట్టుకోలు, కుమతుల్, రౌద్రోద్ధృతిన్ బెక్కులౌ
నారాచాస్త్ర విశేష శస్త్రముల కన్నార్పంగ వీలీయకన్;
పేరుల్ దుర్ధరు లాది కావె! కలవే – వేర్వేరు వ్యాఖ్యానముల్?

825. వేలకు మించు సైన్యముల, పెక్కు విధంబుల యాయుధంబులన్,
గాలుని మించు నాయకుల, గట్టవలంతియగాని వాజి సర్వమున్,
దేలిక చూపు చూచి – హరి – తీవర బెట్టుచు, నార్చిపేర్చి, యీ
యాలము బంతియాట యవునౌగద – నాకను భావమిచ్చుచున్!

826. ఒక్క భూజమ్ము సులువొప్పు యోజ నెత్తి,
తిప్పి గిరవాటు వేయ, నది యెగసిపడె,
గాలదండోపమితమయ్యె, గారుబారె
యయ్యె, దట్టు కోలేని యాహనన మయ్యె!

827. పంచారించిన సిలుగై
సంచలన క్షోభకు గురిసలిపెను – కపి – రె
ట్టించిన హింస్రుండయ్యెను,
పంచచమూపతుల పాలి భానుజు డగుచున్

828. రాలచే, దండములచేత, వ్రాకుచేత,
వేటు కొక్కడు రాలెను, పిడికి లొక్క
టి సరిపోయెను – మేటి రక్కసుల కెల్ల,
బట్టి దైత్యుల బరిమార్చె బ్రబలుడతడు!

829. పెద్ద బలగము, బలగపు పెద్దలెల్ల
కపి మహాబాహు చాలన కార్యమందు
గాలిబడు పేలపిండి వక్కాణమైరి;
పంచబంగాళ మైరి ఆ పంచవరులు!

830. ఓడుటె కాదు వారటుల నోసరి, యాపయి గాలకంఠునిన్
గూడిరటన్న వార్త – శతకోటి మృదాకరపాతతుల్యమై
కీడుగ జేర – రాజు – కనుగీటుల – మండెడు కొల్మి కఱ్ఱులౌ
జాడల వారి వీరి పయి చయ్యన గ్రుచ్చుచు, రోషవేషుడై

## అక్షకుమారుని దాడి; ఓటమి– శరీరపతనము

831. చూపుల నక్షకుమారుని
వైపుకు ద్రిప్పగ, నధిపుని భావము గొనుచున్
దా పండిన తెలివి సముచి
తోపాయము నీయ – నక్షు డొబ్బరికమునన్

832. వినయ పరిమళవ్యాప్తి ప్రవృత్తి దనర,
లేచి నిలువబోనంతలో – బూచె దలపు
లోమది, యొక రెమ్మవలె విలోలమయ్యె
భావన; చలించె; ఘటనల వాతి యూప!

833. నడచున దెట్టి కార్య మయినన్ బ్రభు నాజ్ఞకు లోగి, యొంగి, నా
మడుపులు చెల్లునన్న – ముఱి – నొక్కుల యుద్ధతి వల్లగాదె యీ
నడకలు? పిన్నవారలము, నాడి నెఱింగియు బల్కలేముగా –
కడబడి నిప్పుతోడి చెలగాటము లాడుచునుండె నక్కటా!

834. ఇంతకు ముందు పోయినది యేమని గాని, మరింత ముందు కా
నంతలవేల సాగగలవంచును గాని – దశాస్యులైన మీ
యంతటి వాని కీయ దగునా పది ప్రశ్నలు? గ్రుడ్డు పిల్లక
త్యంతము చిన్నదే, చులకనైనదె – యంచును మిన్న కుంటినే!

835. ఇటనెదొ తప్పు దొర్లినటు, లేదొ కలంత నెడంద పట్టి న
న్నటు నిటు నెట్టు చుండినను; యాశరనాయకు – నిర్ణయంబు కే
నెటుల మదీయ భావముల నీకొన జాలుదునన్న యొక్క – సం
కటమున జిక్కుకొంటి, దగు కాలము వచ్చెను నాకు – పోయెదన్!



836. పరిపరి విధముల స్వగతపు
టరలంటిన తలపులెల్ల నటుయిటు లూపన్;
దొర కనుసన్నల గుఱుతున్,
గరుజున్ గొని లేచె నక్ష ఘను డన్వీక్షన్

837. ధనువున్ బూనిన బాహుదండ మురమున్ దట్టించి, శ్వాసక్రియో
ల్బనమున్ రెక్కొలుపంగ, దేహము రణాబంధమ్ము గాంక్షించ, శ
క్తి నితాంతోద్ధతి ముందునిల్వ, నిలిచెన్ దీక్షాక్షుడై యక్షుడున్ –
బనిమంతుల్ తెలియంగ జాలుదురు సప్రాధాన్య కర్తవ్యమున్

838. తరగల యోచనల్ కదలి, దర్పము మోమున బర్వజేయ – దా
జరణము లంటి లేచెను దశాస్యున కక్షకుమారు డాపయిన్,
వరుసగ పల్కులేవొ తన వాతెఱ దాటగ బోవునంతలో
సరగున వాటి మ్రింగుకొని, చార్విని లోమది గుందె నీ గతిన్

839. పటుతర శక్తియుక్తి బరిపంథుల నుక్కడగించి మించి, యా
చటుల పరాక్రమాన్వితుల, సంస్థిత దిక్పతులంత వారి యు
త్కటమగు కండకావరము ఖడ్గపరంబును జేసినట్టి మీ
రిటు మము బోంట్లనున్ మఱతురే! సరియన్నదె చాలు, పోయెదన్

840. ఇంతగ బోవు కాలమున కీగతి నీ యవకాశమందె – మీ
యంతటి వాని గా నయిన, నారట పెట్టగలాడ శత్రువున్,
బంతము మీఱ మీఱగల వాదర దీరిచి క్రోతి గూల్తు – నా
యంతరు వెంచి బంపుడు, లయగ్రహణమ్మ జయమ్ముగా నిలున్

841. ఎట్ట గన్నేరు లొాక కోటి యెచ్చరించి
పూచె నన్నట్లు తీంద్రమ్ము పొడమె కనుల
ప్రగుణ వినయ ముద్రాయతబంధ శోభ–
రూప సౌందర్య దీప్తుల రోకు గలిసె!

842. క్రియ – రూఢిన్ కయిసేత జేయగ, తదంగీకారమున్ బొంది, న
క్షయు డొక్కుమ్మడి స్యందనమ్ము పయికెక్కన్, వెంట సైన్యమ్ములున్
శయువుల్ భంగిని సాగి, రాజనిరి; రక్ష స్వామికిం 'జే'యటం
చయమున్ గుండెలనింపుకొన్నవి భవిష్యంబేదొ యూహించుచున్

843. అష్ట వాజిని పూన్చిన స్యందనమ్ము,
నతి తపశ్శక్తి ఫలమగు స్యందనమ్ము,
నరి మనోవేగము మలచు స్యందనమ్ము –
నక్షుడట జేర్చె– సంప్రహారాంగణమ్ము!

844. అక్షుండరిభీకర ధూ
మ్రాక్షుండుగ, సాధిత కదనాక్షుడుగన్, దా
మ్రాక్షుండుగ, దర్పోద్ధతి–
గౌక్షేయకము ఝుళిపించి, కపి సముఖమునన్

845. నిలిచెను, నిల్చి చూచె – మహనీయ పరాక్రమ ముల్లసిల్లు నా
బలముల కెల్ల మూలబలభద్రుని, విక్రము, రుద్రు, బావనిన్,
విలయ విధాన సంగ్రహము పిండలిగా గొని వైరి పైన, మొ
క్కలముగ గొట్ట సిద్ధమగు గండడు నా గనిపించు వానినిన్.

846. దీపిత దక్షుం డక్షుం
డా పింగళవీరు రూప మారజము గనెన్.
గోప ప్రతాప ధగధగ
లేపున నవ నాడుల బ్రవహించగ నిల్చెన్

847. ప్రళయ కాలాగ్ని వోలె నా వాయుసుతుడు,
కాల వహ్ని నించు ప్రళయకారి యనగ–
నక్షు– డెదురెదురుగ నిల్వ – సాక్షులెల్ల
రేమి, కర్మ సాక్షియు దత్తఱించి రపుడు!



848. చిత్రభానువు తనకేల చెమట పట్టె
ననియు; గాడ్పేల తన కూపిరాడకుండ
పోయెనని, వార్ధి తనకేల పోటు, యాటు
గాలి బోయెనే యనియు, కల్లోల పడియె!

**అల్పాక్కర**

849. వీరధ్వని, కదనవిదు డక్షుడు
సారించె వానర సైన్యముపై
నారాచ ధారల –నాయాసపు
నేరిమి, పోడిమి, నిగుడించగాన్

850. నరభుజ శౌర్య సంధానితమౌ
శరకిరణమ్ములు సామీరికి
శిరమున సీసక శ్రీనిభమై
హరిపదమణి జేసె హరివరునిన్!

851. తతసుతు – భుజోరు విక్షేప దర్శనమ్ము,
హనుమ – పరిఘోష ఘోషమ్ము వినుట – చాలు;
వజ్రదేహుని బలవీర్య వర్ధనమ్ము
గనుట చాలు; నదృష్ట సాకల్య మమరు!

852. కన్నులు విచ్చి చూచె, తటకాపడె నక్షుడు – వానరుండు కా
డన్ననె యొప్పు వీనిని, మహానగమో, మహిషంబొ, యేనుగో
యన్నటులుండె స్థూలమగు నాకృతి, దోర్బల సాధ్యు డీత; డె
న్నెన్ని విశేష శక్తులకొ యిల్లన వచ్చును వీని దేహమున్

853. జగదేకోజ్జ్వల శౌర్యసాహసము లుచ్చస్థానముంగోరి యీ
నగచారిన్ వరియించి వీని గలిసెన్; నానావిధావస్థలం
దెగతీతల్ దిగతీతలయ్యె సమరం బీరీతి; నన్ నిల్వరిం
చగ తానే తగువాడుగా నిలిచె, దేజస్ఫూర్తి రాజిల్లగన్

854. అక్షకుమారు డీ విధి హృదంతరమందు దలంచి పావనిన్
దీక్షగ జూచె; 'వీడొక హతిన్ ధర జీల్చగలాడు; శూరు డా
వక్షము చెప్పుచున్నదదె – వాక్కుల కందని వీరగాథ' యం
చక్షయ నీతి సారమున, నా రిపు మెచ్చుచు నిల్చి యుండగన్

855. ఇటు హనుమంతుడున్ రిపు నదే విధమైన వెఱంగు తోడ గాం
చుట సహజంబు నౌ ఘటన సూ! యితడేమి? పరాక్రమంబునన్
ఘటికుడు! రూప సాహసముగా గనిపించుచు నుండె; నేలపై
జటుకున దించి బాణము, చయ్యన నజ్జకు నద్ద మిచ్చెగా!

856. పసిదనమెంతొ ముచ్చటగ బట్టును వీడక యున్న గాని, దా
బసదనమెంతొ ముచ్చటగ వాడి వసిన్ గడదేఱి రా
హసనములో విదల్చి యరుణాననుడై యిట గ్రుమ్మరించె – న
భ్యసిత వివేక, వీర, సమయస్ఫురణాది గుణంబు లేచగన్!

857. ఇట్టి తలంపు సాగి పొడిగించుచు బోవుచు నుండ – నాగె, జే
పట్టిన కార్య మొక్కపరి – వాలుకు లాగ దలన్ విదల్చుచున్;
బట్టెను పావమాని రిపు బ్రాణపు బట్టుల, కాళ్ళు బట్టి – వే
గొట్టెను నేలకేసి యరికుట్టుసుఱట్టిటు దేలిపోవగాన్

858. అంతటి సంగరమ్మునకు నాధ్యుడుగా, బలశాలిగా నటన్
గంతులువేసి, మొగ్గరము గట్టి, కపీశుని నిల్వరించి, వి
భ్రాంతి నొసంగి కోలల బరాక్రమ తేజము జూపినట్టి – వి
క్రాంతుడు రాజనందనుడు – గావున గేకలు వెట్టి యీలిగెన్!

859. రెచ్చగొట్టబడిన కరి పెచ్చరిల్లి
తొండమున బట్టి యొక్కని బండకేసి
బాదినట్లయ్యె, కసికసి మోదినట్లు
నయ్యె – నొకపదచిత్రమ్మె యచ్చు పడగ!

860. క్షమయె దుమ్మురేపెను, తరంగముల బెంచె
వార్ధి; ద్యుమణి చల్లబడియె; వాయు వొక్క
సారి స్తంభించె, నిక యాకసమున సహజ
వర్ణ రాశిక్యమది మాఱె; వాసి మాసె!



## రావణ విచారము – మంత్రాలోచనము – ఇంద్రజి సంరోధము

861. అక్షకుమారు దంతటి మహారథు, భీకరు, నొక్కకోతి, యీ
రాక్షస శక్తి నే వెస బరాచిక మాడుచు, బోరి, పోరుచున్,
కక్షను సంతరించుకొని, గ్రక్కున ద్రిప్పుచు, గొట్టి కొట్టుచున్,
శిక్షకు శిక్షగా మరణశిక్ష విధించె, యదృచ్ఛ మీఱగన్

862. అక్షయ వీరునే యుఱిచి యాడె, ప్లవంగ విశేష వీర్య సం
వీక్షణ మాత్ర భీతులయి వీకను పాఱిరి రాక్షసాదు, లీ
పక్షము వీగి పోయెనని – స్వామికి జల్లని వార్త – నొక్క ప్ర
త్యక్షియె తెచ్చె – ఘోరము, విదారణమున్, వివరించి చెప్పగన్

863. అంతటి దక్షు డక్షునకు నా విధి నాయువు చెల్లెనన్న వృ
త్తాంతము – సైపలేని పరితాపశరమ్ముగ దాకి, తాకి, శు
ద్ధాంతము లోని వారలను తల్లడ మందగ జేసె, రాష్ట్ర మం
దంతట నెంజలిం బొడల యానము బర్వెను, నీలి నీడలన్

864. అధిపుడు మూర్ఛపోయె; క్షణమందున దానుగ దెప్పరిల్లె, నా
విధికృత దారుణమ్ము విని విన్నదనంబున దల్లడిల్లె, నం
బుధి బడబాగ్ని యయ్యె మనమున్, గడు పొచ్చెము మ్రింగలేని యా
మధురము కాగ, బండ్లురియ, మల్లడి, క్రుద్ధత, బాధ – మ్రింగుచున్,

865. పిడికిలి గడ్డము క్రిందుగ
నిడి, మో చే యది కాలి నెక్కగ, దేహం
బెడమ కొకించుక వాలగ,
నొడయడు నాలోచనబడె, నొకడై తలచెన్

866. ఎట్టి దుర్వార్తనైనను తట్టుకొంటి
గాని, ఈనాడు – వాడు నేనై న వాడె,
పోయెనే! గుండెలే జారిపోయె నకట!
లిప్తలో రాలి పడె నా కలికి తురాయి!

867. ఎల్ల యసుకంబు లొక ముద్ద నెనిపి పెట్టి
నాడు నా యరచేతిలో - నంజ కాగ,
దారు తుల్యుడు మా అక్ష ధీరు నడచి,
నా యనామికనె చిదిమినాడు - కపియె?!

868. కచ్చె దాడించి తన్నెను కసురుగాయ,
ముల్లు గజ్జి గెలికె నసమ్ము, గరువమ్ము,
నెగుడు మోముపై చఱచెను నిక్కులుడుగ,
బొందళము - బల్మి బెఱకెను - బొందనిడెను!

869. అని తలపోసి భూపు, డదనౌ పనిగూర్చగ గొల్పు దీర్చె, రా
బనిచెను శూరులన్; మెతిక వంటిడు, ధీరుని - నింద్రజిత్తు; వా
కొనె 'దమరందఱున్ వినిరి; కూలెను దైత్యసుదాము డక్షు డా
ఘను మరణమ్ము నా యెడద గత్తిని దించెను, శక్తి నార్పుచున్;

870. గళమది రుద్ధమయ్యె; దశకంఠుడు దండితనమ్ము మధ్యగా
కళ పెళయైన కస్తి, యసుకంబుల చాయ గదల్చి యిట్లనెన్-
దళమున వీరులెల్ల కపి తాపుకు పోయిరి, వింటిరే గదా,
బ్రళయ మహాశివుండు మనవాడగు నక్షుడు, యక్షుడే.......

871. ఇటులను పదము, పల్కు - బూరించలేక
పోయె - నంతటి దిట్ట, యపూర్వ ధీరు
డా దశాస్యప్రభువు; క్షణము గడువ,
దనను తానె నిలువరించు కొనుచు నుడివె,

872. ధైర్య పరాక్రమమ్ములు, ప్రతాపము, శౌర్యము, పట్టు, సాహసౌ
దార్య గుణమ్ము లన్నిటను దక్షుడు - కేసరి వంటివాడు, నా
ధైర్యపు మూర్తి వాడుగద! దైత్యుల బుట్టుట పాపమయ్యె, యీ
చర్యకు సాటిలేని, యొక సామ్యములేని జవాబు పోవలెన్



873. సర్వ ధరాధిపత్యమును, సర్వ జగద్రమణాధిపత్యమున్,
ఖర్వము, సర్వ మీ గతి నఖాతపు లోతుకు దించె క్రోతి! ఈ
నిర్వహణమ్మె వాస్తవమ? నేరుపు చచ్చెనె, సిగ్గుగాదె, యా
కర్వలిపట్టి బట్టి, సడి గట్టక, కొట్టక - నిద్ర బోదురే!

874. మారణ హోమమే సలుపు మాయలమారియె వానరమ్ము? మీ
శూరత ప్రశ్న యయ్యె! నటు చూడుడు! యోచనలేల పొండికన్
వైరికి బుద్ధి జెప్పు, జొరబాఱగ సాగు దశోక వాటికిన్,
దారికి దెండు క్రోతిని, యథాజను కాసుర శక్తి దెల్పుడీ!

875. అని తా నుండిన భంగిమ
మును మార్చుకొనె - కుడికాలు ముందుకు మోడ్చెన్,
స్వనమున నభిమానపు తెర
తనరగ, సుతు నింద్రజిత్తు దడవుచు నిలిచెన్

876. పొలపము జల్లు కారుమెఱపుల్ బలె జూపులు బర్వ, జంట త్రా
చు లెదురుగా బుసల్ బుసల చోక్షముగా గదలాడు భంగి - యా
మల భృకుటీ సరమ్ము తఱుమన్, దశకంధరు డాననంబుపై
కలితన మగ్గలించ, గడకన్, గడకట్టును దెల్ప నిట్లనెన్

877. ఎదియొ దొసంగు సాగెనని - యెన్నియొ తప్పుల సేతురెందఱో-
హదనుకుదగ్గ మాటల - మహాత్ముల వోలె వచించుచుందు, రా
పద దఱి జేర వేరుగతి బల్కుదు; రా యవకాశధోరణిన్
గదలెడు వారమే మనము? కార్యము, దత్ఫల మస్మదీయమే!

878. అస్త్రిని గోలుపోతి, వెఱగందుట లేదు నిఘంటు వందు; నీ
కస్త్ర చయమ్ము సాధిత మహాఫలమే కద - యింద్రజిత్ సుతా,
శాస్త్రము లోతు జూచితివి, సంగరనీతిని పెద్ద మాటవే,
శస్త్రములన్ బ్రయోగగతి సంకలన మ్మొనగూర్చ బొమ్మికన్

879. ధీర పరిపాటి రవణిల్ల బోరుసలుప
గలుగు దేవేంద్ర సమ పరాక్రముడ వీవు.....
వరదుడు చతుర్ముఖ ప్రజాపతిని హృష్టు
జేసి బ్రహ్మాస్త్రము సముపార్జించి నావు!

880. ఉన్నది నీకు శత్రువుల యొద్దను, నాడిని బట్టు శక్తి; నీ
కున్నది ధీ; తపోబలము నున్నది; యున్నది నీకు దీవసం,
బున్నది నీకు విన్ననువు, నున్నది పన్నిక, మెంతొ సత్త్వ సం
పన్నత, యింద్రజిత్! తలను వంపక సాగి, జయమ్ము దెమ్మికన్!

881. తపమున, విక్రమంబున, విదారణ తంత్రములందు, నీవు – నా
కుపమితి వన్నమాట మది యొప్పును; యెత్తులయందు పెద్దవౌ
యుపమరి వీవు – యింద్రజిత! యుప్పర వీదికె యెత్తి తీవు వే
లుపు రిపు శౌర్యకేతనము; లోకము నివ్వెఱ పోవ సాగుమీ!

882. సర్వమెఱుంగు గొప్ప బలశాలివి నీకిది చెప్పనేల? యీ
కర్వరి గర్వము న్నిలుపగా నిలు మా కపి శక్తి నెంచి – నీ
గుర్వవరోధమున్ రచన గూర్చుచు సాగుము, విక్రమ శ్రవః
పర్వమొనర్చి మాకు జయ పర్వము నిమ్మిక – యింద్రజిత్ సుతా!

883. అతడొక వానరాధముడ టాయుధ జీవుడు కాదు, సైన్య సం
తతి యది లేదు, కాదు పురుదంశుడు, కాలుడు గాడు, కాదు – వ
హ్ని; తతసుతుండు మాత్రమని నీవును వింటివికాదె – వానికిం
జతయగు వ్యూహ మేర్చుకొని సాగుము, మిక్కిలి చెప్పనేటికిన్!

884. కార్యరంగ ప్రవేశమ్మె ఘనతరమ్ము
కాగ పొమ్ము; చూచినయంత – ఖలుడు – తత్త
ఱ పడి పాఱగా వలదె; వరసుత! వాని
గంతగల్చి, యోర్చి, జయించి, ఘనత గొనుము

885. తలచగ నిన్ను బంపు టుచితంబగు కార్యము కాదు, కాని – య
త్యలఘు వివేకశీలివని, యాశయ సాధన కీవె తోడ్పడం
గలవని, రాజధర్మము జగమ్మున నిల్పు సమర్ధతా గుణం
బుల గణియించి నే నిటు లపూర్వపు నిర్ణయముంబొనర్చితిన్!

886. అని వాకొని, తన కర్తవ్యము
వినిచిన జనకుని గని, కడుపెంపును, మర్యా
దను; మునుపే – తలపోసిన
పని – లభియించినదని యొడబడు – డెందముతో,



887. ఇంద్రజి తండ్రి జూచి తనదైన గభీర విధేయతా గుణం
బింద్రియ ధర్మమై వరలి, యీరిక చిర్నగవున్ మెదల్చ, ని
స్తంద్ర సువీర్య శౌర్యముల సంగతి నిల్పిన మూర్తిమంతమై
ఇంద్రవిధాయకమ్ము నియమించ, దలంచె నెడంద లోతులన్

888. ఏదో బ్రహ్మము మూలధాతువయిపోయెన్ గండశైలమ్ముగా,
యేదో రౌద్రము జీవమార్గమయి పోయెన్ స్కంధ శాఖాకృతిన్
యేదో వైష్ణవ విస్వరత్వమది యయ్యెన్ దంతునాభమ్ముగన్
న్నేదో దోష విఘూర్ణితాక్షుడుగ నాయెన్ – వింత, వైదేహకుం
డై – దాయంబున విన్నబోయె బిత, సత్యంకార సంశ్లిష్టుడై!

889. అని యేమేమియొ తత్త్వము
పొనపొన మదిలోన యెత్తిపోతల నింపన్,
దనుజాధిపసూనుడు, చిం
తన నళినము గోసి, తండ్రి తఱిగా నిడుచున్

890. కరమొప్పన్ జనకుండు ముందిడిన దీక్షాస్తీర్ణ వాగాస్తరం
బిరవారన్ దగు దారి జూపగ, శుభాభీష్ట ప్రతీకమ్ము కై –
వరధర్మస్థితితో బ్రదక్షిణము సంభావించె – నా యింద్ర జి
ద్వరు డా వెంటనె పొంగుచున్న వరుణావాసమ్ముగా సాగగన్

## ఆంజనేయ – మేఘనాద కదన కేళీ విన్యాసము – బ్రహ్మాస్త్ర వినత హనుమ

891. అధిరోహించెను స్యందన
మధిప సుతుం, డపుడు మృగము లాక్రందన మ
త్యధికము జేయ; ననియు, నా
విధమును గన ఖేచరవర వేదిక యమరెన్

892. ఆనతి బేర్చి సాగిన రథావళి మ్రోత, పదాతి సైన్యముల్
ధ్వానము లేచి సాగుగతి – వాజి, మదేభ, మృగేంద్ర జాలముల్
జానువడంగ నూన్చుకొని సాగెడు చంకర వాహనంబులన్
దాను వినంగ, గానగ, సదాగతిసూను డొగిన్ హసించుచున్

893. కాలు దువ్వె – బౌరుష వృత్తి పాలు పడగ,
సింహనాదము జేసె, బెంచెను శరీర
మొనర – నాజ్య హవిద్ధృత హోమ వహ్ని
కీలగా యెగసి నటుల – కీశుడపుడు!

894. ఆ నాదంబున కంతకింత సమమౌ – జ్యాధ్వాన మావేదితా
హ్వాన స్వానము జేసి – రావణియు సౌహార్దంబు బండించు వీ
క్షా నారాచము బర్వజేసె; సమయాక్రందమ్ము బ్రేరేచ, బ్ర
ధ్నా నిర్వాహకు బోలె లేచెను హృదంతర్వీధి గర్జించగన్

895. కదువడి మేఘనాదుడు ఖగమ్ముల బారుల వేనవేలుగా,
మిదుతల దండుగా, పయికి మెండున గ్రమ్మగ, నాంజనేయుడున్;
తడబడకుండ నాతనిని దల్లడ మందగజేసి, విన్నుపై
నడరుచు లేచి తప్పుకొనె నాశుగ చక్రము, యుక్తి చొప్పడన్

896. మఘ విజేత నాళీకముల్ మరలజేసి
చదలు తెరువుల గ్రుమ్మరించ, హనుమంతు
దేమి తక్కువ తినెనె? తా నెఱచిదిండి
నపహసించి, చెచ్చెర దిగె నవని కపుడు!

897. ఈ దోబూచుల యాటల
నా దివి దేవులోక వేడ్క నలరొందగ, నా
పై దుస్సాధుతర స్థితి
భేదనము పరస్పరమట వెక్కసమాయెన్.

898. లూమిని జూడగన్ – దిటవులోతును, సాహసశక్తి యుక్తులున్,
భీమము లన్ని యెంతటివొ ఫేరవు కందక బోయె, వాని ధీ
స్థేమ విశేషసారములు, జేతల పట్టులు, వ్యూహ సాధన
స్తోమము నాంజనేయునకు జోద్యమె యయ్యె, పరస్పర స్పృహన్

899. ఒకరి కొకరు దుస్సహముగ,
నొకరి పయి నొకరు కసి మొనలుఱికించుచు – బూ
నిక – గాలదండనిభ స
స్యకముల నొండొరు లెనసిరి – చల మెసరేగన్



900. అంతట మేఘనాదుడు – మహత్వ చరత్వ పటుత్వ శస్త్రముల్–
సుంతయు నాంజనేయుకడ జొప్పడకుంట మదిం గలంచ; నొ
క్కింత వివేకమే తుఱగలించ, రణోచితవృత్తి – నంచమా
వంతుని యస్త్రమే వదలె పావనిమీదకు విక్రమంబునన్

901. తన చరణమ్ము లాగ బృషదంశ తనూజునకున్–గతిస్థితుల్
దనుజుని మేటి సాహసపు తాకును, నస్త్రపు పట్టు లీయా–భా
వన లౌకమారు సంస్కృతికి వచ్చె, హసించె, బరాక్రమావరో
ధ నియతికిన్ విధేయుడయి, ధాత్రిపయింబడె గౌరవంబుగన్

902. బ్రహ్మాస్త్ర బద్ధుడై పడియున్న పావని
గని – యింద్రజిత్తనుకొనెను – మదిని;
కాంచగల్గితి వజ్రకాయ వికాసమ్ము,
దప్త కాంచన దేహ తరుణ శోభ,
సీసమ్ము కరగించి – సేకమ్ము బోనీక
పోతపోసిన రూపు యీతడయ్యె;
బలుకు, పద్ధతి, ధీరపరిపాటి – తనదైన
యొక మాదిరి నడక నొప్పె నితడు,
తీరు వేరైన బవరపు దారి తెలిసి,
కోల లేకయె మా సేన దూలనేసె,
నాకు సరిజోడుగా నిల్చి తాకు జూపె;
నంత వాడౌట గాదె – బ్రహ్మాస్త్ర మోర్చె!

903. అగ్ని స్తంభము వోలె లేచె నిట, తానై తాను రుద్రుండుగా
భగ్న భ్రాంతిని నిల్పె శత్రువును, విభ్రాజిష్ణువై వెల్గె – ని
ష్యాగ్ని ప్రాభృత భూషణాంగుడు – నిజ స్వాభావిక స్ఫూర్తి; హృ
న్మగ్నంబయ్యెను – వీక్ష్యదృశ్యము, సమానాభ్యాశ భాగ్యమ్ముగన్

904. అమితాటోపము ముద్రగా దనరు నుద్యద్భీమ రూపమ్ము; సృ
క్వము వెల్విచ్చెడు మందహాసమును, డా–కై–జూపు – సంరక్షణాం
కము, ఆపై కరమందు శస్త్రములు – లోక త్రాణ శౌటీర్య వి
క్రమ చిహ్నమ్ముగ నిల్వ, వాయుసుతు సాక్షాత్కార మేపారగన్

905. తెప్పలార్పక కపిజూచు రిపుడెడంద
దరులు – సరిజేసి కొనియె నిబ్బరపు పలక,
మనము గలగల జాలెత్తె – గొనము కదల,
బంటకాల్వకు నీరెత్తు వైళమయ్యె

906. జిత పాకారికి యోచనల్ సెలగి, యుత్సేకమ్ములో క్రొత్తవా
చిఠి చింతల్ హృదయోత్పలమ్ముపయి నిల్చెన్, తెక్కలల్లార్చుచున్,
దత సంధానమ దెంతగా చెలగినన్ దాత్పర్య పానమ్ము – మా
నిత మాధుర్యము కాదె, యందునను కాంతి క్రాంతి హత్తించినన్!

907. ఈ విధి మేఘనాదుడు కపీశ్వరు గూర్చు తలంపులందు, స
ద్భావములందు మున్గి నిలువన్, దనుజాధిపు సైన్య ముత్సవ
క్రావడి పొంగ మర్కటపు గాళులు, జేతులు, నెల్ల దేహ భా
గావయవమ్ములున్ గలిపి కట్టగ కట్టగ సాగి రుద్ధతిన్

908. అది గమనించుచుండ హృదయమ్మున కమ్మని భావజాలముల్
పదిపదు లౌచు దగ్గరకు వచ్చె; చతుర్ముఖదేవు హార్దమే
వదలగ జేయు కట్టులను, పట్టులనన్న రహస్యమెంచె, నె
మ్మదిగొని యంజలిన్ నిలిపె – మర్కటమూర్తి పితామహ స్పృహన్

909. సంహత ద్రుమ చీరల, జనపనార
త్రాళుల – మదపుటేనుగు దత్తఱిల్ల
జేయగలరె? కాలగతి వశము కట్టు
బడిన – పెంపు సొంపు లెలమి సడలి చనునె!!!

910. ఆశ నిరాశ లేని మహితాత్ముని, నద్దముపై నువుగింజ వంటి యీ
కీశము; నెత్తికోలనెడు యీటియ, నింతటి పుట్టు బుద్ధు లా
పోశన బట్టి నట్టి నృగవున్ – వటి గట్టి బిగించనౌనె – యే
పాశము లావు నీ పరమ పావని, పావకమిత్రసూనునిన్!

911. ముందుగ బావమాని ప్రభు ముందఱ నిల్పగపోవు రాక్షసుల్
జిందులు ద్రొక్కుచున్, బరుష చేష్టల నింగకు ముందు వెన్కలన్
సందడి జేర్చి సాగ, రభసంబున దానును పాత్రధారి య
య్యెం దను జాగ్రగణ్యుసుతు డింద్రజి; పావని యేగె వారితోన్



**రావణు కొల్వుకూటము – హనుమ ధీరగంభీర వృత్తము**

912. అదియే రావణుకొల్వుకూట మదె లంకాధ్యక్షు, డా క్రేవగా,
నదె వర్ణక్రమ మందు రేఫఅల ధ్యేయవ్యత్యయవ్యాఖ్యనాన్
బదనౌ పోడిమి మై విభీషణుడు, కుంభ శ్రోత్రుడున్, బొంత – రా
ట్పుదశా ప్రాపక సంఘమెల్ల తలకట్టుల్ వోలె; నా మధ్య – నొ
ప్పిదమౌ యొత్తులు వోలె సభ్యజనముల్ పెంపారి కూర్చుండగన్

913. అమిత భుజా విభూతియు, ననల్ప సువీర్యము వెల్గు లీనగన్,
సమధిక భంగి – గెల్పు – తన సంగ్రహమందున బట్టి నిక్కి – యా
గమనమె జైత్రయాత్రగ ముఖంబున వెల్గగ నింద్రజిత్తు – రా
ట్సముఖము కేగుదెంచె – బటు శక్తి గభీరపు రాక పోలికన్

914. వానికి వెంట సైన్యము స్వామికి జేయని, హై యటంచు నా
జ్ఞా నియమంబులెల్ల నెడసంగతిగా నొక వైపు నెట్టి – రా
నూనెను; వారి మధ్యగ సముజ్జ్వల ధీర గభీర భంగిమన్,
వానరవీరు డందముగ వచ్చెను – దానవనాథు కొల్వుకున్

915. వానరవీరు, వాని తలవంచని ఠీవి, పదమ్ముబల్కి, యా
స్థానమునం దలక్ష్యమగు జాడ నెఱింగిన రాక్షసాదు లీ
వానరమున్ వధించు డటుపై, దహియించుడు, నంజుకొండు, మో
సాన వనంబునన్ రగడ సల్పెను, వీనికి బుద్ధిజెప్పుడీ!

916. అని హోరెత్తించిరి రావ నాదముల; దీప్యద్భానుబింబాస్యుడౌ
హనుమంతున్ గని మంత్రిపుంగవు లమేయాశ్చర్య సంరంభులై
పెను మబ్బొక్కటి ప్రోవుగా గొలువు నావేశించెనన్నట్లు – శా
సనకర్తన్, మఱి వాని సూను, గపి, గాంచన్ సాగిరుత్సాహులై!

917. పయ్యరకుఱ్ఱ దప్పుడు సభాభవనమ్మును పాఱజూచి, ఓ
రయ్యొ, యిదేమికొల్వు? యితరంబగు వర్ణనలేల – పంట చే
నొయ్యన యుల్లసమ్మిడగ, నోరగ గాలితొ నూసులాడుచు
న్నెయ్యము కూర్చుచున్నటులనే, కనిపించుచు నున్నదీయెడన్

918. అనుకొని సాగుచున్, నడిచి, యల్లన యోలగమందు మధ్యకున్
జని - పెనుపెంచి, సంభ్రమ వశంవదలోచనుడయ్యె, లో - తలం
పున రఘురాము నిల్పి, యరబూచిన కన్గవ నుండి - దృష్టి - ము
క్కున నిలిపెన్, మెలంపసురకోటిని జుట్టుచు నిగ్గుచుండగన్

919. పఱతెంచిన కొమరుని కిడె
నిఱిగౌగిలి - నెఱచి దిండి యేలిక - యటుపై
యెఱుకల్ యెఱిగెను, కన్నులు
మెఱుగులు విసర, గనియెన్ సమీపాంకమునన్!

920. అనుపమ తేజోమహత్త్వ సంస్థానమై
తనరు సురుచిర వదనము వాడు;
నిబిడంపు రోమముల్ నిగిడారు కాంతులు
లోహితమ్మయి వెల్గు దేహి వాడు;
శంకర కైంకర్య సంపాదితశ్యేన
సంవీక్షణాస్త్ర విస్తరము వాడు;
వజ్ర నిర్భేద్య సంబంధ సంకేతమై
యలతిగా భిన్న మౌ హనుమ వాడు;
వాని గాంచి దనుజ సార్వభౌముడపుడు-
వానిలో గాంచె - మూర్తీభవత్పరిశ్ర
మమ్ము - దీక్షణమ్ము; నొక్క క్షణమ్ము తలచె
'వీడు సామాన్య లాంగూలి కాదు, కాదు!'

921. రోష మౌఢ్య సంవర్తిత రోసితాక్షు
డగుచు - రాక్షసాధిపు డమాత్యవరుల కను
శిష్టి నిచ్చె - 'నెవడిట వచ్చేయ నేమి
కతము తెలిసి, తెలుపుడు - శీఘ్రముగ ననుచు

922. కంది చేనిని చెడద్రొక్కు కర్జమందు
నొడలు యొడలెల్ల కందినట్లుండె, వీని
బలము బలమెల్ల బలవృష్టి పదను కొనియె,
కాదు, ఝుంఝులో తలనిల్పు గడ్డిమొక్క!



923. అవతారంబది యేదొ మానసమునం దక్షిణ సత్త్వైక వై
భవమూర్తిన్ దొరయించుచుండె, నిక దర్పంబొప్పు సందర్భపుం
సవ - పల్కున్ మదినింపుచున్నది, 'నగస్థానీయుడౌ క్రోతికీ
జవ మెట్లబ్బిన? దచ్చుబోసికొనెనే - సంసక్త సంస్కారముల్!'

924. అని భావించెడు రావణు
మనమాశంకితమయె; సభ - మౌన ప్రాలే
య నియమిత మయ్యె, నాపై
ననిల స్తంభనము సడలె, నాస్థానమునన్

925. సందర్భంబట నీ ప్రకారముగ రక్షః ప్రౌఢు బాధించ, నా
సందర్భం బిదియే ననంగ గపి హర్షారూఢి - లాస్యమ్ముగా
జిందుల్ వేయుచు మోముకెక్కి, యధరస్వీకారముంబొంది, య
క్షిం దోడ్తో తెఱపించె బూర్తిగ - సమీచీన ప్రభాశోభతోన్

926. సాత్వికా కలన తలిర్చ శారసుతుడు-
తిమిరవలయ కేంద్రము మధ్య తీరియున్న
రాజస స్థేమ వీర్య విక్రాంత వహ్ని
శకటి యనదగు వాని యోజ - గనె; నోజ-

927. నల్లరేగడి యచ్చుల నట్టు నందు
పేర్చికట్టిన కుటికలో గూర్చినట్టి
యొక్క గుయ్యార మందున్న చిక్కి గుమ్మ
టమన దగు వాని గనె - మర్కట వరుడపుడు!

928. మేటి వజ్రాల కిరీట శోభల వాడు,
పదికోన లెగసిన పర్వతుండు;
క్రోధ తామ్రాక్ష నిగూఢ రౌద్రమువాడు,
యాశాంబుదోత్సృష్ట యశని వాడు;
ఫాలాంక భాసిత ఫాలతేజము వాడు,
వెలిగట్టు నెత్తు ప్రవేష్టశాలి;

భూషిత భూషా విభూతి భవము వాడు,
భాగ్య పదార్థ స్థావరుడు – వాడు;
వాడు – భీమ విక్రాంతమ్ము పగిది, గంధ
గజము తీరు, వ్యాఘ్రము భంగి, గర్వితేత్వ
రమ్ము వలె తోచె – రాక్షస రాజు – హనుమ
కచట; విస్మయమ్మెగయగా నలల వోలె.

929. మేరు నగము పయిని కాలమేఘ మటుల
నున్న దశముఖు గాంచుచు విన్నబోయె,
నచ్చెఱువులో మునిగె – నెద హెచ్చరించె
క్షణములో ప్రస్తుతము జేరె, సంబళించె!

930. అహొహొ – ఏమి రూపమ్ము, ధైర్యమది యేమి,
సత్త్వమేమి, మహోద్యతి సారమేమి.
సర్వ లక్షణ యుక్త దశాస్యు డహహా!
చూడ గన్నులు చాలని శోభ – యితడు!

931. సుర నికరంబు భీతివడి, చూచియు, జూడక చూడబోయి, వే
మరు తలలెత్తి యెత్తి నతమస్తకులైరట, సాజమే గదా
సురరిపు వైభవమ్మున కసూయయు, సిగ్గును జెందకుండుటే
వెరవగు – వీని సంపదయు, వీర్యముగాంచుటె భాగ్యమిత్తతిన్!

932. స్ఫురిత మనోజ్ఞ రత్న రుచిశోభల వెల్గెడు – సింహపీఠి కాం
తరమున, నప్రసన్నుడుగ, దానొక యించుక యిట్టులట్టులై
సురరిపు దుగ్ర రోష పరుషోచ్ఛ్రయ సూచిత భంగిమంబునం
దిరువది చేతులున్ గదల, నెల్ల సభాస్థలి పాఱజూడగన్

933. ఆ శరరాడ్భయానకపు టానతి గొన్న ప్రహస్త మంత్రి, తా
నాశుగసూనుతో ననె 'వనౌకసమా! నిజమేమొ చెప్పి – లం
కేశుని వేడుకొమ్ము, భయమేమియు లే దన నాంజనేయు డా
వేశము, చిత్తశుద్ధి, సమవేత వివేకము లెల్ల దోడ్పడన్.



934. నిష్ఠ – నిర్వ్యాకులమతియు, నిశ్చలమతి
తనర, లోలోన శ్రీరామ తత్త్వమునకు
భక్తి పూర్వక ప్రణుతి నర్పణముజేసి,
యెదియొ తన్మయత్వము మదియెల్ల నింద

935. ఎదుటి మంత్రాంగ కుశలురయిన – నికుంభు
వంటి సచివమండలి గాంచి – పలికె హనుమ,
హనుమ పలుకుల – తనకథ, వనచరగణ,
కపిగణాగ్రణి కథలెల్ల కదలివచ్చె!

936. ఆపయి వాకొనెన్ హరి – మహామహిమాన్వితు డా రఘూద్వహుం
డా పరమార్యమిత్రు హృదయంబగు జానకి, సీత నెవ్వరో
ప్రాపిత కర్మ కారణము రాయిడి దించిరి, రామ దూతనై
ద్వీపము జేరితిన్ – సతి దిదృక్షను, పేరది – ఆంజనేయుడౌ.

937. లంకను, లంకలోని సకలమ్మును జూచి, పరీక్ష జేసి, ని
శ్శంకిత వృత్తి – సౌధ, గృహ, సద్మ, వరూధ, వేశ – స
ర్వాంకములందు – మా జనని నారయ శోధనజేసి... కంటి..నా
వంక, నశోకవాటి – రిపువంచిత సీతను, మాత, భూసుతన్.

938. తెలిసిన వాడవంచు పలుదేశములందున వింటిమేము; నీ
బలము, బలంపు సంబలపు వైనము, విక్రమ, శౌర్యధైర్యముల్–
తెలియును లోకమెల్ల, పెడ తెల్విని – యంగన జెట్ట పట్టుటల్,
తెలిసిన మూర్ఖతా సరణి ధిష్ణ్యమె? తెల్పుము – దానవాగ్రణీ!

939. నేనిట లంకలోన – ధరణీసుత జూచితి నంచు దెల్పి, భూ
జానికి వార్త జేర్చుటది చాలు – ననంతర కార్యమెల్ల – నౌ
నౌ నిక దుష్ట శిక్షణమె – యాసురనాయక, పంక్తికంఠ! నీ
మానము ప్రాణమున్ సకల మాయ నశించు – గణింపు భావినిన్!

940. కాలాహిని మెడ బరిగొని
కాలాగ్నిని గుప్పిటగొని – కాలస్రజమున్
వ్రేలాడుట – మొక్కలమగు;
కాలాంధతమసము – సీత; కనుగొని, విడుమీ!

941. నీ తపోలబ్ధమైన యనేక సంప
దాదికములు, నాత్మ త్రాణధామ పటలి
రామ హేతి నాశము నొందు – రాక్షసేశ,
సీత నర్పించి, కోరుము – క్షేమయాత్ర!

942. రాక్షసుడు కాదు, గంధర్వ యక్షుడయిన
గా దతడసురుడైన, పన్నగ విభుడైన
గాడు, దేవదానవుడైన గానివాడు
మాదు సుగ్రీవ విభుడసామాన్య ఘనుడు!

943. వాని నుండి, తదనుచర వనచరవర
విక్రమజ్వాల నుండి యే విధిని– నీవు,
నీదు లంక – తప్పించుకొని మనగల, ర
సంభవమ్ము – నమ్ముము మానుషాదనాధ!

944. అవు నధర్మమ్మది బలీయమైన తఱిని
ధర్మ మెప్పుడు వెనుకకు తగ్గియుండు;
ధర్మ ఫలము నశించు నధర్మ ఫలము
ననుభవించెడు సందర్భమలము కొనిన

945. పొందినావింత దనుక సంపూర్ణ ధర్మ
ఫలము నీవు; కరగిపోయె వెలుగు వెన్న,
అచిరకాలమందింక నీ వడల నుంటి
వా యధర్మఫల తిమిర వ్యాప్తి కతన!

946. ఉపతిష్యం బది నీ కభి
శపనము – పదియర్ల జోద! శని నీ నడి నె
త్తి పయిగలడు, శుక్రునడిగి
విపరీతపు ద్రోవవీడి, వీడుము చెడుగున్!

947. యక్షావాసము పీకిపాకమున వేయన్వచ్చు; సంద్రమ్మునున్
సాక్షాత్ భీకర పంచభూతముల నాజ్ఞాపించగావచ్చు, మీ
రక్షోనాథ పటు ప్రతాపమతతర్క ప్రాప్తిచే, గాని – సం
రక్షా దక్షుడు రామచంద్రు కినుకన్ – ద్రూన్పెట్టగా శక్యమే!



948. అధిప! సకల సంఘటనల కా దశరథ
సూను డాది సమర్థుడు, సురమునిగణ
నుతుడు; సాక్షాత్ విధియు, కృశానుండు – నైన
రామ వధ్యు రక్షించగా రారు – నిజము!

949. అని సమ సౌష్ఠవమ్మొలయ నాడిన వాయుతనూజు మాటలన్
విని, దనుజాధి నాయకుడు – వేఱిమి చూడ్కులపాయ నిప్పుకల్
కనకన రాల, హుంకృతి వికారము మాటల గంటలూప, ని
ట్లనియెను – మంత్రులందఱికి నాజ్ఞగ, సైపగరాని సంజ్ఞలన్

950. "పొల్లు మాటల నొడువరి – బొలము మన్కి
నీ నగచరము వధియించు డిప్పుడె, జగ
నీలితెగబాటు వీడి యీ నేల రాలు,"
పిడుగుగా దుల్లె – రావణు బేరజమ్ము!

951. రాజు హుంకృతి నదిరెను ప్రాంగణమ్ము,
కొలువు కొలువెల్ల నివ్వెఱ నిలిచిపోయె,
స్వరము ప్రబలియు, పెకలక – పల్లటిల్లె;
నవ్యవధి గొన స్పందన మవతరించె.

952. అడవిని దారితప్పు – తరులన్నిటినిన్ నరికించి పీకి వే
యుడని యనుజ్ఞ నిచ్చు నొడయుండుగ దోచ, పరిస్థితిశ్రుతిన్
బొడగని లేచె నంత గుణపూర్ణ విభీషణు డన్న రాజు కా
యెడ నితమందజేసి, తన యేలిక నించుక హెచ్చరించగన్

953. మతములు, శాస్త్రముల్, సుహితమార్గము, న్యాయమెఱింగినట్టి మీ
కితరులు చెప్పనేల – యిటులీ కపి, దూతను – జంప, మీ సమ
ర్థతకొక మచ్చ యౌను; కులధర్మముకున్, నెఱవాది తీరుకుం
బ్రతికృతమౌను గాని, తమ పండిన తెల్వికి బేరు గూర్చునే!

954. ఉత్తమ కార్య నిర్ణయము నౌచితి మీఱగ జేయగా వలెన్,
విత్తును జూడ – చెట్టు – మదివీదికి తట్టిన రీతి – శిక్ష – ప్ర
త్యుత్తర మౌచు నిల్వవలె – దూతకు, దూతను బంపినట్టి పెం
జిత్తుల మారికిన్ – భువనజేత! యొకింత దలంచి చూడుడీ!

955. దూతయన దిరుగలి ఊాయి; దూతయనగ
నొక్క జంత్ర బొమ్మ యనుదు; చక్కదనము,
దిక్కతనము దనవిగావు; చిక్కియుండు
వాని - పిడి, కీలు - నధిపుని పట్టునందు!

956. దూత శూన్య పాత్రయగు - యాతుపతి - అసలు
ద్రవము నింపెడు వా దుపద్రవము దెచ్చు,
రాయబారియె కాని యే రాయమారి
కాదు - దూత; వీడు పరాయివాదు నిజము!

957. కావున, బట్టుకోవలెను కారణమూలము, మూలకారణా
రావ మదే దిశంబడి సరాసరి యిచ్చటి కేగుదెంచెనో;
భావము లెట్టులుండె - బరిపంథుల మోపులు, మోకలేవి' - యే
త్రోవన బోవగావలెనొ - తోడెము యోచన జేయగావలెన్.

958. పండితులైన వారు, తమవంటి వివేక విచారసారముల్
నిండిన వారలున్, వరవినీతులు, జ్ఞాతలు, జ్ఞానదాతలున్,
బండినమాటలే సరళ పంక్తుల బల్కుచు నాదరించరే-
దండి యెడంద కొక్క హృషిధారను చల్లగ బంచు రీతిగన్!

959. అనుచున్ వామనభావితమ్ము, హిత భావార్థానుబింబాభినం
దనమున్ బంచె విభీషణుండు - నిజహార్ద గ్రంథనారూఢి దా
న నిమిత్తం బనిమిత్తమున్ దలకు జ్ఞానార్థమ్ము నందించుచున్,
దనదౌ లోతు నెదన్ జగద్ధితమునే ధ్యాతవ్యమున్ జేయుచున్

960. ఇది విని పావమాని - యిది యేమి? దశాస్యుని క్రోధతాపముల్
గదలుచు నిక్కడున్న సభికాగ్రణులన్, నను తత్తఱించుచున్
బ్రిదులుచునుండ - యీ కడ విభీషణు సౌమ్యత - కంటి చెమ్మలో
నొదిగి చలించుచుండుటిది - యొప్పిదమౌ పరిణామమేకదా!

961. అనుకొనుచు నింక దోషాచరాధినాథు
నాజ్ఞ తేలునని నిలిచె - నంతలోనె
వేల్పుదాయ పవరుడు - వీభీషణు దెస
గాంచె, నాలోచమానుడై - క్షణము నిలిచె!



962. మఱు నిమేషము - దానవవరఘనుడనె
రామదాస వధ మన మార్గమ్ము కాదు,
కాని, మనల గాదనిన యీ కపికి - దగిన
దండనము నిండు, దుందుడు కెండజేయ!

963. ఆపయి రావణుండు సభనంత నొకింతగ పాఱజూచియున్,
జూపుల గ్రుచ్చిజూచె ననుజుండు విభీషణు, జూచె మంత్రులన్,
జేపడు యట్టహాసమున జేయి విదల్చి వచించె 'వీడికన్
దూపిలి, దూకలం బొరల, దోకకు నిప్పును బెట్టికట్టుడీ'

964. చేసిన తీవరమ్మునకు జింతిలగావలె వీడు - సంకటం
బేసర రేగ, నొవ్వ సొలయించగ - జిందుల ద్రొక్కగావలెన్
వీసరవొవ - నెమ్మి, బెగ్గడిలి - వీదుల, వాడల పాఱగావలెన్
మాసిన తాల్మికత్తళము మాసికలైన మిగల్చరా దికన్

965. తోకది కాలిపోవ, మన త్రోవల పట్టుల, నట్టులిట్టులై
ప్రాకుచు, దిక్కులేక, వెఱ పైగొన, దానికి తోడు - లంకలో
పాకములెల్ల కేరడము పాలొనరించుచు వెక్కిరింత, చీ
కాకుల పాలుజేయ - గలకంబడి, చేద్పడి - రాపడన్ వలెన్!

966. రక్కసితేని యానతి కరాచురి - పావని గుండె గ్రుమ్మగన్,
రక్కసితేని మాటలు కరమ్మొస గొల్పెను దోహలమ్ము నా
రక్కసిమూక, కంతట బరాబరు లెచ్చగ వారు లేచి రా
చక్కని కానవొకసపు సొరము బట్టగ, నిప్పుబెట్టగన్

967. సోకుమూక లంత హనుమ తోక గాల్చ-
పాతబట్టల, బట్ట కప్పడము లెల్ల
దెచ్చి, తోక బట్టుచు గట్టి - తేరనిలిపి
నూనె దడిపి ముట్టించిరి, నుసలనీక

968. అసమయ రాజకీయ విషయంబుగ, నిప్పుల నిర్ణయంబుగా
నసుర ధరాదినాయకుని యానతి కైదువు నిల్చుగాదె, యీ
దొసగుల దొంతరుల్ దొలగద్రోయు సహాయము వెంటనంటియే
మసలు నటన్న నిబ్బరముమాపున నిల్చెను - పావమానియున్

969. అటు లసురాధిపుండు కొలువంతము జేయుచు నిష్క్రమించ, దా
మట కపిచుట్టు జేరి రసురౌఘము, హెచ్చినకిన్క, వాని – నె
క్కటి నొనరించి – హుంకృతుల – క్రందున నిల్పిరి – ప్రక్కవెన్కలన్
కుటిలపు భంగిమంబులను క్రొవ్విదముల్ సెలరేగ జేయుచున్.

970. పవమానకల్పుడా ప్రథమానకల్పము
మల్లుపై రక్కసి కల్లు ద్రోసి;
హనుమాన మానితు డజమాన మానము
గాడ్పు పట్టిని బట్టి కట్టికొట్టి;
కృత వీర్య వీరుడు కృతకృత్య వీర్యము
కీశేశు పై బడి గేలిసేసి;
ధ్యేయైక తత్పరుం దేకైక ధ్యేయమ్ము
కపివరు రట్టడి గాసివెట్టి;
రాల రువ్వుచు కవ్వించి గోలచేసి,
వీధి వీధిని ద్రిప్పుచు వెంబడించి,
యూరు వాడల వాసుల నుత్సహించి,
మూక పేరు నిల్పుకొనె – సమూహ మపుడు!

971. శంఖ, భేరీ, గభీరిక – జమిలికలను
ఢక్కి, ఢంకల మ్రోతల దప్పుగొట్టి,
'వీడు గూఢచారి' యనుచు పాడుకొనుచు,
హనుమనే పట్టి త్రిప్పుచు నరిగి రంత!

972. ఈ యుత్సాహము చెయ్దముల్ గనుచు క్ష్మీంకేశుండు – నుద్రిక్తతా
ఛాయా సంజ్ఞ విదల్చుకొంచు, స్థిర విశ్వాసంబు బూరించి, వే
ళాయోక్త ప్రతిభన్ – బ్రతీతి – నిలిచెన్, లభ్యంబు సర్వంబు – దై
వాయత్తంబగు గాదె యన్న – తన వ్యాఖ్యానమ్మునే నమ్ముచున్

973. అసురులు సేయు రాయి డొక యద్భుతమౌ యవకాశమంచు మా
నసమున నూహనిల్పెను ఘనంబుగ బావని – రాజధాని నీ
విస్మృత విహార మంతయును వేకువ నౌటను లంకనెల్ల దా
నసదృశ రీతి స్పష్టముగ నారయ గల్గెద నంచు హృష్టుడై!



974. మౌనము మంపు వెన్నెలలు మానస సీమను బర్వ, భక్తిమై
వానర వీరతేజు దురువహ్ని మలంపును గోరుకొంచు, నా
మానవనాధునిన్, సకల మంగళ – జానకిని న్నుతించె; నా
పూనిక యానిక ల్దెలిపి పోషణ జేయుడటంచు, నంతటన్

975. తలపును సీతపై, దశరథాత్మజు పైనను నిల్ప – గుండెలో
తలుపెడొ చక్కగా తెఱచి ధ్వాంతము నంతము జేసినట్లుగాన్,
జలువడి యద్ది యద్ది యొక చల్లని చేయి స్పృశించి నట్లుగాన్–
దెలిచెను వానరేశ్వరుడు, తియ్యము నందిన మానసంబుతోన్

976. ఇట సీతాపతి నాపయిం గురిసె నింతింతైన వాత్సల్యము
న్నిట సీతాపతి నాపయిం విరిసె నారేడైన యుత్సాహముల్–
కుటిలాయత్తికి చెల్లు చీటి నిడెదన్, గూర్చమ్ము ఛేదింతు, బ్రా
కట రామోర్జము లంకకున్ దెలియ సాక్ష్యంబందగా జేసెదన్

977. అని, తోడ్తో దన వాలమున్ గనగ సహ్యంబైన యుష్ణ స్థితిన్
దనకానందము గల్గజేయుచు వినూత్నంబౌచు నొప్పారెడిన్,
దన కాయమ్ముకు సూక్ష్మతన్నొదుపు సంధానించి తక్కించె – బం
ధనముల్, పెళ్ళున సింహనాద మనె, చిత్రంబొప్పె విన్యాసముల్!

**లంకాదహనము**

978. లంకా ద్వారము మీదికెక్కి హరియున్ లాంగూలమాడించె; ని
శ్శంకప్రాసము నాయుధమ్ముగ – ధృతిస్ఫారోర్జితవ్యాపృతిన్
లంకా ద్వారపు కాలలోహ స్పృగ మల్లల్లాడగా బీకె, నా
వంకన్నిల్చిన రక్కసేంద్ర పయికిన్ బాటించె, పెల్లార్చుచున్

979. చచ్చిన వారు చచ్చిరిక జావని వారలు భీష్మభీతి – మై
హెచ్చగ – బాఱినారు గతులేచగ; లంకను, లంకలోని – సం
పచ్చయమున్ విచారహత పట్టిక జేయుటె యుక్తమంచు – దా
బెచ్చరిలంగ జేసెను కపీశుడు – తీంద్రము – తోకకుచ్చుకున్!

980. కుప్పించి లంఘించి కోట నెగడి జేసె,
గృహములపై నగ్ని కీల లెత్తె;
దిమిదిమి దట్టించి దిమ్మలన్ గాలిచె,
సౌధాగ్రముల నిప్పుజల్లి చల్లె;
పరుగున పోయి పెందెరువును ముట్టించె,
వసతి వాసమ్ముల జ్వాలరేపె;
నురడించి, తీంఢ్రించి, యునుకువల్ దహియించె,
మందిరారామముల్ మంటగలిపె;
రాజధానిని బట్టి హిరణ్యరేతు
కర్పణము జేసె, సామీరి - హనుమ - నిజము,
వాని బట్టుట, తోకకు వహ్ని పెట్టు
టన్నది - స్వయంకృతాపరాధాతిశయము!

981. కాగ, గనపకొండ బడిన గత్తరయ్యె-
శ్వసనసూను ప్రతీకార చర్యలపుడు,
కొఱవి తోడనె తలగోకుకొన్న పగిది
నర్థ హీనమయ్యెను - రాక్షసాంతరమ్ము!

982. నాల్గువైపుల నంటుకొన్న భవనాలు
గాలి తీవ్రతతో బుగ్గిపాలు కాగ;
స్వర్ణమణిమయములు ప్రతిశ్రయము లెల్ల
నేలకూలెడు దృశ్యాలు వేలవేలు!

983. రత్న నిర్మిత ద్వారాలు, రజత తోర
ణౌఘమును - నివాసములు, స్వర్ణనిలయములు
సర్వమంగళమయ్యె - కృశాను - పసికి
లక్షణపు ద్రాడు తెగిపోయె - లంకలోన!

984. ఒకచోట మోదుగు, లొకచోట బూరుగు,
లొకట కుంకుమరాగ మొత్తగిల్లె;
నట నీలిమంటలు, నిట కడారపు కీల,
ప్రోవెత్తినట్టి బభ్రు వొకచోట,



ఒకవైపు కలచాయ మకిలి, వెలుర బాఖు,
లిటు రక్త రేణువు లెత్తి పోత;
దహియింపబడెడు పదార్థంపు రంగుచే
రకరకమ్ము లయిన రంగులందె,
ఒక్క కోపిష్ఠి మోముపై యొదవి యదరు
చాయలును, రేక - లందందు సందడించె;
నాత్మభవు హేల కనిల సహాయ మమర
వీతిహోత్రుని పాలయ్యె - వీడు, నాడు!

985. పోటెత్తు సంద్రాల పోడిమి కన్పట్ట
హా హా రవమ్ములే యడలు కొనియె,
కాలమేఘచ్ఛాయ కరణిని గమనించ
నడ్డ దిడ్డపు పర్వు లాతురబడె,
భూతప్లవాకృతి భాతి వెగడు దోప
గుండె పగుళ్ళవి బెండు పఱచె,
కాలాహి ఫూత్కార ఖేలానుకృతి గాంచి,
యాక్రందనల యీతి యార్భటించె,
ఆశర చయము గాసిల్లి, యడలి, యడలె;
పిల్లకాయలు, స్త్రీలేమి, వృద్ధులెల్ల -
జారు వారును, వేవేగ పాఱు వారు;
త్రొక్కిటం బడె - వహ్ని విద్రుతము లంక!

986. భవనముల మీదనుండి లో బడెడు వారు,
మిత్తి మీదెక్కుచున్నట్లు తత్తఱించు
వారు - ముంచెత్తు యుప్పెన హోరులోన
చెట్లు కూలుచున్నట్టిదే చిత్రమయ్యె!

987. పిడుగు దుళ్ళుట, కాకున్న పేరుటుల్క
రాలుటే యనదగును - ఘోరమ్ము జూడ;
మండు వేసవిలో మాడి యెండినట్టి
పొద్దు తిరుగుడు పువుచేని పొలుపు - లంక!

988. "వానరుడు కాదు, మనపాలి భైరవుడు
కోతి యెట్లగు? లంకకే ఘాతుకుండు;
యింత నాశనము; వినాశ మేర్పరించె
వజ్రపాణియొ, రుద్రుడో, వరుణుడేమొ?

989. "ఏమో – యేమొ– యిదేమొ – కీశవరు దీర్ఘేచ్ఛావిశేషంబు? కా
కేమీ – యే బలమాశ్రయించెనొ– శుచిష్కేశుండు బీభత్సుడై
తా – మాయన్ ఘటియించె లంక కళ, మా దౌరాత్మ్య మే జన్మలో
దో – మా స్వామిని, మమ్ము, మరి రక్షోద్భోధమున్ ముంచెగా!"

990. "తాను – సూర్య కుబేర చంద్రాగ్నులందు –
నెవడొ యొక్కడీ యవతారమెత్తెనేమొ;
గనుల, గనిమలనేగాక – గడ్డ మొత్త
మొక్క పెట్టున పొరిపుచ్చె – యురవణించె"

991. "పట్టుగ చతుర్ముఖ ప్రజాపతియె నాడు
కడుపులో పెట్టుకున్న యాగ్రహము – నేడు
చింకలిక్క రూపాన యీ లంకజేరె
నకట – వైష్ణవ తేజమ్మె యవతరించె!"

992. కాబోలు – నేమొ – యేమే
మీ – బాధా వ్యధలని – గతి నెఱుగక – యా సం
ధ్యాబలచయము కకావిక
లై – బహుకృతమై తృణంబులై, చెదరు తఱిన్

993. ఒక్క పతాకపు రెపరెప –
చక్కగ, సర్వోత్తమ జయ సంజ్ఞగ – పైపై
నిక్కిన భంగిని – కపిచరు
డెక్కె నదె త్రికూటనగము – నిల్వడి మీఱన్

994. రామ రామా నమస్కార రమణ మగ్న
డయ్యె, స్వస్తిమూర్తియు నయ్యె – హనుమ యపుడు;
గాలి చెమరించె నొక తరగ గతి; ప్రకృతి
సుతిని గలిపె– నదియె తరగతి తనదని!



995. వరకపి, బుద్ధిమంతుడు – ధ్రువంబుగ లంకకు నగ్గివెట్టి, యా
శరబల మందు కింకరుల శాతము సున్నకు దెచ్చె, యోగ్యతాం
తరధితి, నాత్మ విత్త నిభృతప్రభ నిల్పె; నహెూ–యటంచు, కి
న్నర సుర సిద్ధ సాధ్యగణనాధులు మెచ్చిరి, స్వస్తి హెచ్చగన్!

### లంకాదహన పర్యవసానావలోకనము –హనుమవిచారధార

996. ఇరువుగ బర్వతమ్ము పయి నెక్కిన శత్రుభయంకరుండు, సం
బరమున నొక్క లంగగొని, వారిధి జేరుచు, దోకచిచ్చు – నా
శరధి శమింపజేసికొనె, స్వామికి మ్రొక్కుచు మోమునెత్తె; దా
బరపిని దారుణమ్ము కనుపట్టెను దూరము నుండి – చేరువై.

997. త్వరితముగా నెడంద యర దాకెను – బాధ, భయమ్ము, నంత – గ
గ్గురువున మై చెమర్చె, పని గూర్చిన తృప్తి నెమ్మనంబునన్
తరిగె; క్షణమ్ములోన – తన తామస పర్యవసాన మేమియో
యరసె – విచక్షణాజలధి నంతకు నంతకు విస్తరించగన్

998. పలు వివేకపు టూర్మికల్ స్వాంతము దరి
నొఱసి, యొరపెట్టి, యొరగట్టి, యొరగిలేవ–
యుదుకుటూపిరి యుల్లమ్ము నొలసి యొలయ,
హనుమ తనపైన దానె పేరల్క నొదరి

999. 'క్రుద్ధుడనై మహాభవనకూటమి గాల్చి నశింప జేసి నా
నుద్ధతిచే మహావనము నొక్కట వంచితి, లంక భాగ్య సం
బుద్ధిని మంటగల్పితినిపో – మఱి, మాత పరిస్థితేమియో?
బుద్ధి విహీనుడంచు నగిపోవరె నాగతి జూచువారలున్!

1000. వెదురు బద్దను జీల్చుచు వదలినట్లు,
గోడకేసి కొట్టుచు బంతి నాడినట్లు
నాదు ఘనకార్య ఫలితము నాకె తగిలె–
మొగము చితికెను, గూబయు బగిలె నకట!

1001. లంక సకలము పోయిన లక్షణమ్మె
వెనుక, ముందును, బ్రక్కల – గనగ నయ్యె;
గడ్డిపచ్చడి చేసిన దొడ్డవాడి
నైతి; జానకీసతికి నన్యాయమయ్యె!

1002. శ్రీరఘూద్వహు చిత్త సంప్రీతికరము,
కరము సమయోచితమ్మగు కార్య మేను
చేయుచున్నాడ ననుకొని చేసినాను,
కటకటా – తల్లియునికి సంకటము బడెనె!

1003. ఏమైపోయెనొ – ధరణిజ?
యేమైపోవును – మిగులునె – యింతటి యగ్నిన్?
నా మో మే విధి – నా శ్రీ
రాముకు జూపుదు నిసీ మరణమె శరణమా?!

1004. వినమె – 'బుద్ధితం సారథిం విద్ధి' యనుచు,
నదియె నాయెడ వాస్తవంబయ్యె నిపుడు,
కూరుచుండిన కొమ్మనే కొట్టుకొంటి;
జాగరము మఱచిన గొప్ప సైనికుడను!

1005. ఇచ్ఛాధీనము దేహము,
యుచ్ఛృంఖలుడ; మరి నడకయును–నామది యూ
హేచ్ఛాగతి సాగు కతన,
స్వచ్ఛందమరణమె పాప పరిహారమగున్!

1006. అగ్ని గుండమ్మునందొ, స్కంధాగ్నియందొ
తివిరి, నాకు నేనుగ నాహుతినయిగాని
ప్రాణదేహమ్ము లెల్ల నిర్వాహణమ్ము
జేసికొనుటె – నాకు దగు ప్రాచితము నిజము!

1007. అని చింతించుచు, మాటి మాటికి నకార్యాచ్ఛాదమే మేని – బై
కొన, దానిన్ సవరించుకొంచు, దన యాక్రోశమ్ము సుగ్రీవు, కా
మన – సర్వమ్మును రిత్తపుచ్చితిని యే మార్మాట జెప్పంగలా
దను – స్వామీ యని, నీటిలో పుటిక యట్లైనిల్చె – సామీరియున్



1008. ఏవొ తలపుల లోపల, నేదో తత్త్వ
రూపమొక్కటి; తత్త్వ స్వరూప మొకటి –
లీల గదలి, యెదను కదలించె; నరటి
యాకు లల్లాడజేసె, నాహ్వాన మనియె!

1009. శుభ శకునముల దొంతర, సుకపుగాలి
సొలుపలర స్నేహదేహళి జొచ్చె; తేర్చె,
నార్ద్ర చేతన మొకయింత; యంత కుదుట
బడియె; కపివరు కొక క్రొత్త బలము దెచ్చె!

1010. బుద్ధి యిరుసున కందెన నద్దినట్లు,
దిబ్బె మందున వత్తిని దిద్దినట్లు
సమ్మతి తలిర్చె, సృకమనోజవసు కపుడు,
తెలివి కొలదుల చర్చల బలికె మదియు!

1011. నిజ సంస్థాగత ధర్మచార జనితానేక ప్రభావప్రభా
వ్రజధూతాభ్యుపపత్తి సూక్ష్మముగ, శ్రీరామేశ్వరీ – ఓ యనం
తజ – యీ కోనమెకమ్ముపై నిడగ – నీ తాత్పర్యమర్థమ్ము కా
క, జడత్వమ్మున, తత్తఱన్ మనసు జేగన్ గ్రుంగి నేనిల్చితిన్

1012. వాల మ్మున్నను సర్వనాశ మొనరింపం జాలలేదీ శుచి
ర్జ్వాలా హేళియ – నీదులీల! యిక యే జ్వాలాళి – యగ్ని స్వరూ
పాలేఖ్యన్, గుణరాశి – నిన్ను దహియింపం జాలునో మాత! సం
శీల ప్రాభవ లబ్ధ వాంఛిత! గుణ శ్రీరామ జీవేశ్వరీ!

1013. తల్లి, జానకీమాత! వితాకు జెంది,
నీ కృపాకటాక్ష మహిమ నేనెఱుగక,
లిప్తలో వేల యోచనల్ లేపుకొంటి,
మానసాంభోధిలో – నసమంజసముగ!

1014. శ్రీ రఘురామ భావనమె సేతువుగా నొనగూడె దోకకున్
శ్రీ రఘురామ పత్ని - కృప - సింధువుగా సమకూరె మేనికిన్
శ్రీ రఘురామ దంపతుల సేవయు, గానము, నిండు భక్తియున్
శ్రీ రఘురామ కార్య ఫలసిద్ధికి రక్షలు, సాక్షులీయెడన్!

1015. అని వ్యక్తావ్యక్త శుభ వ
చనము లలరుచు నెడద కుపశమనము లగుచున్,
దనుపొనరించెడు వేళను
విననయ్యెను - గగనచరుల ప్రియవచనములున్

1016. 'అరెరే - యిది యెంత భయం
కర కృత్యము, లంకగాల్చె గపి; యైనను - దె
ప్పర మెఱుగక నిలిచిన దా
ధరణిజ - వనవాటిలో - యథాపూర్వముగాన్'

1017. 'ఎంత భయంకరమ్మయిన దీ కపి కృత్యము, లంకగాల్చె; న
త్యంత మవేలమైన హతి, యాతనలందున ముంచె, నైన - గా
సింతము సేగి లే దినకులేశుని పత్ని కశోకమందు - దా
నింతకు పూర్వమట్లె కల దిత్తఱినైన - నచంచలమ్ముగాన్'

1018. 'భీకరమున్, భయంకరము, భీషణమౌ గతి లంక గాల్చె; నో
హెూ- కపిశేఖరుం దదె, తదుజ్జ్వల శోభ నణంచె నైన - సు
శ్రీకరమై యపూర్వమగు చిత్రము, జానకి కేమి యాపదల్
లేక సుఖంబుగా నిలిచె - లేశములంటునె పుణ్యరాశికిన్'

1019. పునరుక్తి కిదియే తగిన య
దనుకొనిరి, మఱల మఱల దమ హర్షంబున్ -
బనితప్రమితిని నిలిపిరి,
వనచరవరు నొడలు బొంగె, బదిలము గుదిరెన్



1020. గత నిమిషంబులో - నెలమి గద్దఱి గండము లొత్తి గిల్లినన్.
హితమగు వార్తలీ తెఱపి నిచ్చె నటంచును తత్క్షణంబె - స
న్మతి - గపి, వింత చేష్టకలనన్, దన సంబరమేర్చి కూర్చుచున్
కత నొక దాని జూప నట గంతులిడెన్, బరువెత్తె రేగుచున్

1021. నిలిచిన వాస్తవ ప్రకృతి నిట్టలమై పొడవైన తెల్వినాన్
దెలియగ, నాంజనేయుని ప్రతీక్షణ మప్పుడు రెండురెట్లయెన్
నిలువగ నీయలేదు - మది నిండిన యుత్సుకతా ప్రవృద్ధియున్,
బలుకు వివిక్తమై, గళము వాకిలి దాటక నిల్చియుండగన్

## సీతా పునర్దర్శనము - పునః ప్రశంసనము

1022. సీతా తన్విని కన్నులారగని నిశ్చింతన్ బ్రయాణంబు మే
లౌ తాత్పర్యముగా దలంచి - యిది వీలౌ కాల మంచెంచి, యా
భూతేశాంశ కపి ప్రవక్త - చనియెన్ - పోబెట్టెదో లీలమై
ప్రీతిం గూర్చ; నశోకముం దెసకు, శుభ్రేచ్ఛావిశుద్ధుండుగన్

1023. కపి రాకను గమనించిన
క్షపాచర శ్రేణి యక్కజము మున్గె; భయం
బపకర్షము గదుర, బెదరి,
యుపరథ్యల బట్టిపోయి - రుత్తలపడుచున్!

1024. అదిగొ - యనింధనాగ్ని - జనకాత్మజ - నిశ్చలభావరూపమై,
కుదురుగ వింటి తీ రలర గూరుచునుండెను, రామభావనా
స్పద విమలాంతరంగ యనుషంగపు గాంతులు తేజరిల్ల - శ్రీ
పద పదవీ విలాస ధృతి భాష మహారుచి భాసమానయై!

1025. సీత గాంచిన తోడనె చింకలిక్క
కొడలు తెలియగ నీయ లే దుత్సవమ్ము,
బలము హెచ్చెను, హెచ్చెను - పౌరుషమ్ము,
నరటి మొదలు నగ్నికణమె యయ్యె దాను!

1026. తోక సరిజేసి; ఝూడించి, దూర దూర
మునకు విస్తరించి, విసరి, మురిసి, మెఱసి,
చేయి మోడ్చి నమస్కరించి, నిలుపోపి
దెసల చూపోపె; తన కత - పస - పసంగ!

1027. నడచును, తూగు, దోగు, చెగనాలుల లేచును, త్రుల్లగించుచున్
మిడియును, ప్రాకు, దాటు, బలుమెప్పుల బర్వును, పట్టువీడుచున్
సుడివడు, వేగిరించు, పఱచున్, వలచుట్టును, చౌకళించుచున్,
వడి వడి పోయి పోయి యొక వంక తటాలున యీడిగిల్లెడున్!

1028. సీత గాంచిన దోడనె చింకలిక్క
కొడలు తెలియగ నీయ లే దుత్సవమ్ము
కరము, మేను వంగెను, నమస్కార సరణి
నామె సంస్పందనమ్మేమొ యని భయపడె!

1029. క్రమమొప్పన్ గపి చర్యలం గనిన - ఆ క్షాంతిస్వజాలోకగ్రం
థము - వాత్సల్యరస ప్రసార శుభ సందర్భమ్ము నందించ; నా
యమ పల్వల్వ యిడెన్ - కృపాద్యుతి సురేఖాలేఖ్య సాహిత్యమున్,
బ్రమదా మోదిత శైత్య సంజనిత దేవాభీష్ట సౌహిత్యమున్!

1030. ఇంతటి దృశ్యకావ్య సరసేంగ మెఱింగిన వానరేశుడున్-
స్వాంతము నిబ్బరించ, దనువంత విధేయతకోడిపోవగా,
మంతన మంతయున్ దనదు మంతువు నూకొని తొందరించ, బా
స్వంత కులాంగనామణికి బ్రాంజలియై, నతులిచ్చుభంగిమన్

1031. నిలిచె నొక డింభకుని వోలె - నెరసుబొంది,
నిలిచె నొక నెఱజోదుగా - నెఱవుజూపి,
యతసిపైని భుజగభుక్కనంగ జెల్లు!
రూపురూపున చైతన్య రూపమదియె!



1032. ఎఱుగని పిల్లకాయవలె యిట్టటులై - క్షణమాగి, యంతయు
న్నెఱిగిన బుద్ధిమంతువలె, నే రహి చొప్పడు నావిధమ్ము, పె
ద్దతికము గూర్చి కూర్చెను, సదాగతిసూను డనంతరమ్ము - త
త్తఱమును వీడుచున్ దన విధానము మేరకు విప్పె వాతెఱన్

1033. ఏ యూహా కాలుష్యపు
చాయల్ లేనిది ప్రభువిధి - సంధించితి నే
సాయముగా భావించి; మ
రే యపరాధ మెఱుగ జననీ! నిజమమ్మా!

1034. చేసితి నొక్క చిన్నపని, జిత్తము స్వామి విధేయతన్ గొనన్
జేసితి సర్వశక్తి - ఫలసిద్ధిని నిల్చుచు; ముందువెన్కలన్
డ్రాసము లెక్కబెట్టక ధరాత్మజ! నీదు దయా విశేషమే-
పూసలలోని దారమను పోలిక నొప్పగ జేయు నాకునున్

1035. 'నా భయంకర బుద్ధి యత్నాభరంబు
లంకపై లయనాట్య చాలనము సలుప,
నీ మెదను కత్తి, పెనుగొండ నెత్తిమీద
యయ్యెనేమొ, యనెడు భయ మార్భటించె'

1036. 'దుఃఖదాహశోషణ మెద తొంగలించె,
బోవు ప్రాణము, వచ్చెడు జీవమయ్యె,
క్షణము క్షణము చచ్చి బ్రతికి - కంటిరెప్ప
తెఱపు మూతల మధ్య నే తివురుకొంటి'

1037. శుభ సందర్భము తల్లి - యీ ఘడియ! నే సూత్రించి సాధించి న
ట్టి భయాభీలము సర్వమందు కత యట్టిట్టాడి పోలేదు, నీ
శుభమున్ క్షేమము బట్టునిల్చె - నిట, రక్షోనాథు లంకాపురీ
విభవాధిక్య విలాసకీర్తి దహనావిష్కార సంపూర్తికై

1038. కంటి – కార్య సాఫల్య రేఖాకృతి నిట,
కంటిమెరమెర కాదె – రక్కసునకిదియు
గ్రాలు రావణు ప్రాణధైర్యమ్ము గంటి
గంటి – నీ కంటి చూపు సాక్ష్యమ్ము కాగ!

1039. అవును – నిజమ్ము బల్కవలెనన్న – మదీయ విచేష్ట జూడ– దా
నవజన సంకట శ్రమమునన్ – సగమే యొనగూర్చె; నింక – వా
రి – వగపు, నుబ్బు, వేంద్రముల రెట్టిగ జేయుట యున్నదమ్మ! యా
సవనము పూర్తిజేయుటకు – స్వామియు, నీవు ననుగ్రహించుడీ!

1040. నిజము – భవత్కృపారసము నిండుగ నుండిన జాలు – లంకనే
విజనము జేసి నిన్నుగొని వేగమె స్వామిని జేర్తు తల్లి – రా
మ జయమహా ప్రబంధమున మానిత సేవననామభాగమే
ప్రజలకు నందు నంచెనయ వచ్చును, సమ్మతి నిమ్ముమమ్మరో!

1041. చేసితి చిన్న కార్య మిది, సీతమతల్లియు, రామచంద్రుడున్–
దూసెడు నిశ్చయింపు పువు దోసిలి కొక్క ప్రయుక్తి యౌను, నే
నేసెడు నూలు ప్రోగు వరనీయము జేయుట, నీ యనుగ్రహా
భాస విశేషమై తనరు; పావని – నావిధి నిర్ణయింపుమీ!

## సీతా సందేశము

1042. అను హనుమంతు గాంచి, పలు కందము, తీరుజూచి, యా
వినయము, కార్యదీక్ష సరవిన్ గ్రహియించి, నిదానమెంచి, తా
నను పలుకందమున్ విసుమయమ్ము నెఱింగి, ముదంబు నిండగా
ననె – క్షితి జాత, వాయుజున కాతత వత్సలతా ప్రసాదియై.

1043. "సత్తును చిత్తునున్ దెలియ జాలిన వాడవు – పావమాని – నీ
చిత్తము, చిత్తశుద్ధి, సవిశేషవిరాజిత సంవిధానముల్–
యొత్తెను కీర్తివారిజము; నోపిక బట్టుము కొంచె, మెంత స్వా
యత్తత యుండినన్, ఫలము నందగ కార్యము పూర్తి కావలెన్"



1044. అని మాటాడిన సీత గాంచ మొగమింత్తైపోయె, కన్దోయి – వి
చ్చిన కెందామర లయ్యె – వానరున కాశీర్వాద గుచ్ఛంబు పై
నెనరుంజిల్కి కరమ్ములో నునిచె నా న్నెయ్యంపు రోమాంచిత
మ్మనుభు క్తంబయె, బ్రాంజలిన్ నిలిచె, భవ్యాజ్ఞప్తి నర్థించుచున్

1045. "మత్త పిశాచమేదొ తన మానస సౌధము నాక్రమించగా,
చిత్తవిభేద మూల కలుషేష్టియు వ్యగ్రుడు రావణుండు, నా
పత్తిని కోరి తెచ్చుకొనె, బాపము పండినగాదె దండనం
బెత్తటినైన, దానికిని – యెత్తును యెత్తగలారు రావలెన్

1046. ఏ నామమ్ము జపించుచుంటి ననిశ మ్మే రూపమున్, సత్యమున్
ధ్యానమ్మందున నిల్పుకొంటి – నది – సూర్యామ్నాయ యోగ్యత్వమున్
జ్ఞానానందమయత్వమయ్య – హనుమా! స్వామి ప్రభారేఖలే
యా నక్తంచర సంఘమున్ గడపు – నాకౌ స్వస్థతాలేఖలున్!

1047. కావున, స్వామి రావలయు, కాగల కార్యము దీర్పగా వలెన్,
దేవ విరోధి దారుణము తీలుపడన్ వలె దోడుతోడ గొం
పోవలె నన్నయోధ్య కదెబో – రఘురాము పరాక్రమ ప్రతా
పావలి లక్ష్యమై, దనుజవర్తన కుత్తరమౌను – మారుతీ!

1048. శూరసేనుడు రావలె, భారధూర్వ
హుండు సర్వ ప్రహరణాయుధుండు, రామ
మూర్తి రావలె, దానవ ధూర్త శిక్ష
కుండు రావలె, రావలె – గూర్చు జినుడు!

1049. అను సహజాత లోపలుకు నందిన మర్కటమూర్తి – హర్షుడై
దినకర వంశచంద్రుకు – నతిన్, నుతి నిచ్చి తలంచె, రావణున్
ఘనతను పెంపు ద్రుంపుట, వికారము నూటిచి నూత పోయుటల్,
ఘనతర కార్యనిర్వహణ కాండము నందలి వెన్నుగాడియౌ!

1050. అనుకొను వానరేశు మది యంద మెఱింగె ధరాజ, వానిదౌ
యొనరిక భంగిమమ్ము, తెఱవొప్పెడు చొక్కపు సౌమ్యమూర్తినిన్
గని, యనె – నీవెఱుంగనిదె – గాడుపుపట్టి – శుభంబు, నన్యముల్,
పనియొనగూడ జేయుటయె పద్ధతి నీదని నే నెఱింగితిన్

1051. వినుము, మరొక్కమాట – కృతి విశ్రుత – యేదొ మహార్థమంచు నే
నన, నయిన న్నిజమ్మిదియె – యాన సమాప్తిని గోరుకున్నచో
జనవలె – జాతి హేతువులు, జన్మము, యాతన, కర్మ వాసనల్,
మనుగడ మూలముల్, సకల మర్మములున్, మరుమోహబంధముల్!

1052. ఆ గతి యీ క్షపాచరుల కాయిత మయ్యెను పోవుకాల; మీ
వేగము, నా స్థితిన్ దెలిపి, వేగము స్వామిని దోడితెమ్ము – యీ
యాగము బూర్తిజేసి దనుజాధిపు నాయువు ముట్టనాడ; శ్రీ
రాగము లుల్లసిల్లవలె, రాముడు దుఃఖభరం బెడల్పగాన్

1053. అదనిది యంచు దెల్పి సమయజ్ఞత గోరుము; లంక గద్దె – నా
చెదపురువైన దుర్నయపు చీదర మొత్తము డొల్లజేసె, న
భ్యుదయపు వెల్గురేక జయమున్ మన దిక్కుకు బర్వజేయుచు
న్నది–యను, మాపయిన్ బలుకు నాణెము, నిక్కము నీదు విద్దెయే

1054. అను జానకి వచనమ్ములు
మనసును దాకె – నులి వేడి మరియాదగ, గీ
యని చిత్రమ్ముగ, నార్ద్రత
కును భాష్యమ్ముగ – హనుమకు – గూర్చిన బలమై!

1055. తనదు స్వాభావికానుగుణ నయ, వినయ
తతుల – నాసికాగ్రపు చూడ్కి దనర నిలిపి,
తనను సంబళించుకొని, తలపులెల్ల
తసియయి నిలువ – ననియె, నా – తతసుతుండు



1056. సీతను గంటి నేనను విశేషము దెల్పుట ముందుమాట – మీ
సీత సుఖంబుగా గలదు, చిత్తములో రఘురామ భావనా
వ్రాతము నిల్పి నిల్పుచు, భవన్మతి నిల్పుచు నన్నమాట – లో
హత్తినమాట; స్వామి కివి యందగజేతును, చేతు నా విధిన్

1057. నీదు వియోగమందు జననీ – విభు వేదన జెప్పలేము, యీ
స్వాదు వచస్సు రామునకు జల్లదనమ్మును గూర్చు నెమ్మదిన్
సాదరవృత్తి నాదు పరిచర్యను తప్పక చిత్తగించు, కా
ర్యాదిక మిచ్చమై తనరు, నధ్వము సాగును లంక దిక్కుగన్

1058. ఇంతలు జేసినట్టి దనుజేశ్వరు నుక్కడగించి మించ – నీ
ప్రాంతము కాగమించవలె రాముడు తానె యటంచు దెల్పి, య
ర్థాంతర మొప్ప వాకొనెద నమ్మరొ – కాపుకు వచ్చు చెట్టు వృ
త్తాంత మదెల్ల స్వామికి, నుదారమహాభిమతానుగామికిన్!

1059. అని వచన ప్రౌఢియు, రస
ధుని రూఢియు, ధ్వని నిరూఢి – దొరలెడు పలుకున్
వినయపు గాఢత నిండగ
ననియె – ననిలసుతుడు – సీత – యానందించన్!

## వానర ధూర్జటి తిరుగు ప్రయాణము

1060. ఈ సందర్భము, దృశ్యమున్, ఘటన మేమీ యేమి – యీ యిద్దరున్?
త్రాసమ్మింతయు లేదు కేవలము శ్రోత్రచ్చక్షు సాక్ష్యమ్ముగా
మా సాన్నిధ్యము మారె; వీరు కలరే మైకోలుగా – భావ వి
శ్వాసమ్ముల్ బెరయించు కొంచును, సమాసార్థమ్ము చర్చించుచున్

1061. అని యచ్చెరువున వీరిని
గను రక్కసిమూక – యేమి కానున్నదొ – యం
చనుమానించుచు, దమ గతి
గొన – బరుగున పోయి రీలకోళ్ళ విధంబై!

1062. వారిని జూచి నవ్వుకొనె - వానరధూర్జటి, భూమిజాతయున్
దోరగనవ్వె, తత్త్వమది తోచె బరస్పర, మాపయిన్ - సుకి
ర్మీరిత దేహు డామెకనె; మేలును జెప్పితి వా విధంబు - దై
త్యారికి విన్నవింతు, సెలవమ్మరొ - నేనిక పోయి వచ్చెదన్'!

**మత్తకోకిల**

1064. బొట్టెడొక్కని - దిద్దితీర్చిన బొమ్మ కొల్పున దించగన్
పట్టిచూచుచు బొమ్మలన్నియు - బాగుబాగని పొంగుచున్
చిట్టకాలను జూపిచూపుచు జిట్టమీఱగ నన్నిటిన్
చుట్టబెట్టి, బెడాబెదల్ తన చుట్టు పట్టుల కొట్టుచున్

**ఉత్సాహ**

1065. బయలు గాలి, లోని కేలి, పరవశింపజేయగా
బయట కొన్ని, లోన కొన్ని పారవైచి కోరుచున్
జయము తనదె యన్న సంతసమ్ము నింపుకొంచు, 'హై
హయ' యనుకొని త్రుళ్ళి ఘనత నాలపించు తీరునన్

1066. ఊొమ్ము విఱుచుక పరుగు పరుగున తిరిగె-
దుడుకు పుట్టువ యననేరొ తడవనేల;
వలగొనె నొక తూనిగవలె బవనసుతుడు,
వలపలించుచు లంకను కలయజూచె!

**మధ్యాక్కర**

1067. ధరణిజమ్ములు నోషధీలతా తతి పుష్టమై దొరల
బరిమళమ్ము విడె కర్పూర పాటీర సారంగ నాభి
ధరణి భృత్తులు, లోహరాశి, ధాతువుల్ - ప్లుష్టమై కెరల
నరుణిమంబు లెగసె - ప్రకృతి యవని కాభ్యంతర స్థలము!



**మత్తకోకిల**

1068. వాని వీనిని బల్కరించుచు - వానరేశుడు తేకువన్
దా నరిష్ట రాసాధరమ్మున దందడించిన సందడిన్
భూనభోంతర వాయువూన, నపూర్వ రీతిని దూకగన్
దా నరిష్ట ధరాధరమ్ము వితాకుగొంచు దడంబడెన్!

1069. ఈ స్థితి మర్కటమూర్తి యు
దాస్థిత మతి యగుచు దేహదళ విరళము - భూ
రిస్థౌల్యము నొనరించెను,
ప్రస్థానక్రియకు నాంది పలికిన రీతిన్!

1070. అవనిజా మనీషైకవేద్యం బయినది
వానరేశుని భీమరూపము - విశేష
మెల్ల నీ సతి యనుకొనె నుల్లమందు
మున్నె; యీ నాటి భీషణ మూర్తి యతడె!

1071. అలమిన భీతి పట్టు మలయన్, ధృతి జీరుకు పాటువాలె, పెం
పలసత గూలె, శోభలవి యక్కిలి తొట్రిలె, సంప్రతిష్ట గా
సిలె, ధ్వజ గంధశోభనము సిబ్బితి నీల్గె - నరిష్టమందు - సం
చలన పదార్థ లక్ష్య ఘన సంస్థితి కబ్బె నబందరాంకముల్!

1072. ఆ భయంక రాకారత నరసి యరసి
పర్వతము కదుబెదరి విహ్వలము జెందె,
స్థావరము లేమి యా సర్వ జంగమములు
నైజ వైరుధ్యమున జిక్కి యోజ నుడిగె!

1073. పర్వత పీడనమ్మొగిని బద్రము మీఱగబన్నె - గీశు డా
నిర్వహణ మ్మపూర్వ మహనీయ శుభప్రకటమ్ముగా - జగ
త్సర్వము వీక్షసేయ, గిరి దద్దఱి ముక్కలు ముక్కలయ్యె, దా
నోర్వగలేక పాపజగ మూదుకొనెన్, దన యున్కి కూర్కొనన్

1074. పర్వము హెచ్చరించ పశు పక్షి సరీసృప జాల మంతయున్
సర్వ శరీరు, లభ్ర పద చారులు, కిన్నర, సిద్ధ, సాధ్యులా
పర్వత దుస్థితిం దెలిసి, పాఱి రుపద్రవ భీతి; యీ కడన్
గర్వలిపట్టి పైకెగిరె – గాలిపటమ్మది లేచు కైవడిన్

1075. అద్రి చంద్రతారామండ లాదులెల్ల
మ్రింగ బోవు వానివలె సారించె దృష్టి,
వేగగమన నౌక యగుచు – సాగరాంబ
రమ్ము దాటు చుండెను, వానర ప్రవరుడు

1076. మేఘ పటలమును సమీకరించు కొనుచు
నొకట వాని దూరి; యొకట వీడి
బయట పడుచు; నగుచు, పజ్జ కొరిగి, లేవ
ముద్దు ముచ్చటలవి మురిపెమాడె!

1077. ఆకాశమే సంద్రమై మేలు త్రోవల
కాహ్వాన మందించి యందగించ,
చంద్రు డయ్యెను వారిజము; చండకిరణుడు
నీటికోడిగ గూర్చె నిండుదనము,
పుష్యమీ శ్రవణముల్ పురుదంశకమ్ములై,
యదితి మహామీనమై పొసంగె,
నంగారకుడు మకరాంకమై రాజిల్లె,
స్వాతి శోభిలె హంసపథమె యగుచు,
చంద్రకిరణాలు శీతకృత్స్నముగ, గాలి
తెరలు తరగ, లైరావతం బరత దీవి,
నాగ యక్ష గంధర్వులు నలిన వితతి,
కాగ, సాగెను కాంతివేగాన – హనుమ!

1078. హరి – గరుత్మంతు వలె సునాయాసమొప్ప
బయనమును సంగతము జేసె, బదము సాగె;
వడిని నల్లేరు పై బండి నడక యనగ,
నొప్పును రసాభ్యుచితబంధ మొకటి వినగ!



1079. అరి మర్దను డా శోభా
కరుడు, ప్రభువు దర్శనోత్సుకత యేపారన్,
ద్వరపడి, దారిని, హితవరు
గిరి మైనాకుని స్పృశించి కీర్తిత మతియై;

1080. ముందుకు జని చని – కనె, ము
న్ముందు సుదూర స్ఫురితము – ముయ్యెల గుట్టన్;
సందడి దృశ్యంబదియే
మందోష్ణ జనిత రమణము మధురంబయ్యెన్

## మహేంద్రగిరికి హనుమ రాక – ప్లవగోత్సాహము – అభినందనలు

1081. హనుమంతుడట సింహనాదమును జేయన్, సింహమే గుండియన్
బనిచన్ మూలకు నక్కి , యొసరిలె; ద్యావాపృథ్వు లూటాడె – గ్రిం
దును మీదై, నగచారు లభ్రచరులన్ దూర్ణమ్మునన్ ద్రోసె, దా
ననుబంధించి మహేంద్ర శృంగి – కపి నాహ్వానించె, సంరంభియై!

1082. ఈవలి తీరమందుగల యెల్లరు వానర వీరు లొక్కటై–
కావలె నా విరావ ఘన గర్జన మయ్యది పావమానిదే
కావలె, వచ్చువాడతడు కావలె, నందఱివాడు వాడె – మా
జీవన జీవదుండను విజృంభిత భావన ముల్లసిల్లగన్

1083. జాంబవంతుని కోరిరి – సర్వమెఱిగి
నట్టి జ్ఞాన స్వరూప! మీరనగ దగును
మాదృశ భవన్ని యుక్తుల కాదృతి నిడ
కన్దెఱ హనుమయను సత్యకమ్ము నిపుడు!

1084. అన విని జాంబవంతుడునె నాతడు కేసరి పుత్రుడే యగున్,
జననుత కార్యసాధనము సల్పుట జేతనె యట్టి గర్జ – దా
నొనరెను పావమానికి, నియోజన మయ్యది పూర్తిజేసి నా
డన ననుమానమేల? మన యాశుగసూనుని స్వాగతించుడీ!

1085. జాంబవంతు పలుకుజయమును విన్నంత
కీశ వర్గమంత కేక వైచె–
వీరకీశ ముఖ్య, ప్రియమిత్ర సత్తమా,
"జయ జయోస్తు వాయుజాత, జయతు"!

1086. ఆ వెంటన్ గపి వర్గమంత రమణ వ్యాపార కేళీ విలా
సావేగాశ్రుత చేష్టలందు దిగె నన్యత్వంబు బోనాడి, స్నే
హావిర్భూత హితాద్యనేక గుణ సౌహార్దమ్ములున్ హృచ్ఛయం
బావేశించెను, చెంగళించె, పరమాప్యాయమ్ము నందించుచున్

**ద్విపదలు**

1087. ప్లవగ సమూహము పర్వతమెక్కె
ప్రవరుల గుంపులు మ్రాకు లెక్కె,
అల్ప జీవులు కొమ్మలంకించి నిల్చె
స్వల్ప సంతోషులావంక కెగిరిరి,
వారు వీరును చేత వస్త్రాల పడగ–
సౌరభ స్వాగత సౌభ్రాత్రమిడిరి,

అదిగదిగొ హనుమ యనెడు కేరింత
యిదిగిదిగొ నరయు డిట యను కూత,
మా వాడు మనవాడు 'మహగొప్ప'వాడు
మా వారి నెల్ల సమ్మానించె వీడు,
ఆకాశయానమ్ము నవలీల జేసె
వీకగా తన యనిర్వేదమ్ము జూపె,
ఈ హోరు పది దిక్కు లెక్కి యూరేగె
నాహా యను పలుకె వ్యాప్తమై రేగె,
గిరి యావరణము చిగిర్చె హర్షమ్ము
పరగె హనుమ కట స్వస్తి వాచకము!
స్వాంతముల్ ముల్లెగా సంతరించిరట
ప్రాంతమే సత్వమై పరవశించెనట!



1088. ఏ చెట్టు జూచిన నేపుగా తిమ్మన
పూవుల గుత్తులౌ పొదలెసంగె
ఏ గుట్ట గాంచిన నింగిలీకపు ఊలు
బొమ్మల ప్రోవులై ప్రోపునింపె
ఏ పట్టు నరసిన నెత్తరి ముల్లుల
జొంపముల గుమియె జువ్వరించె
ఏ పుట్టనించిన గోపుచ్ఛముల కొడి
పడగలే కదలుచు నడరు పడియె
నన్న మొగి, నా ప్రదేశము – భిన్నతనము
లోన నేకత్వ సిద్ధిని లులితమయ్యె,
హోరుగ ననిపించిన బెక్కు హొయలె మెఱసె,
పుడమి కూతురికింత యాపోక దక్కె!

1089. గడదేఱు గమన విద్యను
వడిగలతనము వడిబెట్టి, వడిపెట్టిన స
వ్వడి వడిముడి వడుపు నిడెడు
వడి; వడి పేరుబ్బడించి వడిగొను నడుగుల్

1090. డక్కొనిన పిడుగు – దబ్బున
నొక్కుమ్మడి డుల్లిన గతి – నుగ్గడు వౌ – మై
డక్క – మహేంద్రము మీదన్
జక్కగ దించెను ప్లవంగ సత్వము, శుభమై!

1091. అక్కట మిక్కుటంబయిన యత్తర ముత్తల మంద, గీశముల్–
ప్రక్కల ముందు వెన్కలును వాలిరి వానరవీరు జూడగన్,
నిక్కుచు నీల్గుచున్ మదిని నెక్కొను కూరిమి మోము పైకి పై
కెక్కగ – 'ఏడి – ఎక్కడ' ను, యింగము లీలలు నిండె నచ్చటన్

1092. రెక్కలు లేని పర్వతము రివ్వున వేరొక పర్వతమ్ముపై
నెక్కొని నట్లుగా – దిటవు, నేరుపు – దీర్చగ గూరుచుండె నా
చక్కని మూర్తి – మారుతి, యసాధ్యుడు; ప్రక్కగ జాంబవంతు డా
ప్రక్కగ వాలి పుత్రుడు నవశ్యము జేరిరి, మించు వేడ్కగన్

1093. పిన్నవయస్కులు ఏనుగు
గున్నను గని మురియు విధము - కొంచెము దాపై,
యన్నను హనుమన్న దడవి,
సన్నగ జిలిబిలి సరగున సంరంభించన్

1094. కొందఱు దుంపలు; ఫలములు
కొందఱు నందించి హరికి గూర్చిరి ముద మా
చందము, నందము - నెడదల
బందుగుల మమతల తీపి పంటయె యనగన్!

1095. అందఱు జూచి, చూచి, తమ యందఱి లోనను పెద్దవారి కా
నంద సుహృచ్ఛటల్ నయగుణంబున నిండుగ దోయిలించి, యా
సుందర మూర్తి యందుకొనె; శోధిత శోభన భద్రవార్తనే
యందుకొనంగ మీకిదుదు - నాయమ సేమము చిత్తగింపుడీ!

1096. అనుమాటల్ వినినంత, నంతకును వేయంతల్ రెట్టింపులౌ
ననుమోద ప్రమదమ్ము లేసర, గపుల్- 'యౌరా - సఖా- ఆంజనే
య నినుం బంపిన శ్రేష్ఠనాయకుల భావ్యర్థమ్ము సంఖ్యేయమే
నని దృష్టాంతము జూపినావు - బళి - సత్యాత్మైక యోగమ్మునన్'

1097. అని, శతానేక మభినంద నాదు లనిరి,
జాంబవంతుడు కన్ జెమర్చ - హరి బుజము
దట్టె, నంగదుం డలతి కదలిక - జేత
చేయి వేసి నొక్కి, హసించె, జెంతజేరె!

1098. కొదుకక జ్ఞాన వృద్ధులు, సఖుల్ - తన కిచ్చిన మన్ననల్ - రసా
స్పదమగు శ్లాఘముల్ గొనెను - వానరమూర్తి నయంబు నెంచి యే
బదులును బల్కకుండ దన పాత్ర కుదాత్తత నింపె, నింపె, నిం
పొదవెడు హ్లాద సంపద, పదోన్నతి కయ్యదె తత్త్వమౌ నిలన్!



1099. కమ్మని జున్నుగడ్డ నొగి గట్టిగ కోసిన రీతి, మౌనమున్
గమ్మున నుండనీయక - సగమ్మున గోసెను - జాంబవంతు డ
ర్థమ్మును, నర్థవంతు, మఱి యాగతమైన ఫలమ్మదంతయున్
సమ్మద హేతుకం బయిన చందము సర్వులెఱుంగ నుండుటన్;

1100. తెమ్మెరబాలుగోరె - గపిధీర - తతస్వజ! మా మనోరథం
బిమ్మెయి నీ ప్రయాణ మది యేగతి సాగెనొ - లంకలో విశే
షమ్ములు, సీతగాథ - వరుసన్ వినగోరుట; లెస్స నా విధం
బిమ్ముగ, విస్తరమ్ముగను నిమ్మిక, నమ్మిక వాక్యకోవిదా!

1101. ఒక మహత్తర కార్యమ్ము నోపి, నిర్వ
హించినావు - నీవో ప్లవగేశ హనుమ!
ఎక్కడది లంక? మన దేశమెక్కడయ్య?
యెంతగా యెదిగితి వది యెంత యెత్తు!

1102. ఎంత సౌజన్యమో చూదు మెంత సౌహృ
దమ్మొ కను మనుమయ్య - మంత! కపులెల్ల
నీదు రాకను గుండెకు నిర్ధరించి
నిలచి; రర్థమ్మనిర్వచనీయమయ్య!

1103. సీత జూచితి నంచు వచించి నీవు
గుండె దడ కింత నిలకడ గూర్చినావు;
కళ్ళలో ప్రాణమది లేచె; గలత యడగె,
సర్వ మికమీద యగు గాక - స్వస్తి - శుభము!

1104. అని భాషించెడు జాంబవంతు గని, దీప్యత్పూర్వ బింబాస్యుడౌ
యనుకూలుండగు అంగదుం గనియె, నాహ్లాద వ్యవచ్ఛేద శాం
త నవోపాశ్రయముం, బరిస్థితిని, సన్నాహంబు, నా మీదటన్
దనదౌ రీతి ప్రయాణమున్, గ్రియల సంధానక్రమం బీయగన్

## దృష్టా సీతాదేవి..... కథాగ్రథనం

1105. గ్రథియించె హనుమ యుద్యమ
కథ సకలము - నెడ నెడ వెనుకకు లాగు నప
ప్రథలకు నుత్తరమిడి, సా
రథిగా నుండిన విభుకు - గరాంజలి నిడుచున్.

1106. రామ శాశ్వతైశ్వర్య - ఆ రామసీత,
తన్మహోదయ శీలంబు, ధర్మ కృతియె-
రావణ ప్రవృద్ధ, దశవక్త్ర ప్రవరుని,
నిశ్చిత ఘన తపోబలు - నిలువరించె!

**ద్విపద**

1107. అని ప్రయాణ విశేష మంతయు వినిచి,
వినిచె హనుమంత విద్వద్వివేకి,
లంకాధిదేవతాలంభము మొదలు
లంకాపురీ వైభవాంకము, చిక్క
లింకలకు వచించె లీలగా హనుమ,
లంకాపురము నిరాతంకము గాల్చి,
మరల మహాజలధరము లంఘించు
వరకు వినిచె - కపివరుడు మిత్రులకు,
"జీవితంబను నొక్క చిఱు నెఱవణి వి
భావమ్ము; నా - చేత స్వల్పాక్షరమ్ము!
సీతాసతీ పరీప్తి జడధి - నాదు
చేత - ఏరిన ముత్య చిదురులు నిజము!

1108. ఆనతి కానతుడ నయితి,
జానకి కప్రతికి బరమ సాధ్వికి నతి; నా
కీ నెఱి - గూర్చిన మాతకు
గోన ద్రిమ్మరిగ వినయగుంఫన మిత్తున్!



**ద్విపద**

1109. శీలవతీ మయి సీతమ్మ శోక
మాలంక బడబాగ్ని యన నిజమౌను!
శ్రీరామ నామ సంసేవనా సత్య
సారాశ్రయాధార - శాశ్వతీజాత,
చిక్కియున్నది - తల్లి సీత, రక్కసుల
చిక్కి, యున్నది మాత సీతమ్మ నవసి,
పేరుకా భూమిజ విషయ మశోక
మారు గాలాల కా పచట శోకమ్మె!

1110. నీ - నా - తల్లి మహా సహమ్ము! బడబాగ్నిన్ గుండెలో దాచె - ప
త్నీ నైర్మల్యము కన్నులన్ నిలిపి పాతవ్రత్య నైపథ్యమే
తానై, రాముని రాకనే మదికి ధ్యాతవ్యమ్ముగా నద్ది, లం
కా నైసర్గిక లక్షణమ్ము చెదరన్ గాంక్షించి కూర్చుండెగా!

1111. అని వివరంబు దెల్పి వినయానతు డయ్యెను, బాష్ప పూర్ణలో
చనుడగు పావమాని, తన స్వాంతమునన్ సతిసీత మూర్తియే
కొనలిడ, లో విశిష్టతను గూర్చిన యంశము వెల్వరించు సూ
చన నిడె - నిట్లు మీది క్షణ సంగ్రహ భావన ప్రస్తుతించగన్!

1112. విను వారల యాశంసన
మును మఱియు మనోగతిని, సముద్విగ్నతలన్,
గనుగొని, గమనించి, యపే
క్షను - నిజ కథనంబు గూర్చె, గపి ధూర్జటియున్

**ద్విపద**

1113. రక్కసీంద్రకు మఱి రక్కసి ఱేని
కుక్కరులు కపుల ఔన్నత్యగరిమ,
బ్రకటించి మన వాసి బలికి వచ్చితిని
సకలాసురగణ హృత్సారమడంగ;
మనము పోవలెను రామానుగామి

వనచర వార్ధియై - పాథోధి దాట;
దాటి, రక్కసి మూక ధాటి దూలిచియు
తాటయొలిచి, తున్మి, తూటాడ వలెను;
రాక్షస సంహృతి క్రతు నిర్వహణమె
యక్షర కావ్యమై యలరగావలెను!

1114. సీతాన్వేషణ గాథను
చేతోమోదమ్ము మీఱ జెప్పిన హనుమన్
ప్రీతి ప్రేక్ష నలరిచిరి
క్రోతుల గుమి, మౌనుల వలె కూర్చుండి యొగిన్,

1115. సత్య జ్ఞాన బ్రహ్మము
లత్యర్థ సమర్థములు, రహస్యచరితముల్,
ప్రత్యక్ష చరిత్రము - లవి
కృత్యాకృత్య నిభృతములు - కీశము చదువన్,

1116. చంద్రబింబ సమాకార సంజ్ఞ తనర,
వాంఛితార్థ ప్రదాయక వార్ధి పొంగ,
తత సుగంధానిలసుతసేవితము - కతము,
తెలిసి తెలియని సుకము నందించె - నచట!

1117. తమ కపి గాథ లోతు లెడదం గదలించగ మర్కటాదులా
సమయము - వెల్గు రేకల దిశాపరిచార ముహూర్తమంచు - భా
వమును; ఫలోత్కరమ్మొడిసి, భాసుర సత్త్వ విధేయులైరి, వి
న్ను మనుమ డన్నుకొల్పున కనుంగవ మోడ్చి, వచించె, నీ విధిన్

1118. "ఏదో జన్మములోనిది
పా, దేదో - సుకృతమునకు బరిభాషా రూ
పాదుల గూర్చితి కాబో
లీ దివ్యకథనమును గ్రథియించితి నేనున్"



1119. అని వినయార్ద్రమౌ పలుకు లందగ జేసిన కావ్యకర్తనున్
గని, కపిముఖ్యులంత దమ కార్యము నిశ్చిత రూపమంద - చ
ప్పున రఘురాము, మర్కట నృపుంగవు జేరుట యుక్తమంచు - భా
వన మొనరించి సాగిరటుపై ఘటనంబులు - దారిదప్పగన్!

## అడుగు చివర హంసపాదు

1120. కీశగణ మటనుండి కిష్కింధకేగు
మార్గమందున - కనువిందు - మధువనంబు
గనిరి, యద్దాని మానోజ్ఞమునకు మురిసి,
యచటి మధువాన దమకించి, యర్థినించి,

1121. అంగదుని యనుమోదన మందు కొనుచు,
వృద్ధ లాంగూల వీర సంవిత్తి నంది,
మధువనము లోని కరుగ సమ్మదము రేగె,
రేగె - హర్ష రసావేశ ప్రేంఖణంబు!

1122. అచ్చటి సైన్యుడౌ దధిముఖాఖ్యుడు - తీంద్ర జరించుచున్న యా
హెచ్చుల కోనద్రిమ్మరుల యేపును, దుందుడు కాటపాటలన్,
రెచ్చిన వర్తనమ్మును బరీక్షగ, నోర్చున, జూచిచూచి, క్రో
ధోచ్ఛతరారుణాంబక విధూత సుభాషిత పంక్తి గూర్చగన్,

1123. తగు యత్నమునకు దా బూ
నగ, వానర వర్గమెల్ల నగి, వెటకారం
బగడుల, బలుపోకల బో
వగ, నంగదుడున్ దధిముఖు వంద్యుని దన్నెన్!

1124. ఆగతములకు నున్నవి హద్దులింక,
సహన మది గచ్చపొద పొసంగు నంచు,
దదిముఖుడు, వనపాలు రా తరణిసూను,
తరణి వంశ్యుల కడకేగి - వరుస, వరుస-

1125. కోతి చేష్టల, దుశ్చేష్ట గుణితమెల్ల
వినిచి, విలపించి, కోపించి, వెల్కబాఱ;
రామ లక్ష్మణాదులు విచారమున నిలిచి
యట్టి సందర్భ మాసన్న మగుట, వగచి,

**సుముఖి**

1126. వగచిన వెంట, వనౌకస వీ
రగణములా సరణి న్నెద యా
డగ కతమెన్నుట; సాధిత కా
ర్యగతుల తర్కమవశ్యముగాన్

1127. తలచిరి – క్రోతి దళమ్మది ని
శ్చలజను గాంచి సకామునిగా
నెలమిని మల్లు హితంబును దా
మలరుచు నుండి రటం చటుపై

1128. అనునయ వాక్య మపేక్షితమున్
వినిచిన మీద, త్విషాంపతి నం
దనుడును తోట తలాకుల కి
ట్లనె 'జనకోద్వహ గాంచుటచేన్

1129. కపి నికరంబు – కరంబగు హ
ర్ష పరిగృహీత సపీతి విహా
ర పరవశాప్తి బ్రవర్తిలి రే
నెపమును నెన్న నివృత్తిగతిన్!

1130. హరివరు లంద రదృష్ట వరుల్
మరకటు లర్హ మహోద్యములే
అరమరలేని అభీకులు – గాన్
దొరయదు వారి దొసం గరటై!



1131. అని మదిలోని పల్కు రచనార్థత యేర్పడ జెప్పినట్టి యా
దినకరసూను భావము పదింబది తీర్పుగ నర్థమౌట – త
ద్వన పరిపాలకుల్ తరణివంశ్యుల జూచి నమస్కరించుచున్,
వనచర శ్రేష్ఠుడౌ హనుమ ప్రాధనికమ్ము స్తుతించి, రాపయిన్

1132. సుగ్రీవుండనె నెల్ల వారలకు – హెచ్చుల్వోయినన్ గీశ ఖే
లాగ్రామ్యమ్ము శ్రుతి ప్రియంబగుచు లీలార్థంబు సర్వంబునున్,
సుగ్రామ్యమ్మొనరించె మాకు; నిక బూజ్యుల్ జాంబవంతాదు లా
యగ్ర శ్రేణి కపీశ కోటికి సమాహ్లాదంబు నందించుడీ!

1133. వారిని మన్నించితి మా
తీరున్ క్షమియించినాము – తీయటి వార్తల్
కూరుపు దీసిన కతమున;
వారికి మా మాటగ నిది వచియించవలెన్,

1134. మీరేగి వేగముగ – న
వ్వారిని వేవేగ బంపవలె, హనుమంతుం
ద్వారము సీతాస్థితి సం
భారపు మాకంద మింక మా కందవలెన్

1135. దధిముఖుండు యథాగత త్వర జని కపి
జనమునకు దన పొరపాటు, నినజు నాన
వినిచి, వినిచె దక్కుంగల ఘనుల గూర్చి,
దాశరథి గూర్చి, రామ మందరము గూర్చి!

1136. తదుపరి ఆంజనేయుడు, లతామృగ వర్గము, యంగదాదులున్
బదము గదల్చి చేరి రట ప్రస్రవణాద్రికి; సూర్యవంశ్యులన్
విదిత యశస్కుడైన విభు వీక్షణజేసి రనంతరమ్ము – స
మ్ముదమును గూర్చు సీతకథ ముఖ్యనిబంధనమయ్యె నాయెడన్

1137. అపరాజిత తేజోనిధి
కపిధూర్జటి ఆంజనేయ ఘనమతి యనియెన్,
కపిరథునకు మ్రొక్కి కథన
కపిశీర్షసమశుభవాచక ధ్వని మ్రోయన్!

### శుభవాచకమంగళ ధ్వని – సీత కథానివేదనము – శుభమస్తు తరంగము

1138. రామసతిసీత – సుచరిత – రామనియత,
ప్రాణయుక్తను దర్శించి వచ్చినాను,
రామదర్శన కాంక్షయే రామకనుల
గంటి; గనుగొంటి రామ సౌగంధ్యధామ!

1139. అమృత ప్రాయంబగు నా
సమయజ్ఞుని వార్త రాము స్వాంతంబునకున్,
సమవాయ మలదె నితవై
సమర్థన స్పర్శ మన్య జనులను దాకెన్

1140. పరమ హర్షమ్ము వార్ధియై పరవశించ,
వానరులు వావిడిచినారు వాలమంది;
వారి చర్యలు ఫక్కిక వలను కాదు
'వ్రాలు' పదమది నానార్థ ఫణితమయ్యె!

1141. అన్నకు దగ్గ తమ్ముడయినట్టి సుమిత్ర కుమారుడంత – రా
మన్నను గన్ జెమర్పుల ప్రియత్వము ముంచుచు జూచె, నప్పుడా
యన్న యనుంగు తమ్ము కొక హర్షణమందగ జేసి, తానొగిన్
గన్నుల నీటి మూటను సగమ్ము నెడందకు బంపె, దత్తఅన్

1142. సద్దుమణగెను, కల్లోల సంద్ర మడగ,
జాంబవంతు డడిగె వాయుజన్ము – "హనుమ,
చేసి చేయని చేదోడు చెలిమరులకు
గాథ మొత్తము వినెడు సత్కారమిమ్ము!"

1143. అనెడు కోర్కె కనుమతించి యనుమడంత
నవ్యథితము, నవిస్తరమైన ఫణితి
గూర్చి, యవిలంబిత మగుచు కొదలు లేక,
సంశయము తొలగించు వాక్చయము నిచ్చె!



**పారిజాతము**

1144. ఇచ్చె – వాయు నందనుం డెడంద పొంగ సీత తా
నిచ్చి నట్టి భూషణం బెడందతీపి గుర్తునున్
ముచ్చటౌ శిరోమణిన్, భురిణ్యవంశ చంద్రు క
భ్యుచ్చయాభివందనం బమూల్య కాన్క జేయుచున్!

1145. ఆ మణి గై కొని రాము డభిప్రీతి
సంభ్రమ, వివశత్వ చలితభావ
భవ బాష్పపూర్ణ విశ్వంకరు డున్మిషి
తాన్వీక్ష నుద్విగ్నుడయ్యె నపుడు;
భుజదండ ఖరదండ పోషితాభ్యుత్థాన
కోదండ మొక్కింత గూర్చుకొంచు
జూచె జూడామణి; జూపోపి కనుగ్రుడ్డు
గదలించ దడిచూపు కపిని జూచె;
నంత విశ్వంభరాపుత్రి యార్యు దంత
నిట్ట నిలువెత్తు మనిషి మనీషపటము–
చినుకు నాబ నాహ్వానించు చివురె యయ్యె!
యెదయెఱుంగును – బంధాల మెదువు, బిగువు!

1146. అనుగుందమ్ముని కేమొ చెప్పునన డాయంజేరు, దుఃఖంబుపై
కొన – మాటల్ తన నాడి యంతరము లో గొన్నట్లుగా నుగ్గబ
ట్టును; మూగై– దెసలన్ గనున్; సుహృదయుండున్, స్నిగ్ధ సుగ్రీవుకై–
జనితోద్విగ్న వివర్ణతా వదనుడై సంబుద్ధి యత్నించగన్

1147. ఎద – జనకాత్మజాపదము నెంచుచు నిల్వ, గళోక్తి సంచయం
బొదుగులు వోయి – లోనిలువ, నూర్పు నిగుడ్చెను శూన్యదృక్కులన్,
బదట మెఱింగి లక్ష్మణుడు, పావని, దిశ్యకరాత్మజుండునున్
గొతుకుచు దుఃఖమగ్నుడు – రఘూత్తము – నెమ్మది నూరడించగన్

1148. విధికృత లీలార్థము లే
విధి గొనవలయునొ జనంబు, వివరించగ నీ
వధిగత విజ్ఞానివి, ధీ
నిధి విటు లాకులపడదగునే శ్రీరామా?!

1149. అని సుగ్రీవుడు, జాంబవంతుడు – సుధాలాపంబులన్ జేసి, రా
మునికిన్ భద్రము జెప్పిరా పిదప, రాముండున్ శిరోభూషణం
బున ధాత్రీ సుతయే కనంబడుట , నా పోకల్ ప్రకాశించుటన్,
వినిపించెన్ – క్షణశః ప్రతీక్షమెయి సంవిత్తిన్ వినన్ వానరుల్

1150. అసదృశ ఫణితిని రాఘవు
డొసగె శిరోమణి విశేష మొప్పుగ, నుర్వీ
రస సంభూత మని, జనక
వసుధేశు కనిమిషదత్త బహుమతి యనుచున్

1151. ఆదట రామమూర్తి కపులందఱజూచుచు, నాంజనేయుకున్
సాదర, సౌమ్య, సౌహృదము, సమ్మతి గుచ్ఛములిచ్చి, యోగ్యతా
పాదనమీఱ, జేరజని, వాంఛిత వార్త సవిస్తరంబుగా
నూదుమటంచు గోర, హరి యూర్జిత వాక్చయ మచ్చువోయుచున్

1152. దాశరథి మనోహరి, సీతావధూటి,
బాష్పపూర్ణలోచన – పల్కి పల్కనట్టి
దీనవచన ప్రచురము, సందేశ ఫణితి,
దన కనుల బాష్పము లురల – ననియె, బిదప,

1153. కాకాసుర వృత్తాంతము,
నేకాంతము, సల్లలితము, లిచ్ఛావ్యాహా
రాకలన మభిజ్ఞానము
గా – కపి యందించె, సీత కఱద – ప్రియోక్తిన్



1154. అంత, దా నా యశోక వనాంతరమున
సీత నూరార్చిన విధము జెప్పె – హనుమ,
"శౌర్యధనులు శ్రీరామ లక్ష్మణులు – జేరి
లంక వచ్చి ముంచెత్తగలరని యంటి"

1155. "ఎల్ల ఇడుముల కాలము చెల్లె నంటి,
రామలక్ష్మణ సుగ్రీవ సోమ మింక
దశముఖాది రాక్షసుల సాధనము గూర్చు
నంటి – ధైర్యమ్ము నందు కొమ్మంటి నయ్య"

1156. ఆయెను, పోవు దుర్నయము, లాపద లీపయి తీరునంటి, మీ
రాయత కీశవర్గము సహాయులరై యటు లంక జేరి, దు
ర్ధీయత రావణాదుల వధింతు రటంచును ధైర్య మిచ్చితిన్,
శ్రేయము, దీయముల్ దనర శ్రేయ మయోధ్యకు నిత్తురంటి నేన్!

1157. సీతారాములు పూజ్యులు
చేతోమోదమ్ము మీఱ శ్రేయస్కరులై
జ్ఞాతి స్ఫురణ నయోధ్యా
స్ఫాతిన్ రాజ్యాభిషేక భాస్వంతులరై–

1158. ఆదర్శ దంపతులుగా
మేదిని నిల్తురనుచు దగు మేలిమి పలుకుల్
నాదగు రీతిని మంగళ
మూదితి; ప్రియమును, శుభాశ సూదితి స్వామీ"!

1159. చేయదగినంత చేసితి; జేతలెల్ల
యవనితనయ గుణమహిమ మయ్య – రామ,
చేయవలసిన దంత మీచేత నుండె
తత్త్వమది మీది, మీదౌను సత్త్వమైన!

1160. అనుచు; స్తుతియించసాగె నా హనుమ యపుడు,
రాజు సుగ్రీవు, జానకి, రామచంద్రు;
లక్ష్మణ సుహృదమూర్తుల - లంబు, జిగిని;
వనచర వ్రాతమది పరవశము నంద!

**పద్మనాభ వృత్తము**

1161. శ్రీరామ! విశ్వంభరాపుత్రి చిత్తాబ్జసీమా ప్రవిష్ట ప్రభావాంశు కామా!
శ్రీరామ రామామణీ! సీత! సుశ్లోక రిష్టప్రదాతా, సుచేతః ప్రపూతా!
శ్రీరామ రామాభవిష్యార్థ లక్ష్యార్థశీలా, సుమిత్రాప్త వాత్సల్యజాలా!
శ్రీరామ సంభావనాకల్ప సంకల్ప చేతః ప్రమేయా- హరీ - ఆంజనేయా!

1162. శ్రీదము - రామస్వాంతము,
శ్రీదము సీతా కటాక్ష శీతస్ఫీతం
బాదర్శిత మాధుర్య క
థాదర్శము సుందర మిది యానందించన్!

శ్రీశ్రీశ్రీ

★★★



'బిందువులో సింధువు'ను చూడగలిగిన ద్రష్ట 'కవి మననధార మానవత'గా చాటుతూ చైతన్య గమనం చేస్తున్న నిత్యసత్యాన్వేషి, నిరంతర సాహిత్య విద్యార్థి:

## జే. యస్. మూర్తి (విహారి)

జననం: 15-10-1941, విద్యార్హతలు : ఎం.ఏ., ఇన్సూరెన్స్‌లో ఫెలోషిప్, హ్యూమన్ రిసోర్సెస్ మేనేజ్‌మెంట్, జర్నలిజం వంటి ఇతర అంశాలలో డిప్లొమాలు, సర్టిఫికెట్స్, ప్రచురిత వ్యాసాలు.

- తెలుగులోని అన్ని ప్రసిద్ధ పత్రికల్లోను అసంఖ్యాకంగా కథలు, నవలలు, సాహిత్య వ్యాసాలు, గ్రంథ సమీక్షలు, నాటికలు, కవితలు ప్రచురింపబడినవి. వివిధ అంశాలపై ఆకాశవాణిలో, దూరదర్శన్‌లో ప్రసంగించడం జరిగింది. వక్త, కార్యకర్త.
- 10 కథాసంకలనాలు, 5 నవలలు, ఒక విమర్శనాత్మక వ్యాససంపుటి, ఒక సాహిత్య కదంబం, 4 కవితా సంపుటాలు- పుస్తకరూపంలో వచ్చాయి. ప్రముఖ రచయితల, విమర్శకుల ప్రశంసల్ని పొందాయి.
- 'పళ్ళచక్రం' కథా సంపుటికి శాలివాహనతో జంటగా-ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత. ఆంధ్రసచిత్ర వారపత్రికలో 5 సార్లు బహుమతి పొందడం విశేషం. అనేక ఇతర బహుమతులూ పొందారు.
- 26 ఏళ్ళనుంచీ గడియారం వేంకట శేషశాస్త్రి అవార్డ్ నిస్తున్న సంస్థ - కడప రచన సాహిత్య వేదిక అధ్యక్షుడు.
- విహారి రచనలపై పిహెచ్.డి.కి పరిశోధన జరిగింది (ఉస్మానియా).
- శ్రీ పదచిత్ర రామాయణం ఛందస్సుందర పద్యకావ్యంగా ఆరు కాండలూ వ్రాశారు. ప్రముఖ కవి, పండిత ప్రశంసల్ని పొందారు.
- "కవిపాదుషా" పువ్వాడ శేషగిరిరావు స్మారక సాహితీ పురస్కార గ్రహీత.
- డాక్టర్ పరుచూరి రాజారాం స్మారక సాహితీ పురస్కార గ్రహీత.
- ప్రస్తుతం 'వార్త' , 'ఆంధ్రప్రభ' రెండు పత్రికల్లోనూ 'కథావిహారం', 'తెలుగుకథ తేజో రేఖలు' శీర్షికలు నిర్వహిస్తున్నారు. విస్తృతంగా కథలు, సాహిత్య వ్యాసాలు రాస్తున్నారు.

# విహారి కథానికలపై కొందరు ప్రముఖుల, పఠితల అభిప్రాయాలు, వ్యాఖ్యలు

'వాక్యం రచయిత తయారు చేసినట్టుండకూడదు. జనుల అనుదిన వ్యవహార శైలి నుంచే ఊడిపడినట్టుండాలి. కథ కల్పించి చెప్పినట్టుండ కూడదు. సమాజ జీవన పటం నుంచే శిల్ప సమన్వితంగా కత్తిరించిన మచ్చుతునకలా వుండాలి. సందేశం వాచ్యంగా వుండకూడదు. వంగ్యవైభవంతో గుండెల్లో ధ్వనించాలి. ముచ్చటైన యీ మూడు లక్షణాలకూ విహారి కథలను వినూత్న ఉదాహరణలుగా పేర్కొనవచ్చు'

**–మధురాంతకం రాజారాం**

"విహారిని ఈనాడు ఎవరూ భుజం తట్టనక్కరలేదు కూడా. ఆయన కవి, కథకుడు, నవలా రచయిత, నాటక ప్రయోక్త, వ్యాసకర్త. పాఠకులకు సుపరిచితుడు. ఆయనలోని కవి విజృంభించనప్పుడు కథలో ఆత్మాశ్రయ రీతిలో జోక్యం కలుగచేసుకోనప్పుడు–'నిప్పు' వంటి జీవిత వాస్తవ కథలు వెలువడి మనల్ని ప్రశ్నిస్తున్నాయి; వెంటాడుతున్నాయి. మన జీవితాల్ని సరిచేసుకోవలసిన అవసరాన్ని అనుభూతం చేస్తున్నాయి."

**–డా॥ కేతు విశ్వనాథరెడ్డి**

" విహారి కథలన్నిటిలోనూ ఆత్మపరిశీలన, ఆత్మసంస్కారం– వాస్తవికతా దృష్టికి వన్నెతెచ్చి మట్టిని బంగారం చేస్తోంది. విహారి ఆశావాది. జీవితంపట్ల, తోటి మానవునిపట్ల ఆయనకు గల విశ్వాసం గొప్పది"

**–ఆర్.యస్.సుదర్శనం**

"విహారి మనకున్న కొద్దిమంది మంచి కథా రచయితలలో 'ఎన్నదగిన రచయిత'– అనేవి యీయన వెనకాతల మిత్రులు అనుకొనే మాటలు"

**–వీరాజీ**

"విహారి కథలలో ఒక ఆర్ద్రభావమూ, మానవ సంబంధాలలో ఉండవలసిన నాజూకు తనమూ, సృజన సుకుమారత–ఆహ్లాదం కలిగిస్తున్నాయి'

**–మంజుశ్రీ**

"ఇవీ మా తెలుగు కథలు అని గర్వంగా చెప్పుకొనేంతటి మాస్టర్ పీసెస్–స్పృహ, చలనం కథలు. ఎత్తుపల్లాలు, చలనం, నిప్పు–వంటివి ఎప్పుడోగాని రానివి. గాలివానలాగా ప్రపంచ కథానికల్లో చోటుచేసుకోగల సత్తావున్న కథ– 'నిప్పు'.

**–పి.యస్.యస్.శాస్త్రి**



'నిప్పు కథానిక అత్యద్భుతం. మీ ప్రచండమైన శైలీ వేగానికీ, కవితా భావాలకూ వస్తువిలక్షణతకీ, శిల్ప శిఖరాలకూ అభినందనం. ఈ కథ చాలు. విమర్శకాగ్రేసర చక్రవర్తులు మీ స్థానాన్ని కాళీపట్నం పక్కనో, రాచకొండ పక్కనో, బీనాదేవి పక్కనో, కూర్చోబెట్టటానికి."

**–కె.విజయప్రసాద్**

"కథా శిల్పం వుణికి పుచ్చుకున్న విహారిలాంటి వాళ్ళకి ఏది రాయాలన్న సమస్య రాదు. ఏది రాయకూడదనేదే అప్పుడప్పుడూ సమస్య అవుతుంది"

**–డా॥ పరుచూరి రాజారామ్**

"చలిలో సూర్యుడు కథ ఒక మాస్టర్ పీస్. ఈ కథ ఇతర భారతీయ భాషలన్నిటిలోకి అనువాదం కావాలి"

**–పి.వెంకటేశ్వర్లు**

"గుండెలో కోయిల–అనిర్వచనీయమైన భావానికి అత్యుత్తమ రూపకల్పన. విశ్వనాథ్ వంటి ఉత్తమ దర్శకులు చిత్రీకరించవలసిన ఆణిముత్యం లాంటి కథ ఇది"

**–జి.సి.ప్రసాద్**

"క్షుణ్ణంగా సాహిత్యాన్నీ, జీవితాన్ని చదివిన అనుభవశాలి, మేధావి మీరు. కనుకనే గొప్ప రచయిత, కవి... అయ్యారు. మీ పద్యఃస్ఫూర్తి గొప్పది. నాకు ఒకటే విచారం–మీ కథల్లోని తాత్విక చింతన, శిల్పకల్పనము, శైలీ విశిష్టతల మీద ప్రత్యేక వ్యాసాలు రాలేదే అని. మేము గర్వించే రచయితలు మీరు'.

**–పార్థసారధి**

"అందరూ ఆడిపోసుకొనే మధ్యతరగతి మందహాసాల వెనుక దాగిన సింబల్స్‌ను, ప్రత్యేకతలను ఔపోసన పట్టిన కథకుడు విహారి... (వీరి కథలు) ఆధునిక కల్లోలాల మీద కరదీపికల్లాంటివి. సాధారణ వ్యావహారిక సత్యానికి గూడా సాహిత్యగౌరవం, తాత్త్వికౌన్నత్యం ఇవ్వగలిగిన – కళాత్మక కుంచె – వీరి కలం".

**–మునిపల్లె రాజు**

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత

"ఈ సంపుటిలోని కథానికలు వన్నెవన్నెల బతుకుతీరుల చిత్రాలు. మనస్సు లోలోపలి కలవరాల, కలతల కసిడికోతల వెతలు... ఇవన్నీ 2007లో రాసిన కథానికలు. మనసు లోలోపలకు జొరబారే కథానికలు".

**–డా॥ పోరంకి దక్షిణామూర్తి**

# విహారి రచనలు

1. స్పృహ (కథలు)
2. చలనమ్ (కవిత)
3. గోరంతదీపం (కథలు)
4. గుండెలో కోయిల (కథలు)
5. అక్షరం (కథలు)
6. కలం కన్ను (కవిత)
7. చీకటి నాణెం (కథా కావ్యం)
8. సమీక్ష (వ్యాసాలు)
9. మనం మనం (కదంబం)
10. అమ్మ పేరు చీకటి (కథలు)
11. బొంగరం (కథలు)
12. శ్రీ పదచిత్ర రామాయణము (బాలకాండము)
13. కథాకృతి (పరిచయాలు–పరామర్శలు)
14. మధ్య'మా'గతి (కవిత్వం)
15. తెలుగు కథ – తేజోరేఖలు (కథావిశ్లేషణ)
16. కథా 'విహార'ం

(14–16: అచ్చులో)

★ ★ ★ ★

## శ్రీ పదచిత్ర రామాయణము

★

**పద్యకావ్యము**

★

(మిగిలిన కాండలు అచ్చులో)

★ ★ ★ ★

# శ్రీ పదచిత్ర రామాయణము

## సుందరకాండము

**పద్య కావ్యము**

## విహారి

**Sri Padachitra Ramayanamu**

Sundarakandamu

(Poetry)

**by Vihaari**



**జూలై 2009**

*టైటిల్ ఆర్టిస్ట్*
**బాపు**

*డిజైనింగ్-బుక్‌మేకింగ్*
**మను గ్రాఫిక్స్**
చిక్కడపల్లి, హైదరాబాద్-20, ఫోన్ : 27633574

*ముద్రణ*
**వేణు గ్రాఫిక్స్**
నల్లకుంట, హైదరాబాద్-500 044
ఫోన్ : 040-27605769

వెల : **రూ. 100/-**

*ప్రతులకు*
**జే.యస్.మూర్తి**
16-11-310/12/ఎ/1/1, సలీమ్‌నగర్-2
మలక్‌పేట, హైదరాబాద్ - 500 036
ఫోన్ : 040-24552117 & 9848025600
మరియు
**ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు**